ఆంధ్రసచిత్రవార

# పత్రిక

12-1-1962

# సంక్రాంతి సంచిక

వ్యాస రచన పోటీ.

'ఏడుకొండలు' సీరియల్ ప్రారంభం





బడికి ప్రయాణం

ఫొటో : ఎస్. సీతాపతిరావు (మద్రాసు)



ఫిలిప్స్ ఫిలిటినా B2CA99U
ఎసి/డిసి. ధర రు. 187/-



ఫిలిప్స్ ఫిలలిటా B3CA07U
3 బ్యాండులు, 5 వాల్వు
ధర రు. 308/-



ఫిలిప్స్ మయినరు B4CA07A
4 బ్యాండులు–6 వాల్వు
ధర రు. 405/-

9 ట్రాన్సిస్టరు రేడియో B4CA07T
రు. 510/-

# అందానికి, ఆనందానికి
# అగ్రస్థానం
# 1962
# ఫిలిప్స్
# నోవోసోనిక్
# రేడియోలు

నాదములో ఒక
నూతన ప్రపంచము






ఫిలిప్స్ మాస్టరో B6CA86A
8 వాల్వు – డబుల్ స్పీకర్సు
ధర రు. 957/-



ఫిలిప్స్ ఇంటర్నేషనల్
B4CA97A–6 వాల్వులు–4 బ్యాండ్లు
ధర రు. 551/-



ఫిలిప్స్ మేజరు డబుల్ స్పీకర్సు
B5CA86A – 7 వాల్వు
ధర రు. 695/-



ఫిలిప్స్ ట్రాన్సిస్టరు రేడియో
ఫిలిప్స్ B5CA06T
ధర రు. 690/-

పన్నులు అదనము

అనుమతి పొందిన ఫిలిప్స్ రేడియో డీలర్లు - విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలకు :

టెలిగ్రాం : "పాండ్"

# వైజాగు రేడియో కో.,

ఫోన్ : 120

విశాఖపట్నం - శ్రీకాకుళం

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!**

# ఉత్తరాలు

## ముఖచిత్రకథ

"మడీ, గుమ్మడీ" ముఖచిత్రం కథ చాలా బాగుగా నున్నది. ఇటుపైని గూడ నటీనటుల ముఖచిత్ర కథలను వ్రాస్తూ ఉంటారని ఆశిస్తున్నాను.

కె. వైకుంఠరావు (హిరాకుడ్ డామ్)

* * *

నా అభిమాన నటులైన శ్రీ గుమ్మడి వెంకటేశ్వర రావుగార్ని గురించి తెలియపరచినందులకు చాల సంతోషం. ఆయన నటించిన ప్రతి చిత్రం తప్పక చూడాలనిపిస్తుంది. పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గాను, జమీందారుగాను ఆయన రాణించినట్లు మరెవ్వరు రాణించలేరని నా అభిప్రాయము. భార్యాభర్తలు, సాక్షిరాముడు వగైరాలలో దుష్టులైన పుత్రులకు తండ్రిగా ఆయన పడిన బాధ, వాడిన మాటలు ఎన్నటికీ మరువరానివి.

పి. ఎస్. కుమారి (రాజమండ్రి)

## కథకానికథలు

'కథకానికథ' శీర్షిక క్రింద ప్రచురించిన పురానే జవాబు' అనే మొదటి బహుమతి మీద జరుగుతున్న విమర్శకు దీనిని సమాధానముగా ప్రచురించవలసినదిగా కోరుతున్నాను.

పై కథలో చాలమంది నాగపూర్‌లో జరిగినది టెస్టు మ్యాచ్ కాదని, అది టెస్టు మ్యాచ్ అని శ్రీ ఆర్. ఎల్. కాంతారావుగారు వ్రాశారు కాబట్టి అది పచ్చి కోత అని కొంతమంది విమర్శకులు వ్రాశారు.

ఈ విషయము అసలు కథకు సంబంధించినది కాదు. అటువంటి సంబంధములేని విషయమును ఆధారముగా తీసుకొని విమర్శించ బూనడం అర్థంలేనిపని. ఆ తరువాత అందులోనే "రెండు రోజుల క్రితము యిచ్చిన లెఖ్క" అని వ్రాసి ఉన్నది. దీనినిబట్టే అది ఎగ్జిబిషన్ మ్యాచ్ కాని టెస్టు మ్యాచ్ కాదని తెలుస్తున్నది. అందువల్ల అది పొరపాటున వ్రాయటము జరిగినదని అర్థమవుతుంది. ఇంత చిన్న విషయమును అర్థము చేసుకొనకుండా, విమర్శకు దిగి, విమర్శకులు తమ పరిజ్ఞానమును, బహుమతి రాలేదన్న ఉక్రోషమును, పేరు పత్రికలో పడవలెనన్న ఆకాంక్షను వెల్లడించుకున్నారు.

పి. మధు (నరసరావుపేట)

## చదువుల్రావు

మీ చదువుల్రావుగారి చొక్కా యేం బాగాలేదు. ముందున్న ఫాన్సీ బనియనే బావుంది.

టి. వి. గుప్త (పుంగనూరు)

## కార్టూన్

నాకు "సావిత్రి" నటించిన చిత్రాలంటే చాలా ఇష్టము. వారిని బాపుగారు కార్టూన్ ద్వారా పరిచయం చేసినందుకు చాలా సంతోషిస్తున్నాను.

బియ్యం, ప్రభు (హైదరాబాదు)

## సినీవిహారం

మధుమూర్తిగారి 'ఈవారం సినీవిహారం' లో అన్నీ క్రొంగొత్త, సరికొత్త వార్తలే అవటంవల్ల చాలా బాగుంది. ముఖ్యంగా "గుండమ్మకథ" లో నాగేశ్వరరావు నూరో చిత్రం అవుతుం దనగానే, వారి అరవయ్యో చిత్రం "దొంగల్లో దొర"(రజతోత్సవం) జ్ఞాపకం వొచ్చింది. శత చిత్రనటుడు శ్రీ నాగేశ్వరరావుగారికి మా శుభాకాంక్షలర్పిస్తున్నాము. ఇక పోతే ఇటువంటి సరికొత్త పోకడలను ఇటుపై గూడ అందజేస్తారని మధుమూర్తిగార్కి మా ధన్యవాదా లర్పిస్తున్నాం.

మోటూరి సన్యాసిరావు (మామిడివాడ)

## స్వయంవరం

శ్రీమతి దేవికగారు రాసిన వ్యాసం చదువుతుంటే మా మిత్రులు నవ్వ మొదలుపెట్టినారు. దేవిక గారు నటనలో మాత్రమే కాదు, వ్యాసాలు కూడ బాగ వ్రాయగలరని బుజువు చేసుకున్నారు. ఇన్ని దినాలు దేవిక గారికి వివాహము అయినది అనుకొన్నాము. ఆమె కుమారియే అన్నమాట !

బి. ఎస్. పద్మనాభం,
ఎస్. సుధాకర్ (హైదరాబాదు)

* * *

దేవిక గారి స్వయంవరం చదువుతుంటే శృంగార నైషధంలో దమయంతి స్వయంవరం గుర్తుకు వస్తుంది. దిక్పాలురు తమ ప్రజ్ఞావిశేషాల్ని దమయంతి కెరుకపరచి, తమలో ఎవరినైనను వరించునట్లు చేయవలసిందిగా నలుని రాయబారిగా పంపుతారట. అలాగే కొందరు సోదర యువకులు తమను వరించవలసిందిగా లేఖలు వ్రాసినట్లు ఆమె పేర్కొన్నది. ఇది చూస్తుంటే సంతోషము, విచారము రెండు ఒకే సారి కలుగుతున్నాయి. మనమంతా చాల ముందడుగు వేశామని గర్విస్తున్నాం. కాని ఇది చూచినపుడు మనలో ఏపాటి నాగరికతా లక్షణాలున్నవో స్పష్టపడుతుంది. మనకు మనము ఎంత విలువ యిచ్చుకుంటామో అలాగే ఎదుటివారికి కూడ యివ్వడము భావ్యము. దేవికగారి జవాబు సముచితంగా ఉంది. వివాహ మనేది కేవలం మూడు ముళ్ళు వెయ్యడం కాదు.

కె. ఎ. రెడ్డి (కోదండపాలెం)

* * *

సినీ నటి దేవికగారు అక్కా, చెల్లి, వదిన, అమ్మా అని వ్రాసినవారిపట్ల చూపిన జాలి, కరుణ, డార్లింగ్, డియర్, ప్రేయసీ, మనోహరీ అని వ్రాసిన వారిపై కూడా చూపినందుకు చాలా సంతోషిస్తున్నాను.

మల్కాపురం భాస్కర్ (సీతాఫల్‌మండి)

* * *

"స్వయంవరం" శీర్షికను ఇంతటితో ఆపక సినీతారల రాబోవు, మరియు వచ్చిన పిక్చర్ల తాలూకు లెటర్సును క్రిందటివారంలాగ ప్రకటిస్తే తెలుగు జనము సినీజీవులను అర్థము చేసుకొనే అవకాశము లభిస్తుంది. పాఠకజనముతో సినీతారల కోతలతో మా అభిమాన పత్రిక దేదీప్యమానంగ ప్రజ్వరిల్లుతుంది..

కె. చంద్రయ్య (హన్మకొండ)

## కథలు

'సబల' కథానిక చాల బావుంది. కాని 'మధురాంతకం'గారి యితర కథలు కల్పించినంత ఉత్కంఠను ఈ కథ కల్పించలేక పోయిందనే చెప్పవచ్చు.

సోకల మాలతి (విజయవాడ)

* * *

మధురాంతకం రాజారాంగారి "సబల" చెప్పలేనంత బాగా ఉంది. అంతం నన్ను చాలా ఆకర్షించింది.

మేడం రఘునాన్ (కర్నూలు)

* * * *

చంద్రమండల మధిరోహించు
రాకెట్టువోలె ......
చిట్టి పాపాయి చిరునవ్వు
గిలిగింతల వోలె ......
కంచు గంటను బోలు
కంఠంబు వోలె ......
అమరలోకంబునందలి ఆనంద
డోలికల వోలె ......
మరపురాని మధురమైన
బాధ వోలె ........
అబల "మీ" అబల కాని "సబల"
సబలే !! ......
భలే ! .... భలే ! ....
అందుకోండి అభివందనాల్ !

రాం, ధం, రత్నం (పిఠాపురం)

* * *

22—12—61 వ తేదీ సంచికలో ప్రచురింపబడిన "చలమయ్య పెళ్ళి" కథలో 56 వ పేజీలో "చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకున్న దురదృష్టహీనులు చలమయ్య, సుశీలలు" అని ప్రచురించారు. ఇది రచయితగారి పొరబాటా ? లేక మీ పొరబాటా ?

వేదగిరి సత్యనారాయణ (తుంగభద్రా డాం)

**పొరబాటయితే ఇద్దరిదీను.**

* * *

వాయని సత్యనారాయణరావ్ రచించిన "చిత్రమైన కామెడీ" కథ చాల రసవంతముగా ఉన్నది. రచయితకు నా ధన్యవాదాలు.

శిరం మార్కండేయులు (చిత్తూరు) ★



కాఫీకోసం
కొంచెంసేపు
మీ పని
ఆపండి







కాఫీ తృప్తినిస్తుంది

కాఫీ బోర్డు
బెంగుళూరు

"ప్రతిసారి మంచి కాఫీని తయారుచేయడం ఎలా"
అన్న ఉచిత కరపత్రంకోసం మాకు వ్రాయండి.

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు


ముఖచిత్రం:
సంక్రాంతి సంబరాలు
(బాపు)

## విషయానుక్రమణిక


శుక్రవారం : *12-1-62*

ప్లవ సం॥ పౌషమాసః శు॥ సప్తమి

సంపుటము : 54 సంచిక : 19

స్థాపితము:
1908

*

ముఖ్యసంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీథి, మద్రాసు-1


★

## లోకంపోకడ



"పార్టీ టిక్కెట్టు రాలేదని తెలిసి నప్పటినుంచి ఇలా ఉన్నారు."

# సంక్రాంతి సంకల్పాలు




అణ్వస్త్రాలు
మరికొన్ని
పేరుస్తా-
కెన్నెడీ





















పండిత మదనమోహనమాలవియా శతజయంత్యుత్సవం ఇటీవల జరిగింది.

# భారత జాతి కలకాలం స్మరించే వత్సరానికి వీడ్కోలు: నూతన వలస విధానానికి పరిస్థితుల ఆవిర్భావం

**శ్రీకృష్ణ**

**1961** సంవత్సరంలో భారతదేశం మహత్కార్యాలు సాధించింది. నాలుగుశతాబ్దాల పాటు భారతగడ్డ మీద తిష్ఠ వేసుకుని కూర్చున్న పోర్చుగీసువారి దురాక్రమణ ఈ ఏడే అంతమైంది. ఇది చరిత్రాత్మకమైన సంఘటన.

1498 మే 27 వ తేదీన వాస్కోడగామా భారత నైఋతితీరంలోని కాలికట్ రేవు పట్టణంలో అడుగుపెట్టాడు. అంతకు కొన్ని సంవత్సరాల పూర్వం పోర్చుగీసురాజు డాన్ జాన్ –2 దూత ఒకడు మలబార్ వచ్చాడు. వ్యాపారమే బ్రతుకుతెరువుగా భావించుకున్న పాశ్చాత్యరాజ్యాలు రెండు శతాబ్దాలు కన్న కలలు, 75 సంవత్సరాలు నిరంతరాయంగా జరిపిన కృషి ఫలితంగానే వాస్కోడగామా ఇక్కడకు చేరాడు.

రెండవదశ 1506 లో ఆఫాన్సో అల్బూకర్కే రాకతో ప్రారంభమైంది. భారతదేశంలో ఒక స్థావరం ఏర్పాటు చేసుకొనటమే అతడి ఆశయం. అందుకు ప్రయత్నించి బలి అయ్యాడు. అతడికి రెండు బలమైన గాయాలు తగిలాయి. ఒక తుపాకీ గుండు తగిలి నేల వాలాడు. భారతీయ పరిపాలకుల పరాక్రమాన్ని ఎదుర్కొంటూ తొలిసారిగా జరిగిన ప్రయత్నం ఈవిధంగా వీగిపోయింది. ఆ తరువాత 230 సంవత్సరాల వరకు మళ్లీ ఐరోపారాజ్యాలేవీ సైనిక శక్తితో స్థానిక పరిపాలకులను లొంగదీసుకొనేందుకుగాని, భారతభూభాగాన్ని జయించేందుకుగాని ప్రయత్నించలేదు.

ఈ విషయమై శ్రీ కె. ఎం. పణిక్కర్ ఇలా వ్రాశారు: "పోర్చుగీసువారు గోవాను ఆక్రమించి, పెద్ద స్థావరంగా మార్చుకున్నమాట యదార్థమే. కాని ఆ ప్రాంతం అధిపతి అయిన హిందూ రాజా తులాజీ సహకారంతోనే వారు ఆపని చేయగలిగారు. పొరుగున ఉన్న అదిల్‌షాహీ సుల్తాన్‌ను బలహీనపరిచేందుకు ఈ హిందూరాజా వారితో సహకరించాడు. అంతేకాక అదిల్‌షాహీ సుల్తాన్ విస్తృత సామ్రాజ్యంలో గోవా ఒక వివరవు ఉన్నది. పోర్చుగీసువారు దీనిని జయించి, స్థావరం ఏర్పరచుకొనడం సుల్తానులమీద దండయాత్రలు సాగిస్తున్న విజయనగర సామ్రాజ్యాధిపతులకు ప్రయోజనకారి అయింది. ఆయుధాలు, ముఖ్యంగా కావలసిన అశ్వాలు, విదేశాలనుంచి దిగుమతి చేసుకొనటానికి గోవారేవు ఉపయోగపడుతుందని విజయనగర చక్రవర్తులు గ్రహించారు. కనుక గోవాను జయించటంలో ఈ గడ్డమీద పోర్చుగీసు పరిపాలన ఏర్పడలేదనీ, హిందూమహాసముద్రంలో నౌకా యానాలు సాగించేందుకు వారు అనువైన ప్రదేశం స్వీకరించుకొనడం మాత్రమే జరిగిందనీ దీనివల్ల స్పష్టమవుతున్నది."

"కంటికి కనిపించిన ప్రతి ముస్లిమును కత్తికి ఎరవేసినట్లు అల్బూకర్కే తన ప్రభువుకు తెలియచేశాడు. 'మాకు కనిపించిన ముస్లిం బ్రతికి బయటపడలేదు. వారిని మసీదులలోకి తోలి నిప్పు అంటించాము' అని అతడు చెప్పుకున్నాడు. మహమ్మదీయమతంపట్ల ఇంతటి ద్వేషమే పోర్చుగీసువారిని విజయనగరరాజులకు సన్నిహితులను చేసింది. విజయనగరసామ్రాజ్యాధిపతులు నిర్విరామంగా 170 సంవత్సరాలు మహమ్మదీయ పాలకులతో పోరాటం జరిపారు. ఆ వంశంవారిలో ప్రథమ గణనీయుడు, దక్కన్ సుల్తానులకు బద్ధవిరోధి అయిన కృష్ణదేవరాయలు 1509 లో సింహాసనానికి వచ్చాడు. పోర్చుగీసువారు గోవాను ఆక్రమించుకొనడం చూచి ఆయన హర్షించడమే కాక, వారితో స్నేహసంబంధాలు నెలకొల్పుకున్నాడు. భట్కల్‌వద్ద ఒక స్థావరం ఏర్పాటు చేసుకునేందుకు అనుమతించవలసిందని అర్థిస్తూ 1510 లో అల్బూకర్కే తనదూత నొకణ్ణి పంపాడు. కృష్ణదేవరాయలు ఆ అభ్యర్థనను మన్నించి, స్థావరం ఏర్పాటుకు ఉచితంగా అనుమతి ఇచ్చాడు. భారతదేశంలో అడుగుపెట్టిన అర్థశతాబ్దంవరకు బహుస్వల్పమైన సైనికశక్తితో పోర్చుగీసువారు గోవాలో ఎలా నిర్వహించుకు రాగలిగారో అర్థం చేసుకోవాలంటే, హిందూసామ్రాజ్యాధిపతులతో వారి మైత్రిని విస్మరించరాదు. ముస్లింలతో శత్రుత్వమే ఈ మైత్రికి కారణమైంది."

"1542 లో ఆఫాన్సో డిసౌజా గవర్నరుగా నియుక్తుడు కావడంతో, ఆసియాలో పోర్చుగీసువారి నౌకావ్యాపార ఆధిక్యతకు రెండవదశ ప్రారంభమైంది. ఈకాలంలోనే వారు స్థిరపడిపోయి గుత్తవ్యాపారంలో పొందదగిన గరిష్ఠ లాభాలు పిండుకున్నారు. 60 ఏళ్లపాటు ఏటా నౌకలు నిరాటంకంగా తూర్పు దేశాలనుంచి సుగంధ ద్రవ్యాలు, రత్నాలు, సిల్కు వస్త్రాలు పోర్చుగల్‌కు రవాణా చేశాయి. ప్రభుత్వోద్యోగులు సిరిసంపదలలో మునిగి తేలారు. ఆనాటి గోవా బాబిలన్ లాగ ఉండేదని కెమోన్స్ అభివర్ణించాడు. అప్పటి పోర్చుగీసు అధికారుల వ్రాతలు విశ్వసనీయమునైతే, వారు అనుభవించిన భోగాలు, వారి అవినీతి చరిత్రలో

77వ పేజీ చూడండి





## గురుద్రోహం

దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుజులోయ్
మట్టికోసం మనం చైనా
గురుల తిట్టుట ఘోరమేనోయ్.

ఎ. ఆర్. రెడ్డి (గూడూరు)

* * *

## చలికాలము

సిరిగల వానికి చెల్లును
తరువుల కంతారమందు తగనిద్రింపన్
దరిద్రున కంతభోగం బా
పరమేశా అగ్నినిడుము తా చలియందున్.

వై. వి. సూర్యనారాయణమూర్తి,
(భద్రాచలం)

* * *

## ఇవే జల్సాలు:

ఆఫీసులో Files తో
ఆఫీసరు Calls తో
చాలుంటే Chills తో
డాక్టరిచ్చే Pills తో
ఆయన గారి Bills తో
జల్సా లెక్కడివయ్యా మాకూ
Pulse ఆగిందాకా

ఎస్. వి. శేషాచార్యులు, (హైదరాబాద్)

* * *

## నర్తకి

నర్తకి యన ఆడేనుగ
నర్తకియన ఆడుకొమలి, నానార్థములన్
నర్తకి విరామమొందగ
నర్తులముగ నున్న తెగుద మరి!

క. వి. రా.

* * *




## శ్రేష్ఠమైన మార్గం:

ఇంట్లో భార్యాబిడ్డల పోరు పడ లేక—"ఛీఛీఛీ!! యీ యింట్లో వుండే దానికన్నా ఏ రైలన్నా ఎక్కి—చావడం మేలు!" అని పణుక్కుంటూ పెట్టే, బేడా సర్దుకొని స్టేషనుకు బయల్దేరాడు, ఆ యింటి యజమాని.

ఎ. వి. రంగయ్య (గుంతకల్లు)

* * *

## సిగరెట్ మహిమ

భగవంతుని మహిమైనా
పొగడకనే రుచుట తెలియబోవదు గానీ
పొగడకనే నీ మహిమను
పొగవలనను తెలియవచ్చు భువిలో
"సిగరెట్."

తగిలించి విడచి పుచ్చిన
పొగలే ఘుమఘుమంఘుమల భువనమునించే
అగరొత్తులవగ నేమిటికి?
సిగరొత్తులుం గాక మరిక! చెలియా 'సిగరెట్'

మగవాముతోడ కలన్
సిగరెట్టును బూని, నోట సింగారముగా
పొగవిడువజాలు నతనికి
మగువలు మనసిత్తురమ్మ మహిలో
'సిగరెట్'

పి. ఎస్. రంగారావు (జడ్చర్ల)

* * *

## నేడు

గడియారము మణికట్టున
కడువేడుక గట్టుచుండ్రు కాలం
బడుగన్
తడబడుచు నిలచియున్నది
కడమాటగ "సారి" యంద్రు
కారుణ్య నిధీ!

వి. ఆర్. కాశప్ప, (వశాన్నూరు)

# సంక్రాంతి పండుగ

ఆమంచర్ల గోపాలరావు.

మనదేశ పండుగలలో సంక్రాంతి ఎన్నదగినది. తెనుగుదేశంలో మాత్రం సంక్రాంతి చాల ప్రాముఖ్యం వహిస్తుందని చెప్పవచ్చు. మన అన్ని ఇతర పండుగలవలె గాక, సంక్రాంతిలో ఒక ప్రత్యేక విశేషం కన్పిస్తుంది. ఇంగ్లీషు కాలెండరు ప్రకారం వచ్చే పండుగ సంక్రాంతి ఒకటే. ఇందుకు కారణం ఒకటే. సూర్యుని ఉద్దేశించి చేసికొను ఈ పండుగ దినాలను, సౌరమాన లెక్కల ననుసరించే నిర్ణయిస్తారు.

సామాన్యంగా సంక్రాంతిని మనదేశంలో మూడుదినాల పండుగగా చేసికొంటారు. మొదటిరోజు భోగి అని, రెండవదినం సంక్రాంతి అని, మూడవనాడు కనుమపండుగని, మూడునాళ్లు వరుసగా ఈ పండుగ చేసికొంటారు. కాని మన తెలుగుదేశంలోనే కొన్ని ప్రాంతాలలో నాల్గవదినం కూడ ముక్కనుము, లేక ముక్కోనుము పండగని నాలుగురోజులు వరుసగా పండుగ చేసికొంటారు.

సంక్రాంతికి చలికాలం ఇంకా కొద్దిగా మిగిలే ఉంటుంది. చలికాలపు ఆఖరి రోజులలోనే సంక్రాంతి. అంచేత ఒక విధంగా సంక్రాంతి చలికాలానికి స్వస్తి చెప్పుతున్నదా అన్నట్లు మనకు తోస్తుంది. ఎందుకనగా సంక్రాంతి పండుగలలో మొదటి దినం భోగినాడు, వేకువజాముననే, సామాన్యంగా అందరూ ఇండ్లముందర చలిమంటలు వేసికొంటారు. అంత చలిలోనూ అందరూ ఆ మంటల చుట్టూ కూర్చొని ఆనందిస్తారు. రాబోవుతున్న వెచ్చటి కాలాన్ని సూచిస్తూ ఈ చలిమంటలు వేసుకొనే చర్య వెచ్చదనాన్ని ఆహ్వానిస్తున్నట్లుగా ఉంటుంది.

సంక్రాంతి పండుగ రోజులలో దేశం, నాడూ అంతా అత్యంత శోభతో కలకలలాడుతూ ఉంటుంది. ఇండ్ల ముంగిళ్ళన్నీ పరిశుభ్రం చేసి, రకరకాల ముగ్గులతో చిత్రిస్తారు. ఆపైన పూలతో కూడ ఆ ముగ్గులను అలంకరిస్తారు. అనేకమంది వట్టి పూలు చల్లడంతోనో, లేక పేర్చడంతోనో తృప్తి పడరు. పేడ ముద్దలు చేసి, వాటికి పూలను గుచ్చి, సాయంత్రంవరకూ చెదరక అలాగే ఉండేరీతిని పూలను అతి సొంపుగా అమరుస్తారు. ఈ రీతి పూల అలంకరణాన్ని గొబ్బి అనీ, గొబ్బెమ్మను పెట్టడం అని కూడ వ్యవహరిస్తారు. సంక్రాంతి పండుగలలో ఆఖరి దినాన పండ్లు, చెరుకు ధాన్యం మొదలయినవన్నీ కూడ ప్రాముఖ్యానికివస్తాయి. రేగుపండ్లు చెరుకు, చక్కెర మొదలయినవి పంచుతారు. ధాన్యపు కంకులను, ద్వారబంధములకో, ఇండ్ల ముంగిళ్ళందో కడతారు. కొంతమంది ఇండ్లలో కూడ, అనేక రకముల కూరగాయలన్నిటిని కలిపి, చిత్రమయిన వంటకములను చేసికొని ఆనందిస్తారు.

వీటన్నిటిని మించిన సంక్రాంతి నిజశోభ మన తెలుగు దేశంలో పల్లెటూళ్లలో బాగా తెలియవస్తుంది. అనేక గ్రామాలలో క్రొత్త బియ్యంతో పొంగళ్లను చేసికొంటారు. పశువులను అలంకరిస్తారు. కోడి పందాలు పొట్టేళ్ల పందాలు, ఎడ్ల పందాలు, మొదలయిన కార్యక్రమాలలో యావన్మంది గ్రామప్రజలూ మైమరచి ఆనందం అనుభవిస్తారు.

ఈ చర్యలన్నీ గతసంవత్సర ఫలితమునకు ఆనందిస్తూ, నూత్న సంవత్సర ఫలితమును ఆహ్వానిస్తున్నట్టుగా తోస్తుంది. ప్రథమమున, చలికాలమునకు స్వస్తి చెప్పుతూ, ఉష్ణకాలమును ఆహ్వానిస్తూ భోగిమంటలను వేసుకుంటారు. తర్వాత వసంతమును పూలతో ఆహ్వానిస్తారు. తక్కిన సంవత్సర ఫలితమంతా పండ్లతో, చెరుకుతో, చక్కెరతో, దివ్యవంటకములతో ఆహ్వానిస్తారు.

గత సంవత్సర ఫలితమునుగూర్చిన ఆనందం కూడా సంక్రాంతినాటి అన్ని చేష్టలలోనూ ప్రతిఫలిస్తుంటుంది. పండిన క్రొత్త ధాన్యమును అనుభవించు ఆచారమే పొంగలి, మొదలయిన కార్యములు. ఆ ఆనందమును జీవరాసులెల్ల పంచుకొన్నగాని తృప్తి పరిపూర్ణము కాదు. గాలిలో పర్యటించు పిచ్చుకలకొరకు ఇండ్లముంగిలలో వ్రేలాడు ధాన్యపుకంకులు. ఈ రీతిగానే అన్ని సంక్రాంతి ఆచారములూ చేష్టలూ.

కాని సంక్రాంతి పండుగలలో జరుగు కొన్ని చర్యలకు అర్థ మంత సులభముగా తోచదు. ఈ చర్యలకు తక్కిన చేష్టలకు గల అవినాభావ సంబంధమును అన్వయించుటకూడ కష్టంగానే తోస్తుంది. ఈ చర్యలకు హేతువులను తెల్పు ఐతిహ్యములేవియునూ, పురాణములందు కాని, ఇతిహాసములందు గాని, జానపదమునగాని కానరావు.

సంక్రాంతి పండుగనాడు పితరులకు తిలోదకాలను వదులుతారు. కొంతమంది ఉత్తరాయణ సంకల్పమునుకూడ చదువుతారు. ఉత్తరాయణ సంకల్పమునకును, పైజెప్పిన సంతోష చేష్టలకును కొంత అవినాభావ సంబంధం కనుపిస్తుంది. ఉత్తరాయణం మొదలయిన నాటినుండి దినముల ప్రమాణం క్రమంగా ఎక్కువవుతుంది. సూర్యుని తేజస్సుకూడ క్రమంగా వృద్ధి

76-వ పేజీ చూడుడు

## స్వాగతం

వి. శ్రీశైలం.

స్వాగతము సంక్రాంతి రమణీ!
స్వాగతము సుస్వాగతమ్ము!!
మంచుముత్యాల తెలుగు పచ్చని
అంచుకోక సవరించి,
వక్షోరములో బంతి పూవులు
పళ్లె తాంబూలముల నించి,
పసుపుకుంకుమ దిద్దు బంగరు
వంచపాళిని చేతనుంచి,
తీయతీయని కోరికలతో
తెలుగు వడుచులు మురిసిపోవగ
స్వర్గలోకమునుండి భువికీ
సాగి వచ్చిన అప్సరా!
స్వాగతము సంక్రాంతి రమణీ
స్వాగతము సుస్వాగతమ్ము!!
చల్లగాలులు వీచుచున్నవు
తెల్లవారకముందె చల్లని
పాన్పులందున నిద్ర మేల్కొని,
రంగవల్లులు దీర్చి రమణులు
పొంగిపోవగ జూచినావు
బంతిపూవుల మాలలల్లి
ఇంతులకు జడ వేసినావు
స్వాగతము సంక్రాంతి రమణీ
స్వాగతము సుస్వాగతమ్ము!!
మంచుకొండల గుండెలన్నీ
మధురముగ పొంగించినావు
నవ్వు నురుగులు చిలికి నదులను
నడువనుండగ జేసినావు
మమతలూరికే కౌగిలింతకు
మంచుదుప్పటి చాటు గట్టి
తగవులాడెడి ప్రేమజీవుల
తనువులొక్కటి జేసినావు
స్వాగతము సంక్రాంతి రమణీ
స్వాగతము సుస్వాగతమ్ము!!
మల్లెపూవులవంటి తెల్లని
మనసు గలిగిన బాలలందరు
తల్లి విచ్చని గుండెలందున
తెల్లవారక ముందె మేల్కొని
పాలగుండెలు పొంగిపోవగ
పసిడి బంగరు ఊహాలల్లుచు
నీవు జల్లిన మాక్తికమ్ముల
చేరి ఆటలు ఆడుకొందురు
స్వాగతము సంక్రాంతి రమణీ
స్వాగతము సుస్వాగతమ్ము!!
"మనసు తెల్లని మంచువోలె
మారిపోయినవాడు కరుణా
మధుర మధుసారమును నిండుసు
మానవాళికి బ్రతుకు పండును."
అనెడి వెన్నెల భావములతో
మనసునంతా మంచుజేసి
మనుషులందరి మనసులన్నీ
మార్పవచ్చిన దేవకన్యవ?
స్వాగతము సంక్రాంతి రమణీ
స్వాగతము సుస్వాగతమ్ము!!



ప్రేమించి ఉండటానికి సముద్రమూ, విశాలమైన సినిమా హాళ్లూ, ఓ రెండు కాలేజీలూ, పార్కులూ వగైరా ఉన్న ఓ ఊళ్లో టూకీగా జామునదాయగా తిరుగుతాళ్లాంటి జట్టులో ఓ అబ్బాయి. సదరు అబ్బాయి అందరు అబ్బాయిల్లాగే ఓ అమ్మాయిని ప్రేమించేశాడు ద్వితీయ వీక్షణంలోనే. ఎటొచ్చీ ఆ అమ్మాయిమాత్రం ఈ అబ్బాయిని ప్రేమించెయ్యలేదు ఇతనెవరో పేరేమిటో తెలీదుకాబట్టి. అబ్బాయికీ తెలీదు. ఆ అమ్మాయిపేరు సంధ్యని. అందుకని ఏ పేరు సరిపోతుందాని ఇంగ్లీషు సినిమాలు తెగ చూస్తాడు కాబట్టి పేర్లన్నీ తిరగేసి చివరకు 'ప్రిన్సా ఆఫ్ ది ఈస్ట్' అనుకుని ఊరుకున్నాడు ఓ వారం రోజులు.

సారథి అనబడే ఆ అబ్బాయి యూనివర్శిటీలో ఎమ్మెస్సీ ప్రీవియస్ చదువుతున్నాడు ఇంట్లో పనీ, పనికి ఆఫీసులూ ఖాళీ క్లేవు కాబట్టి.

ఒకసారి సినిమాహాల్లోనూ, మరోసారి బీచ్ లోనూ అదే అమ్మాయిని అంబులో బాగా పీచో యువ లక్షణాలున్న అమ్మాయిని చూసేసరికి ఓహో ప్రేమించెయ్యాలిగావాల్ను అనుకొని తప్పనిసరి ప్రేమించేశాడు సారథి.

సారథి కిది మొదటి అనుభవం కాబట్టి అలనాడు దేవదాసూ, శ్రీ శ్రీ, వెంకటరంగయ్యా మొదలైన వారి రచనలున్న ప్రణయగ్రంథాల్లో చెప్పబడినట్టు మన్మథరమ్యమైన ప్రేమికులు మొదట సహనం అల వరచుకోవాలని వారంరోజుల వరకూ ఈ వార్తని ఆఖరికి క్రిష్ణకికూడా చెప్పకుండా ఉంచాడు —

చివరికి ఉండలేక క్రిష్ణరూముకొచ్చి ప్లాకు కాలిరు చివరలో రెండుసార్లు రాని కన్నీరుని తుడిచేసుకుని, మూడుసార్లు చీదేసి, ఒకసారి జుత్తు చెరిపేసుకుని మళ్ళీ దువ్వేసుకున్నాడు.

అంతవరకూ బాగానేఉన్న సారథికి అంతలోనే ఏమొచ్చిందన్నట్టు చూశాడు క్రిష్ణ ఆమాటే అంటూ.

"ప్రేమించావ్రా......అమ్మాయిని" అన్నాడు సారథి ఆ మాటకోసమే ఎదురు చూస్తున్నట్టుగా.

తెరిచిన నోరు తెరిచినట్టే ఉంచేశాడు క్రిష్ణ అలా ఐదు నిమిషాలవరకూ. ఇప్పటివరకూ ఒక్క అమ్మాయినీ ప్రేమించని దౌర్భాగ్యుడు ఇలా హఠాత్తుగా ప్రేమించెయ్యడం ఏమిటా, అందులో అమ్మాయినీ అని చివరికి తేరుకున్నాడు క్రిష్ణ.

"ఎవర్రా?......ఎప్పుడు?.....ఎందుకు?.....ఎలా?......ఎన్నిసార్లు?"

"అవున్రా అనూరాధ......"

బాంబు పేలినట్టు ఉలిక్కిపడ్డాడు క్రిష్ణ.

"బాబోయ్......ఒరే.....ఒరే సారథీ, అన్యాయం, ద్రోహంరా, మిత్రద్రోహం. అనూరాధన్రా, అందులో నేను ప్రేమించిన అనూరాధని ఘోరం"

భరతనాట్యం చేస్తున్న క్రిష్ణని చూడగానే సారథి పేథటిక్ ఫీలింగ్ అంతా ఎటో ఎగిరిపోయింది. డాన్సు చేస్తున్న క్రిష్ణని ఆపి కేంప్‌కాట్‌మీద జాగ్రత్తగా కూర్చోపెట్టి గ్లాసెడునీళ్ళిచ్చాడు సారథి.

"ఒరే చిట్టీ మన వచ్చే ట్రాఫిక్ ఆఫ్ ప్రేమ ప్రమాదం లేదుకాని, అనూరాధని కాదురా ప్రేమిం




చింది. అనూరాధతో తిరుగుతుంది సన్నగా, పొడుగ్గా, రింగులు పెట్టుకుని గ్రీన్‌హవాయిషూస్ వేసుకుని, పైకి కట్టిన రెండు జడలూ, పెద్ద బోర్డరు ఎర్రరంగు పరికిణీ, సంపెంగరంగు జాకెట్టు, ఓణీమీద తూరేటి గులాబీల ఓణీ ...."

"అయిందా ఇంకా ఉందా. ఇంతకీ నువు ఇప్పుడు ఆ అమ్మాయినంటూ ప్రేమించావుకనుక నన్నేమిటి చెయ్యమంటావ్" క్రిష్ణ పార్థుడి సారథిలాగాఅడిగాడు.

"ఏమిటి చెయ్యటమేమిట్రా డామిట్! కాస్త సలహా ఇవ్వవూ మరి?"

"నీ ఏడుపేదో నువ్వేడవక మధ్య నాగ్గైడన్నేమిట్రా బయుద్దాయ్!"

"ఏడ్చాన్రా......ఏడ్చి ఏడ్చి చివరికి నువ్వు ఇప్పటికి చాలమంది అమ్మాయిల్ని ప్రేమించి ఏడ్చావుకదా, మంచి ఎక్స్‌పీరియన్సు గట్టా ఉన్నవాడివి—"

"......సలహా ఇవ్వమంటావ్. సరే ఫీజు బోల్డంత అవుతుంది. ఆ అమ్మాయి తిరిగి నిన్ను ప్రేమించుట గ్యారంటీ ఇవ్వబడును."

"థాంక్యూ."

"సరే ఇవాళే మీ నాన్నగారికి చెప్తాను పోయి అమ్మాయిని చూసుకోండని."

"సరే......అరె...... ఒరేయ్ అలని మాత్రం వద్దు. ముందు నామని ఐపోతుంది. ఇదిరా నీ సలహా బోడి సలహా?"

"లేకపోతే నీ మొహానికి ప్రేమేమిట్రా వెధవాయ్."

"ఈసారి సీరియస్‌గా చెప్తున్నాను. ఆ అమ్మాయిని సీరియస్‌గా ప్రేమిస్తున్నాన్రా. ఆ అమ్మాయి వారంరోజుల్లోగా నాతో మాట్లాడకపోతే చిటికెడు పొటాషియమ్ సైనైడు చాలు."

"అదేదో ఇంటికిపోయి చేసుకోగాని ఇక్కడ నాకుమాత్రం ఆత్మహత్య చేసెయ్యకు."

"నీ రూములోనే చేసుకుంటాను."

"లేబరేటరీనుంచి రూమువరకు మోసుకు రావటమెందుకూడదండుగ. అదికూడా తర్వాతచూద్దాం కాని కాలేజీకి కదులు వెధవది ఫస్టవరు ఒక్క నిమిషంఆలస్యమైనా ఎబ్సెంటిచ్చేస్తారు ప్రొఫెసరు!"

ఇద్దరూ కాలేజీకి బయల్దేరారు.

క్లాసులోకూడా పరాగ్గానే ఉన్నాడు సారధి. ఏదో చెప్తూ ప్రొఫెసరు "ఈజ్ ఇట్ క్లియర్" అంటే తనకే అనుకుని "ఎస్ సర్ ఈజ్ ఇట్ క్లియర్" లేచి అనేశాడు సారథి. క్లాసంతా గొల్లుమంది. కాలాడూలం వచ్చిందే వీడి వ్యవహారం అనుకున్నాడు క్రిష్ణ క్లాసులో వాడి వాలకం అదీ చూసి.

"ఒరే నువ్వు నిజంగా ప్రేమిస్తున్నావ్రా?" అని అడిగాడు క్రిష్ణ సారధిని మర్నాడు.

"నీతోడు, నీ 'ఏళ్ళైదో'సారి ప్రేమించిన అమ్మాయిమీద ఒట్టురా."

"ఐతే నే చెప్పింది చేస్తావా?"

"ఏమిటి?"

"సీరియస్‌గా ఒక ఉత్తరం రాసెయ్"

"అయ్య బాబోయ్. ఇంకేమైనా ఉంది? ఇంతకు ముందు వాళ్ళ కాలేజీలో ఎవడో ఈ పని చేస్తే దేహశుద్ధి చేయించేసింది."

74-వ పేజీ చూడండి




ప్రాభవం అందుకోగానే అభిమాన ప్రేక్షకుల వద్దనుండి ప్రశంసలతో కూడిన ఉత్తరాలు ప్రతి నటీ నటులకు రావడం సహజం. నాకు కూడా రోజూ కనీసం పాతిక ఉత్తరాలకి తక్కువ లేకుండా గత ఏడు సంవత్సరాలుగా వస్తూనే ఉన్నాయి.

వీటన్నిటికీ ఎంతవరకూ సమాధానాలు ఇవ్వగలిగేనో, ఆ ఉత్తరాలు నాపై ఎటువంటి ప్రభావాన్ని కలుగజేశాయో తెలియజేయడానికి ఈ వ్యాసం వ్రాస్తున్నాను.

నా మొదటి చిత్రం "పుట్టిల్లు" విడుదలైన సందర్భంలో అభిమానులవద్దనుండి పది పన్నెండు ఉత్తరాలు వచ్చినవి. ప్రతి ఉత్తరంలోనూ "ఆంధ్ర నర్గీస్‌గారూ! పుట్టిల్లు చిత్రం దెబ్బ తిన్నా, మీ నటన మాత్రం బాగుంది. ఆ చిత్రంలో మీ నటన చూస్తే, ఒక కొత్త నటి నటిస్తోందనే అభిప్రాయమే కలుగలేదు. మీరు తప్పకుండా అభివృద్ధిలోకి వస్తారు" అని ప్రేక్షకులు తమ అమూల్యమైన అభిప్రాయాలు తెలియజేశారు. ఆ పది ఉత్తరాలూ నాపై ఎటువంటి ప్రభావాన్ని కనబరచాయో తలుచుకుంటే నా మనస్సు ఉప్పొంగిపోతూంది. ప్రతి తారకు తన మొదటి చిత్రం ఎంతవరకూ విజయవంతమవుతుంది అనే ఆందోళన ఉంటుంది. చిత్రం విజయవంతమైతేనేగాని, కొత్త తారలకు సామాన్యంగా పేరు రావడం కష్టం. తన భవిష్యత్తును తీర్చి దిద్దేది మొదటి చిత్రమే.

ఇక్కడ "పుట్టిల్లు" చిత్రం చూసిన ప్రతివారూ చాలా బాగుందని అనుకుంటేనే ఎంతో ధైర్యంగా ఉన్నాను. ఆ చిత్రం విడుదలైనరోజు మా నాన్నగారూ, తమ్ముడూ వెళ్ళారువెళ్ళి ప్రేక్షకుల మధ్య కూర్చుని స్వయంగా వారి అభిప్రాయాలు తెలుసుకుని వచ్చారు. చిత్రం ఫెయిల్ అయిందని వినగానే నా గుండె రెండుసార్లు ఒక్కసారిగా దడ దడ లాడాయి. నా భయం అంతా "ఏ మాత్రం నటనానుభవంలేని కొత్త తారతో చిత్రం తీశారు. అందువల్లనే ఫెయిల్ అయింది" అనే అపకీర్తి వస్తుందేమోనని.

మా నాన్నగారు ప్రజాభిప్రాయం తెలియజేయగానే కొంత సంతోషించాను. ప్రేక్షకులు మాత్రం "కొత్త అమ్మాయి అయినా చక్కగా నటించింది" అనే ప్రజాభిప్రాయం తెలియజేయగానే కొంత సంతృప్తి చెందాను.

ఆ సమయంలోనే పది ఉత్తరాలు వచ్చాయి. ఒక్కొక్క ఉత్తరంలోని ప్రతి అక్షరం చదివాను. ఒక విచిత్రమైన అనుభూతి నాలో కలిగింది. సంతోషం, ధైర్యం, ఆనందం నాపైన నాకే ఆత్మ విశ్వాసం, పట్టుదల యిన్నీ ఒక్కసారిగా నన్ను ఆవరించాయి. అప్పుడే పెద్ద తారగా అయిపోయినట్లు భావించుకుని మురిసిపోయాను. ఒక్కొక్క ఉత్తరంలోని ప్రతి అక్షరం నాలో విపరీతమైన "ఆత్మ విశ్వాసం" కలుగజేసింది. నిష్పక్షపాతంగా తెలియజేసిన వారి అభిప్రాయాలు నా భవిష్యత్తుకు ఆశీర్వచనాలుగా భావించాను.

తరువాత కీర్తిశేషులైన హెచ్. ఎమ్. రెడ్డిగారు తమ చిత్రం "వద్దంటే డబ్బు" తెలుగు, తమిళం చిత్రాలకి నన్ను బుక్ చేసుకున్నారు. ఆ చిత్రం కూడా విజయవంతం కాలేదు. అయినా మొదటి చిత్రంలో సంపాదించుకున్న పేరు మాత్రం పోగొట్టుకోకుండా "అంతకంటె బాగా నటించాను" అని అనిపించుకున్నా.

ఆ తరువాత వరుసగా "వదినగారి గాజులు", "దొంగరాముడు", "మిస్సమ్మ", "మా గోపి" చిత్రాలు విడుదలైనవి. ఫేన్ మెయిల్ సంఖ్య బాగా పెరిగింది. ప్రతి ఉత్తరంలోనూ "అక్కయ్యా! మీరు ప్రతి చిత్రంలోనూ నటనలో ఒక్కొక్క మెట్టు పైకి వెళ్ళుతున్నారు" అని అభినందనలు అందుతూండేవి. "మీ అందమైన, ఫోటో ఒకటి పంపించండి" అని కోరుతూండేవారు అభిమానులు.

నా అభివృద్ధికి ముఖ్య కారకులైన అభిమానులకు తప్పకుండా ఫోటోను పంపడం, స్వహస్తాలతో ప్రత్యుత్తరాలు ఇస్తూండడం చేస్తూండేదాన్ని. షూటింగ్ లేని రోజున ఆనెలలో వచ్చిన ఉత్తరాలన్నిటినీ ముందు వేసుకొని కూర్చుని, వీలైనంత వరకు ప్రతి ఉత్తరానికి జవాబులు యిచ్చేదాన్ని. ఈ ఆచారం సక్రమంగా ఆరు సంవత్సరాలు కొనసాగింది.

ప్రస్తుతం ఒక ఏడాదిగా ఫోటోలను పంపడం మానివేశాను. కొంతకాలం ప్రింటింగ్ పేపర్ దొరకకపోవడం ఒక కారణం. కొందరు (అభిమానులు తమకు పంపిన ఉత్తరం ఫోటోలు తీసుకుని, సినిమాలలో నటించాలనే అభిలాషతో తిన్నగా మద్రాసుకి, మా యింటికి రావడం సాగించారు. ఒక అమ్మాయి నేను వ్రాసిన ఉత్తరం, ఫోటో తీసుకుని, పెట్టె బేడాతో తిన్నగా టాక్సీలో మా వాకిట్లో దిగింది. ఆ సమయంలో నేను పువ్వులు కోస్తూ వాకిట్లో నిలబడ్డాను. ఆమె గబగబా-గేటు తెరచుకుని చేతిలో పెట్టె పట్టుకుని లోపలకువచ్చి నన్ను చూసి "నమస్తే అక్కయ్యా!" అంటూ, ఆమె తన వూరూ, పేరూ చెప్పి, "మీరు రమ్మని ఉత్తరం వ్రాశారుగా! వచ్చేశాను. సినిమాలో వేషం ఇప్పించండి" అంది.

ఆ అమ్మాయి మాటలు వింటూంటే నాకు నవ్వూ, కోపం రెండూ వచ్చాయి. నేను రమ్మని ఆమెకు ఉత్తరం వ్రాయడమేమిటని ఆశ్చర్యపడ్డాను. ఇంతలో మా అమ్మా, నాన్నా అక్కడకు వచ్చి "ఏమిటమ్మా?" అని ప్రశ్నించారు. "జమునమ్మగారు సినిమాలో చేర్పిస్తాను రమ్మని వ్రాశారండి' అని జవాబిచ్చింది మళ్ళీ.

"నిన్ను రమ్మనమని మా అమ్మాయి వ్రాయడమేమిటి? ఏది మా అమ్మాయి వ్రాసిన ఉత్తరం చూపించు" అని అడిగారు మా నాన్న. "ఇదిగో" అంటూ ఆమె ఒక కవరు అందించింది.

సామాన్యంగా అందరి అభిమానులకూ ఇచ్చే జవాబే ఆమెకూ ఇచ్చాను. "మీ అభిమానానికి అభివందనాలు. ఇందులో ఫోటో పంపుతున్నాను" అని రెండే రెండు వాక్యాలు ఆ ఉత్తరంలో ఉన్నాయి.

"అమ్మాయీ! నీకు చదువువచ్చా? ఈ ఉత్తరంలో నిన్ను రమ్మని వ్రాసి ఉందా? అభిమానులకు జవాబు ఇచ్చినంత మాత్రాన పరుగెత్తుకుని మద్రాసు వచ్చేయడమేనా! పైగా ఆమె రమ్మని వ్రాశారని అబద్ధాలాడతావా?" అని నాన్నగారు ఆమెను మందలించి పంపించేశారు.

ఈ సంఘటన జరిగిన తరువాత కూడా నేను అభిమానులకు ఉత్తరాలు వ్రాయటం మానలేదు. కాని, మరొక సంఘటన జరిగింది. ఒక ఊరినుంచి ఒక కుటుంబం కుటుంబమే మా యింటికి పోట్లాటకు వచ్చారు. "మా అమ్మాయి మీ ఇంటికి వచ్చేసిందట" అని. రోడ్డుమీద నిలబడి సమరం సాగించారు. ఇలాంటి సంఘటనలు చాలా జరిగినవి. అంచేత క్రమేపీ "ఫాన్స్" కి పంపించడం తగ్గించాను. మరొక పద్ధతి అవలంబించాను.

మా ఇంటికి నన్ను చూడడానికి వచ్చే అభిమాన ప్రేక్షకులకు—అడిగిన వారందరికీ—తప్పకుండా ఒక ఫోటో సంతకంచేసి మరీ యిచ్చి పంపిస్తున్నాను. స్వహస్తాలతో లిఖించబడే నా ఉత్తరాలను చూడ

73-వ పేజీ చూడండి

# హరివంశము

హారీత శివశర్మ శాస్త్రి

## సాందీపనిపర్వం - 43

ఆ దృశ్యమే విచిత్రమైనది. మహారాజు తన మందిరములో వాతాయనమువద్ద నిలబడి యున్నాడు. అంత అనారోగ్యములోనను ఆయన ఆ లేచుటయే విచిత్రము. అవల ఎంతటి విచిత్రము జరుగుచున్న ఆయన అట్లు మంచముమీద నుండి లేచును? అంతియు కాక, ఆయన అట్లు నిలబడి విచిత్రముగ గూడ నవ్వుచున్నాడు. ఆ నవ్వు మానవుల నవ్వువలె లేదు. తదభావముగ నున్నది. ఉన్మాదములో నవ్వుచున్నట్లు ఉన్నది. ముందు ఆమె తన తండ్రి యా స్థితిని చూచి భయపడినది. తండ్రి ఏమై పోవుచున్నాడో అనుకొన్నది. తండ్రిని సమీపించినది.

"నాన్నా !"

ఆయన పలుకలేదు. అట్టులే నవ్వుచుండెను. ఆయనకు తన పిలుపు వినబడలేదో! అంత వ్యగ్రముముగ నాయన దేనిని చూచుచున్నాడు. ఆ చీకటిలో నాయన కేమి కనుపించుచున్నది. సుదక్షిణయు వాతాయనములో నుండి బయటికి చూచినది. అప్పుడు ఆమెకు కన్పించిన దృశ్యమే దృశ్యము. తనకు స్వామి కాబోవు పౌండ్రకుడు మరల వాసుదేవుని వేషము నంగీకరించినాడు. నీలవర్ణముతో శరీరమును కైసేసినాడు. తులసిమాల ధరించినాడు. పీతవసనమును కట్టినాడు. పీతోత్తరీయమును నడుమునకు చుట్టినాడు. ఆ ఉత్తరీయపు చుట్టులలో పొదిగిన వేణు వొకడు కించిదావిష్కృతమై కన్పించుచున్నది. చీకటి కదా! ఆ దృశ్య మెట్లు కన్పించుచున్నది. అంతటి వర్షములోనను వందమంది సేవకుల చేత కాగడాలు ధరింపజేసి, ఆ వెలుగులో తన స్వామిని, గోవర్ధనోద్ధరణమును లీలగా ప్రదర్శనము చేయుట సుదక్షిణ దర్శించినది. ఆ పర్వతమును కృతముగా నెట్లు, ఎప్పుడు నిర్మింపజేసెనో తెలియదు. దానిని ఒక్క చేతితో ఎత్తి పట్టుకొని, దాని చుట్టును, తన చుట్టును కాగడాలతోటి, సేవకులను ఆయన నిల్పియుండుటను ఆమె గమనించినది. అందులో కొందరు వానలో తడియు చున్నారు. ఆ వాన గాలితోటి వీచుచున్న చలికి బిగుసుకొని పోవుచున్నారు. మరి పౌండ్రకుని శాసనము చండమైనది. వారు ఏమియు అనరాదు. అతని ఆ లీలను చూచి వారు నవ్వుచున్నారో! సుదక్షిణకు తెలియలేదు. నాచాలు దుము ఆ వెల్గులో కన్పించుచున్నాడు. సుదక్షిణ అప్పుడు తన తండ్రిని తన హస్తముతో స్పృశించినది.

"నాన్నా !"

"ఎవరు ? నీవా ! సుదక్షిణవు ! తల్లీ ! నీకు నేను చూచిన భర్త ఇట్టిడు. క్షత్రియ కన్యలకు స్వయంవరమును ఎందుకు ఏర్పాటు చేసినారు ! నాకు ఇప్పుడు బాగుగా అర్థమైనది. బాగుగా అర్థమైనది." అని మరల ఆయన గల్లున నవ్వినాడు.

సుదక్షిణయు నవ్వినది. ఇది పౌండ్రకుని మొదటి లీలయా ! తాను చాల లీలలు చూచినది. శ్రీకృష్ణదేవుని బాల్య చేష్టితముల నానోట నానోట విని, అవి యన్నియు, ఇతడును ఇప్పుడు ప్రదర్శించుచుండుట ఆమెకు తెలియును. ఆ కథ ఇంత వరకును తన తండ్రికి ఆమె తెలియనీయలేదు. అందరిని అట్టులని కట్టడి చేసినది. మరి ఇప్పుడీ కారుబారునని ఎట్లు లీయన కంటబడినది. ఇది ఇట్టులు జరుగునని ఎట్లు తెలిసినది. తనకే తెలియలేదు. పౌండ్రకుడు పూర్వ మేమి చేసినను ముందుగా సుదక్షిణకు చెప్పుట కలదు. ఆమెయు తన వాసుదేవత్వ స్థాపనమును మూడవలయునని అతని పట్టుదల. ఇప్పు డది ఆమె తండ్రికి గూడా ఎరుక అయినది.

"సుదక్షిణ !"

తండ్రి తన్ను ఎప్పుడు తల్లీ ! అని సంబోధించుటయే గాని, 'సుదక్షిణ' అని సంబోధించినది లేదు. సుదక్షిణ, అందువలన హఠాత్తాడిత యైనట్లు తండ్రివంక చూచినది. 'తండ్రీ !' అన్నది.

"సుదక్షిణ ! నేను నీకు అపచారము చేసినానా? అని ఆలోచించుచున్నాను. నిన్ను ఇతనికి వధువుగా నిర్ణయించి ఏమిపని చేసినాను అనుకొనుచున్నాను. నీవు ఇతనిని భర్తగా నంగీకరింతువో ! నాకు భయముగు చున్నది. తల్లీ ! నా మాటను పాలించకు. పట్టుదలను నీవు విడువుము. ఆ అపతు దోషము నాయందు నిష్కృతము కానిమ్ము ! మాచుమ్మ మాచుము నొక్క ఉన్మాదికి ఎట్లు నిన్ను కట్టబెట్టుదునమ్మా ! అహా ! నేను ఏమి చేసినాను."

సుదక్షిణ మాటాడలేదు. తన తండ్రి స్థితిని గూర్చి ఆలోచించు చున్నది. పౌండ్రకుని గూర్చి ఆలోచించుచున్నది. తండ్రి తన్ను గురించి చేసిన నిర్ణయమున కామె ఇప్పుడు దుఃఖించుటలేదు. సంతోషించుటయు లేదు. తన తండ్రి తన సుఖమును గాక, తన క్షేమమును గాక, మరియొక ఆలోచన మెట్లు చేయును ! అదియే ఆమె ఆలోచనము. పౌండ్రకుడు నిజముగా ఉన్మాదియా ? ఆమె కట్లు లనిపించలేదు. ఇప్పటిదనుక తన తండ్రికిని అట్లు లనిపించలేదు. ఇది ఏదో, వాసుదేవ తత్త్వ మిప్పు డతనిని పట్టినది. దానియొక్క లక్షణ మిట్లు ఉన్మాదమువలె అవభాసించుచున్నది. నిజముగా నిది ఉన్మాదమా ! ఆమె ఆలోచనము అంతతో నాగినవి. తన తండ్రియు నాశ్చర్యదృక్కై ఏదో వినుచున్నవానివలె నిలబడినాడు.

"అమ్మా ! నీకు వినబడుచున్నదా !"

"ఏమి వినబడుచున్నది తండ్రీ !"

"విను ! తల్లీ ! విను. విన్పించుటలేదా !"

సుదక్షిణయు వినుచున్నది. ఆ కంఠము మేఘ గర్జనను బోలి గంభీరముగ నున్నది. అందముగ నున్నది. శ్రావ్యముగ నున్నది. చెలరేగుచున్న గాలి తంత్రులుగా, ఆకాశము వీణియను పల్కించుచు నున్నట్లు ఉన్నది.

"హే అంబ ! హే తాత ! హే ! వ్రజౌకసః
యదోవతోషం వితతగిరివర్త్మ సగోధనాః
త్రాన ఇహవః కార్యే
ముద్ధస్త్రాదినిపాతనాత్
వాతవర్ష భయే నాలం
తత్త్రాణం విహితంహినః."

అక్కడ గోవులు లేవు. గోపాలకులు లేరు. గోపాలికలు లేరు. వ్రజౌకసు లెవ్వరును లేరు. గోధనములతో వచ్చి వారు తలదాచుకొనుట లేదు. అంతయు

73-వ పేజీ చూడండి

# ఈ వారం సినీ విహారం

మధుమూర్తి

## ఇన్ ఫ్రా రెడ్ ఫిలిమ్ "పదండి ముందుకు" చిత్రానికి

హైదరాబాద్ సారథి స్టూడియోలో నిర్మించబడు తున్న జాగృతిచిత్ర చిత్రం "పదండి ముందుకు"కు చెందిన ఒక సెట్ మదరాసు శ్యామలా స్టూడియోస్‌లో నిర్మించారని వినగానే ఆరోజు కాల్ షీట్ ప్రత్యేకం పొందగలిగాము. సెట్‌మీద జగ్గయ్య, జమున, గుమ్మడి, కె. వి. ఎస్. శర్మ, నాగయ్య, రమణారెడ్డి, హేమలత, బాలనటుడు సురేష్, అజిత్‌సింగ్, కొంగర జగ్గారావు, కృష్ణ అంతా వివిధ పాత్రధారులై కనుపించారు. స్లైబాక్ యంత్రం కనుపించగానే "మీ చిత్రానికి అందిన రఫీ మహమ్మద్ పాట వినిపించగలరా?" అని జగ్గయ్యను కోరాము. "సరే" నంటూ స్లైబాక్ యంత్రాన్ని పరుగెత్తమని సిగ్నల్ అందించారు. ఈ పాటను రచించిన కవి కూడా హీరో జగ్గయ్యే. రఫీ కంఠస్వరంలో తెలుగుసాహిత్యంలోని ఆవేశం ఏవిధంగా మనకు అందుతున్నదో తెలుసుకోవాలనే ఉత్సుకత నాలో పెరిగింది. మహమ్మద్ రఫీ మన తెలుగుపాటలోని భాషనీ, భావాన్ని చాల చక్కగా అర్థం చేసుకుని, ఆపాటను చాల గొప్పగా పాడ టమ్ను గ్రహించగలిగాము.

శోకం చీకటిలోగిలి చేసి
ఋణానుబంధం తెంచుకుని
కాలం రేపిన సుడిగుండంలో
కను మూశావా......అమ్మా!
మంచికి కాలం తీరిందా
మనిషికి హృదయం మాసిందా!
పాపం పెరిగి పగ బూని—నీ
ప్రాణాలు బలిగా కోరిందా!
నీతికి రూపం, జాతికి దీపం
నీవని నీడన నిలిచావే
స్వేచ్ఛాజీవం, సమతాభావం
నీ జాడలలో నేర్చావే
అమ్మమాటకై అల్లాడే మము
కన్నీట ముంచి పోయావా!
లోపాపు గుండెల లోతుల నిండిన
పెత్తుటి దాహం తీర్చావా
అనురాగంతో ఆత్మార్పణతో
వెలుగుల వాకిలి తెరిచావా
ఎడబాసినా కడదాకా—మా
భవితవ్య మవుతానన్నావా!
నీవు చూపిన వెలుగుబాటనే

67 పేజీ చూడండి



చిత్ర లయావాణి "పరువు ప్రతిష్ఠ"లో జెమినీ గణేశన్, వైజయంతిమాల.




# పిత్తరసము: అందులో పదార్థములు

కొలెస్టరల్ :—ఇది అతి ముఖ్యమయిన రసాయనిక వస్తువు. ఈమధ్య హృద్రోగంతో బాధపడే వారి సంఖ్యా, ఆ వ్యాధితో మరణించేవారి సంఖ్యా అధికం అవుతున్నది. హృద్రోగం ఏర్పడడానికి ఈ వస్తువు రక్తంలో అధికంగా వుండడమని చాలా మంది హృద్రోగ నిపుణుల అభిప్రాయము. అది ఏవిధంగా హృద్రోగం ఏర్పరచేదీ, హృదయ వ్యాధులు చర్చించేటప్పుడు వివరిస్తాను.

కొలెస్టరాల్ ఎంత ప్రమాదకరమో అంత అవసరమైనది కూడా. అది శరీరంలోనే తయారవుతుంది. ఇందులో భాస్వరం ఒక ముఖ్య భాగంగా వుంటుంది. ఈ పదార్థం ముఖ్యంగా ఆహారం ద్వారా తీసుకున్నలివరు, మూత్రాశయము, మెదడు, మీగడ వెన్న, నెయ్యి కండలమీద వుండే కొవ్వువంటి తైల పదార్థములనుంచి శరీరంలో తయారవుతుంది.

కొలెస్టరాల్ ఎక్కువగా లెసిథిన్ అనే వస్తువుతో కలిసిన సంయుక్త ద్రవ్యంగా కనిపిస్తుంది. నరములలో వుండే పోగులను చుట్టే మయొలిన్ అనే పొర వుంటుంది. ఎలెక్ట్రిక్ తీగెకు పైనవుండే రబ్బరు, ప్లాస్టిక్ పొర ఎటువంటిదో యీ మయొలిన్ పొర కూడా అటువంటిదే. ఇది పూర్తిగా నరం పోగును చుట్టి వుండకపోతే, స్పర్శేంద్రియంనుంచి మెదడుకూ, మెదడునుంచి స్పర్శేంద్రియానికి వెళ్ళే ఆదేశములు ప్రయాణించలేవు. ప్రతి జీవ కణానికీ ఒక గోడ వుంటుంది. ఆ గోడలో కొలెస్టిరాల్ వుంటుంది. ఇది ఎర్ర రక్తాణువులలోనూ వుంటుంది. స్త్రీల రజః కోశములలోనూ, ఎడ్రినల్ గ్రంధి పై భాగంలోనూ మెదడులోవుండే గొర భాగములోనూ ఇది ఎక్కువగా కనుపిస్తుంది. శరీరంలో ధాతువులు దహనమైనప్పుడు కొలెస్టరాల్ నశించి విసర్జించబడదు. మళ్ళీ ఆహరించబడి శరీరంలోనే మిగిపోతోంది.

రక్తంలోవుండే కొలెస్టరాల్ పరిమాణానికీ, పిత్తరసంలోవుండే కొలెస్టరాల్ పరిమాణానికీ సంబంధం వుంది. రక్తంలో యిది అధికమైనకొద్దీ పిత్తరసంలోనూ అధికమవుతోంది.

గర్భకాలంలో మొదటి నాలుగు మాసములలో రక్తంలో కొలెస్టరాల్ అధికమవుతుంది. ఆర్టెరీలలో లోపలి పొరలు ఎగుడు దిగుడై హృదయంలో రక్తం సరఫరాచేసే కొరొనరీ ఆర్టెరీలో రక్తం గడ్డ కట్టి, అతి శీఘ్రంగా మృత్యువును కలిగించే హృద్రోగం విశేషం వున్నది. ఆ కట్టిన రక్తంగడ్డ, ఆర్టెరీని మూసివేసేదయితే మరణం క్షణాలమీద జరుగుతుంది. రక్త నాళముల లోపలి పొరలు మందమై ఎగుడు దిగుడులు ఏర్పడడానికి రక్తంలో కొలెస్టరాలు అధికం కావడమని చాలామంది వైద్య శాస్త్రజ్ఞుల విశ్వాసం. ఈ కారణంచేత హృద్రోగంతో బాధ పడుతున్న స్త్రీలు గర్భ ధారణ చేయడం ప్రమాదకరమని చాలామంది అభిప్రాయం. అటువంటి సందర్భంలో గర్భవిచ్ఛిత్తి చేయడం చట్ట విరుద్ధమయిన చర్య కాదు. కొలెస్టరాలుకీ, శరీరంలోవుండే క్రిమి నిరోధకశక్తికీ సన్నిహిత సంబంధం వున్నది. దీర్ఘమయిన క్రిమి వ్యాధితో బాధపడేవారి రక్తంలో కొలెస్టరాలు తక్కువగా వుంటుంది. థైరాయిడ్ గ్రంధి లోపభూయిష్టమై, వ్యాధిగ్రస్తమైనప్పుడు, రక్తంలో కొలెస్టరాలు తగ్గిపోతుంది. మధుమేహంలో అధిక మవుతుంది. అందుకే మధుమేహం వున్నవారిలో కొరొనరీ ఆర్టెరీ వ్యాధి మరీ ప్రమాదకరం. మూత్రాశయ వ్యాధులలో కూడా ఇది కొద్దిగా అధికమవుతుంది. పిత్తరసనాళం వాచిగానీ, యితర కారణములచేతగానీ మూసుకుపోయినప్పుడు రక్తంలో కొలెస్టరాలు చాలా అధికం అయిపోతోంది. ఈ వైజ్ఞానిక విశేషములను తెలిసిన వైద్యులు ఆయా వ్యాధులను రక్తంలో కొలెస్టరాల్ ఎంత వున్నదీ నిర్ణయించి నిరూపిస్తారు.

పిత్తరసం ఉత్పత్తిని అధికంగా ఉత్పత్తి చేయగల వస్తువు పిత్తరసమే. పిత్తరసం లోపిస్తే మలబద్ధకం కూడా ఏర్పడుతుంది. అందుకనే అటువంటివారికి పిత్తరసంతో తయారు చేసిన బైకొలేట్‌వంటి మందులను వైద్యులు వాడతారు.

పిత్తరస వర్ణములు :— పిత్తరసమునకు దాని రంగు నిచ్చేవి ఈ వర్ణ విశేషములే. ఇవి రక్త నాళములు విరిగి ఏర్పడతవి. ఈ వర్ణములవల్లనే విరేచనమునకు పసుపు, లేక ఆకుపచ్చ, లేకగోధుమ రంగు ఏర్పడుతున్నది. పిత్తరసనాళం అటకాయించబడినప్పుడు ఈ వర్ణములు లేనందుననే విరేచనం పింగాణిలాగా తెల్లగా వుంటుంది.

పిత్తరస అమ్లములు:— పిత్తరస లవణములు ఈఆమ్లములు ఆహారంలో వస్తువులతో కలిసినందున ఏర్పడతవి.

లెసిథిన్ :—ఇదీ కొలెస్టరాలువంటి వస్తువే. సాధారణంగా కొలెస్టరాల్ లెసిథిన్ కలిగి వుంటవి. ఇందులో భాస్వరం అధికంగా వుంటుంది. వీటి లోపం నరముల బలహీనతను కలిగిస్తుంది. కొవ్వు పదార్థములు భాస్వరంతోనూ కలిసినప్పుడు కొన్ని పదార్థములు ఏర్పడతవి. కొలెస్టరాలు, లెసిథిన్ ఆ జాతి వస్తువులు. వీటి ఉత్పత్తిలో నూటికి 90 భాగములు లివరులోనే జరుగుతుంది. మిగలాది ప్రేగులలో జరుగుతుంది. శరీరంలో కొవ్వు పదార్థముల ఉత్పత్తి వినియోగం ఈ పదార్థముల ఉత్పత్తి వినియోగంతో సంబంధించి వున్నది. రక్తం గడ్డ కట్టడానికీ, ఈ వస్తువులకూ సన్నిహిత సంబంధం వున్నది. నరం పోగులను చుట్టివుండే పొరలన్నీ ఈ వస్తువులతో తయారయ్యేవే. కొవ్వు పదార్థములనుండి ఈ వస్తువులను లివరు తయారు చేయలేనినాడు లివరువ్యాధిగ్రస్తమై, ప్రాణాపాయంఏర్పడుతుంది.

మ్యూసిన్ :—ఇది పిత్తరసంతో జిగురు గుణం కలిగించి, ఆహార పదార్థములతో అది మిళితమై వుండడానికి సహకరిస్తుంది.

లివరు దాని విధులను నిర్వర్తించలేనినాడు పిత్తరసంలోవుండే ఏ వస్తువులయినా ఆతిశీకరించి పసరుతిత్తిలో రాళ్ళుగా యేర్పడవచ్చును. అవిధంగా రక్తంలో కొలెస్టరాలు అధికమైనప్పుడు పసరుతిత్తిలో రాళ్ళు ఏర్పడతవి. ఏర్పడగానే అవి కలిగించే రాపిడితో ఇన్‌ఫ్లమేషన్ ఏర్పడుతుంది. పిత్తరసంలో వుండే లవణములు, ఆకొలెస్టరాల్ స్ఫటికం చుట్టూ పేరుకుంటవి. దీని చుట్టూ మళ్ళీ కొలెస్టరాల్ పేరు కుంటుంది. ఈవిధంగా పసరుతిత్తిలో లవణములు ఏర్పడి, విపరీతమయిన బాధ ఏర్పడుతుంది. ఇల్లాగే పసరులోవుండే లవణములనుంచి కూడా పసరుతిత్తిలో రాళ్ళు ఏర్పడవచ్చును. రాళ్ళతో ఇన్‌ఫ్లమేషను, దానితో పసరుతిత్తిలో పసరు కదలిక మురగడం అందువల్ల ఆ రాళ్ళు పెద్దవి కావడం జరుగుతుంది. ఇది బాధాకరమూ, ప్రమాదకరమూ అయిన రోగస్థితి.

పసరుతిత్తిలో రాళ్ళు పసరునాళం మూసుకుపోవడానికి ప్రధాన కారణములలో ఒకటి, అల్లా మూసుకున్నప్పుడు కామెర్లు ఏర్పడతవి.

ఇంతవరకు లివరు నిర్మాణమూ, అందులో జరిగే ప్రధాన కార్యక్రమమూ తెలుసుకున్నాము. దాని ధర్మములు అనేకము అని చెప్పెను. అందులో ముఖ్యమయినవి అర్థం కావాలంటే జీర్ణమయిన పదార్థములు ప్రేగులలో ఏ రూపంలో వుండేదీ, అవి ఏ విధంగా పోర్టల్‌వెయినులోకి చేరేదీ పోర్టల్ వెయిన్ ద్వారా లివరులోనికి వచ్చిన ఆ వస్తువులు ఏఏ మార్పులు చెంది ఏ విధంగా శరీర కార్యక్రమంలో వినియోగపడేదీ తెలుసుకోవాలి. ఆ విషయములు వచ్చేవారం చర్చిస్తాను. ఆ తర్వాత మళ్ళీ శరీర కార్యక్రమంలో లివరు నిర్వహించే అమోఘ విధులను చర్చిస్తాను. శరీరంలో ఏర్పడే అనేక వ్యాధులకు లివరు చెడిపోవడమే కారణం. 

# సమస్యల పరంపర సాక్షాత్కారం: వివిధ రంగాలలో నిరుటి పరిస్థితుల సమీక్ష

కౌండిన్య

**1961** ఆఖరై 62 అడుగు పెట్టింది.

కొత్త సంవత్సరం ప్రారంభమైనప్పుడు గడచిన ఏడాది సాధించిన అభివృద్ధి, అనుభవాలు సమీక్షించుకోడంలో అసహజమేమీ లేదు. భారత దేశ చరిత్రలో 1947 తరువాత 61 చాలా ప్రధానమైనది. గోవాను మాతృదేశంలో విలీనం చేసి, భారత స్వాతంత్ర్య సమరాన్ని సంపూర్ణం చేయగలిగిన సంవత్సరంగా చిరస్థాయి అయింది. అలాగే ప్రపంచ చరిత్రలో కూడా అది సువర్ణాక్షరలిఖితం. మానవుడు మొదటి సారిగా అంతరిక్షంలోకి వెళ్ళి సురక్షితంగా భూమికి దిగిన సంవత్సరమది. అయితే ఆంధ్ర దేశానికి సంబంధించినంత మటుకు, ఏవిధంగా చూచినా 1961 కి అంత ప్రాముఖ్యం లేదు. ఈ సంవత్సరంలో మనం సాధించినది ఇది అని చెప్పుకో తగిందేమీ కన్పించదు. 1960లో ఉత్పన్నమైన సమస్యలు, తగాదాలు 61లో తీరకపోగా, మరికొంత జటిలమైనాయి కూడా. రాజకీయ, ఆర్థిక, పరిపాలనాది రంగాలలో గత పన్నెండు నెలల పరిస్థితి స్థూలంగా పరిశీలిస్తే ఈ సంగతి బోధపడుతుంది.

రాజకీయరంగం :—ఇంచుమించు అన్ని పార్టీల స్థితి 1960 లో లాగే ఉంది. కాకపోతే ఎన్నికల సంవత్సరం కాబట్టి ప్రథమార్ధంలో ఉన్నజడత్వం వదలి కొంత చైతన్యం పొందాయి. అయినా ఉన్న బలం దిగజారిందేమోకాని, లేని బలమేమీ రాలేదు. భారత చైనా సరిహద్దు వివాదంతో చిక్కుకుని పోయిన కమ్యూనిస్టుపార్టీ తెప్పరిల్లుకొనేందుకు కొంత ప్రయత్నంచేసి, ఆంధ్ర దేశానికి నడిగడ్డయైన విజయవాడలో అఖిల భారత పార్టీ మహాసభ జరిపింది. కాని రష్యా—చైనా వర్గాలుగా చీలి ప్రతినిధులు బహిరంగంగా కుమ్ములాడుకోడంవల్ల, చైనా దురాక్రమణ విషయమై ఎలాంటి తీర్మానం చేయలేకపోవడంవల్ల, కుళ్ళు కాస్త బయటపడి, పార్టీ మరింత అప్రతిష్ఠపాలైంది. అయినప్పటికీ, వచ్చే ఎన్నికలలో శాసనసభకి 150 మంది అభ్యర్థుల్ని పెట్ట సాహసించిందీ అంటే, స్వతంత్రపార్టీ మూలవల్ల కాంగ్రెస్ వోటు చీలదీయగలమన్న ఆశే ప్రధాన కారణం. స్వతంత్రపార్టీ కూడ విజయవాడలో రాష్ట్ర పార్టీ మహాసభ ఏర్పాటు చేసింది. ఈ పార్టీ మహానాయకులైన రాజాజీ, రంగా, మసాని ప్రభృతులు మహాసభలో పాల్గొని, కాంగ్రెస్‌పై తలా నాలుగు అక్షింతలు వేశారు. పార్టీ కార్యక్రమాలు సిద్ధాంతాలు వివరణకన్నా, పరనిందే ఎక్కువగా ప్రతిధ్వనించింది. వీరు కూడా శాసనసభకి 180 స్థానాలకు పోటీ చేస్తూ, 100 స్థానాలైనా గెలువగలమనుకుంటున్నారు. వీలైనచోట్ల తాము గెలవడానికి లేనిచోట్ల కమ్యూనిస్టులను గెలిపించడానికి యత్నిస్తున్నారు. తమ గెలుపుకన్న కాంగ్రెస్ ఓటమి ప్రధానం. అందుకే కమ్యూనిస్టులతో లోపాయికారి ఒప్పందం. క్రిందటి ఎన్నికలలో మాదిరిగాక, ఈసారి కాంగ్రెస్ ఒకవైపు కమ్యూనిస్టులను మరోవైపున స్వతంత్ర పార్టీ వారిని ఎదుర్కోవలసి ఉంటుంది. అందుకు తగినంత శక్తిసామర్థ్యాలు, ఐక్యమత్యం కాంగ్రెస్ వృద్ధిచేసుకోగలిగిందా అన్నదే ప్రశ్న. 1961 ఆరంభంలో ఉచ్చస్థాయినందుకున్న ముఠా తగవులు, మే జూన్ నాటికి తగ్గి, అల్లూరి సంజీవరెడ్డి వర్గాలు ఏకమై ఐకమత్యం కుదిరిందన్నారు. ఆ సంగతి, ఈ ఉభయ

71 పేజీ చూడండి

చరణము : | ; , ప ప - పా మ | ప ద ని ద నీ - ద ని | సా - స ద ద ప మా
| ; , నాగ - య కు | ప - - - న్న - | గ - శ - న్న - ర
| ప మ గా రి - ని స గా - గ రి రి మా | మ గ గ రి సా - గ రి | మా - పా ద
| పు - జ్యాని - యా - గ - యో - గ | క్ర - - - తు య | జ్ఞ మా త్రి
| ని స దా పా - ద ప మా - పా ద | నీ; సా, - ని | స గా గ
| ధా రు ని - నా - గ - భూష | ణ - నం | - ద - ను
| గ రి రీ సా - ద ప మా - ప ద నీ దా | ద ని సా సా - నీ | సా - ని స గా గా
| ని - - - నా - గ - భూ - ష | ణ - - నం | ద - - - - ను -
| గ రి రీ సా - ద ప మా - ప ద నీ దా | ద ని సా సా - ని స | గా - గ రి రీ మా
| ని - - - నా - గ - భు - ష | ణ - నం | - ద - - ను
| మ గ గ రి సా - నీ స గా - గ రి రీ సా | స ద ద ప మా - ద ప | మా ప ద ని స ద ప
| ని - - - - రా - గ - ద్వే - ష | ర హి తు - నీ - ని | త - ర ను - ఖ -
| మ గ ప మ గ రి
| ధ - ను తు ని || శ్రీ గణే ||

శ్రీ కొంత సీతారామయ్యగారు త్యాగరాజస్వామి గురువుగారైన కొంత వెంకటరమణయ్యగారి సంతతివారు. వీరి కీర్తనలు కొన్ని ఆంధ్రసచిత్ర వారపత్రికలో వరుసగా ప్రచురించగలమని తెల్పడానికి సంతసిస్తున్నాము.

# అంతరిక్ష వినోదం




పూర్ణిమనాడు బయలు దేరవయ్యా అని మొత్తుకుంటూనే వున్నా - విన్నావా - చూడు - దిగడానిక్కూడా చోటు లేదు
వూరికే గోలపెట్టకు - మనం బయలుదేరింది పూర్ణిమ నాడే - ఇక్కడికి చేరేప్పటికి విదియ అయింది మరి


ఈ గోళం మనం అంచనా వేసుకున్నదాని కంటే బాగా చిన్నదిగా కనిపిస్తోందే - ఆఁ!


అంగారక గ్రహవాసులారా! స్వాగతం - మీ గురించి కొన్ని వివరాలిస్తారా? తమ వయస్సు?
నాలుగు వందల యాభై రెండు


అయ్యో! నిజమేనంటారా?


ఏమోనండీ - నేనాయన దగ్గర పని మొదలెట్టి రెండొందల ఏళ్లే అయింది


మంచీ మర్యాదా అక్కర్లే? కనబడిన ప్రతి ఆడదాని వేపూ
అలా మిడిగుడ్లేసుకు చూస్తారేం – ఆఁయ్–


'రావోయి చందమామా' తప్ప వేరే పాటలేం రావూ–


బాబోయ్ పాం! పాం!


బాబూ– పైకెళ్ళివచ్చారట –
ఇంద్రుడూ వాళ్ళూ కులాసా?
మా తాతగారు కనిపించారా!

అది స్కూల్ ఫైనల్ చదివే రోజులు. సరిగ్గా డిసెంబర్ 31 వ తేదీ అది. ఒకకోరిక ఉద్భవించింది. ఏమిటీ అంటే......జీవితంలో పోలీస్ ఆఫీసర్, కనీసం ఎస్. ఐ. అవాలని!

దానికి కావలసిన ఎన్క్వయిరీలన్నీ చేశా. మిత్రులతో సంప్రదించా....''ఛఛ.....సా''మ్మన్నారు. నవ్వారు. వీడి కేదో పిచ్చి అనుకున్నారు.

ఇంతమంది కాదన్న తరువాత పోలీసువాళ్ల దగ్గరకువెళ్ళి వాళ్ళచేత ఛాఛా అనిపించుకోవడం ఎందుకని ఆ ఉద్దేశ్యం మానుకున్నా. మార్చుకున్నా.... కాని, పట్టుదల తగ్గలేదు.

ఒక చిన్న ఐడియా తట్టింది. ఓహో! పోలీ సాఫీసరంటే ఖాకీ నిక్కరు, షర్టు, టోపీ ఇంతేకదా. ఇవేసుకుంటే చాలనుకుని ఆ ఉద్యోగాన్ని కాంపెన్సేట్ చేసే కోర్కెను నెరవేర్చుకోవచ్చని, అదే డ్రస్ ఉండే ఉద్యోగం ఏమిటని ఆలోచించాను. ఇంకేం? శానిటరీ ఇన్స్పెక్టరైతే?'' అదే డ్రస్సూ, అదే యూనిఫారం కాబట్టి.....మన పోలీసాఫీసర్ కోరిక నెరవేరి నట్లే అనుకున్నా. ఎస్. ఐ. కి. శానిటరీ ఇన్స్పెక్టర్ ట్రెయినింగుకి దర[ఖాస్తు] [పంపా]. రమ్మన్నారు. వెళ్లా. శిక్షణలో పా[...]గంలో [చే]...

కాని, తీరా [...] చే[...]ం వచ్చేసరికి దా[...] దీనికీ (రెండు ఎస్[...]వాలా తేడా[...] ఏమిటా తేడా [అం]టే....

నా పై ఆఫీసర్ దగ్గరకు వెళితే ''[...] తగులో్తంది. నీకేమైనా బుద్ధి ఉందా?'' అని అనేవారు. ఊళ్లో కలరాకూ, నా బుద్ధికీ సంబంధం ఏమిటో నా కర్థమయేదికాదు. అటు ప్రజల దగ్గరి వెడితే ''నువ్వు చచ్చేవాళ్ళని బ్రతికిస్తావా?'' అని ఎదురు తిరిగేవారు.

పోలీసాఫీసరు అందర్నీ కొట్టగలడు. అందరూ ఈ ఎస్. ఐ. (శా.ఇ)ని కొట్టడానికి వస్తారు. సరిగ్గా ఒకరోజున గుంటూరులో ఒక చిన్న బిడ్డకి టీకాలు వేస్తుంటే వెనకనుంచి ఆ బిడ్డ తండ్రి కర్ర తీసుకుని నాపైకి లంఘించాడు. నా ప్రక్కనున్న బంట్రోతు నన్ను రక్షించాడు.

అప్పుడనిపించింది ''ఖాకీడ్రస్ మన కనవసరం— ఏదైనా తెల్ల గుడ్డలు వేసుకునే ఉద్యోగం చూడాలని.''

ఇండిపెండెంట్గాఉండే ఉద్యోగంకోసం వెతికాను. సరిగ్గా డిసెంబర్ 31 నే తట్టింది. దొరికింది భీమా కంపెనీ ఏజెంట్ పదవి.

ఇన్సూరెన్సులో పెద్ద ''అయస్కాంతా''న్ని అయిపోవాలని ఆనాటి కోరిక. మీరు నమ్మండి, నమ్మకపోండి, అప్పట్నుంచీ నా ముఖ్య స్నేహితులందరూ నాతో మాట్లాడ్డం మానేశారు. ఇన్సూరెన్సుకు కాకపోయినా, వేరేపనికి వెళ్ళినా వస్తానుండు అని వెళ్లిపోయేవారు.

ఒకరోజు నేను ట్రెయిన్లో నెల్లూరునుంచి మదరాసు వస్తున్నా. సాధారణంగా కొంతమంది వ్యక్తులు రైలులో తటస్థపడతారు. వాళ్ళెప్పుడూ పక్కవాళ్ళతో మాట్లాడుతూండాలి. పక్కవాళ్లకి ఇష్టం ఉన్నా, లేకపోయినా ఏదో ప్రశ్న వేస్తూండాలి. అట్లా ఒకాయన ఎదురయాడు. ఆయన ముందుగా సీటు ఇవ్వలేదు. రైలు కదిలేవరకూ మాట్లాడలేదు. తరువాత నెమ్మదిగా ''నెల్లూరా?'' అన్నాడు.

''ఊ'' అన్నా.

ఇంక రెండు మైళ్లు ఆయన మళ్లీ ఏం మాట్లాడలేదు. చుట్ట కాల్చుకుంటూ కూర్చున్నాడు— నేను ''ఊ'' అన్న ధోరణికి సంబరపడుతూ.

ఇంకో రెండు మైళ్లు పోయిన తరువాత ''ఉద్యోగమా?'' అన్నాడు.

''అబ్బే!'' అన్నాను.

ఇంకో రెండు మైళ్ళు! పోయిన తరువాత ''వ్యాపారమా?'' అన్నాడు.

''ఊ'' అన్నా.

ఇంకో రెండు మైళ్లు పోయిన తరువాత ''లారీల బిజినెసా?'' అని అడిగాడు.

కాదన్నట్టు తలాడించాను.




ఇంక కొంతసేపయిన తరువాత ''మిర్చియా?'' అన్నాడు.

''లేదండి'' అన్నాను.

''కిళ్ళీకొట్టా?'' అన్నాడు.

బహుశా నా జుట్టుచూసి అలా అనుకుని ఉంటాడు.

ఇంక కొంత సేపయాక విసుగుపుట్టి, ''ఏ వ్యాపారమైంది చెప్పరేం?'' అని గట్టిగా అడిగాడు. ''ఇన్సూరెన్స్'' అని ఘట్టిగా అన్నా నేనూ. చస్తే ఒట్టు—మద్రాసు చేరేవరకూ ఆయన మాట్లాడలేదు.

అక్కణ్ణుంచి ఇదీ పనికిరాదనుకున్నాను. చివరకు ఒక లిటరరీ మేగజైనుకు సర్క్యులేషన్ మేనేజర్—కమ్—అడ్వర్టయిజింగ్ మేనేజర్గా—చేరాలనుకున్నా ఒక డిసెంబర్ 31 న. చేరా జనవరి 1 న.

అది మాస పత్రిక. అడ్వర్టయిజ్మెంట్లు అందుకోటానికి మదరాసువచ్చా. తాజాగా విడుదల కాబోయే ఫిలిం వెతికి, ఆ ప్రొడక్షన్ ఆఫీసుకు వెళ్లా. అక్కడే నా అభిమాన నటి సాక్షాత్కరించింది. ఆమె చుట్టూ ఎంతమంది జనం! ఆహా! ఏమి ఉద్యోగం—ఏమి ఉద్యోగం అని చంకలెగరేశాను. మరో డిశంబర్ 31 న కోరేశాను......సినిమా నటుడు అవాలని.....

అయాను......అందులోనే ఉంటున్నా....

మొదటి అనుభవం. మొదటి షాట్....పెవిస్టీ ఫైవ్ లెన్సూ క్లోజు షాటూ....మూడు బకెట్లు చెమట పట్టింది....

నటిస్తున్నాను. నవ్విస్తున్నాను. నవ్వుకుంటున్నాను......''చుట్టూ జనం'' కోరిక .... తీరుతూంది. చెన్నపట్టణంనుంచి ఓ రోజు అర్జెంటుగా మా వూరు వెళ్లాల్సి వచ్చింది.....వెళ్లాను....మా మిత్రుడు చనిపోయాడు....అతని సంసారాన్ని పరామర్శించటానికి వెళ్ళాను. వారింటి చుట్టూ జనం న[..]రు......అప్పటి[కి] [...]దర్శైన నా చిత్రాల [...]ల నామధేయ[...] [...]నే మేనరి[...] నన్ను [పి]లుస్తున్నారు. [...]ను నా[...] [...]స్తున్నా. గు[...]క్కుపోతోంది....కాని అభిమాన ప్రేక్షకుల అభిమానమైన వినాదాలు.....

[...]కి లైఫ్లో ఎదురైన ట్రాజెడీ ఇదే....వారి [న]వ్వులన్నీ నా గుండెలోని బరువుమ[...]

తిరుగుముఖం పట్టాను. అభిమాన ప్రేక్షకు[ల]కు న[మస్క]రించాను.

చుట్టూ జనం కోరికలోని విషాదం ఎంతటిదో వినోదం [ఎం]తటిదో క్షణంలో గ్రహించాను.

మరొక అధ్యాయం.

సినీ జీవితం సాగుతూండగా బి. ఎస్. సర్కార్ మేజిక్ ప్రదర్శన చూశా. మరో డిసెంబర్ 31 న ఒక కోరిక పుట్టింది. మేజిక్లు నేర్చుకుందామని. కోరిక నెరవేర్చుకోడంలో పాత సమస్యలు లేవు.

నా కొక గురువు దొరికాడు. ఆయనకి సినిమాల్లో చేరాలని కోరిక ఉంది. నాకు మేజిక్లు నేర్చుకోవాలని కోరిక ఉంది. ఇద్దరం జత అయాము. ఆయన ఎన్నో మేజిక్కులు నేర్పాడు. ''అక్కా చెల్లెళ్ళు'' సినిమాలో మా గురువు ఈ శిష్యుడితో నటించాడు!

మేజిక్లో అరంగేట్రానికి (మొదటి ప్రదర్శన) నన్ను గురువుగారు చిత్తూరు దగ్గరున్న పల్లెకి

71—వ పేజీ చూడండి

# కాల్పనిక జగత్తులో వరకట్నాలు



సింగరాజు రామచంద్రమూర్తి

పెళ్ళి పందిరి కళకళలాడుతోంది. కొత్తగా కొని కట్టుకున్న చీరలు నలుగురికంటా పడేసి మళ్ళీ రెండవది కట్టుకుందామని ప్రౌఢాంగనలు ఛడామడా తిరిగేస్తున్నారు. ఎటో చూస్తుంటే ఎవరో పలకరించగా ఆ పలకరించినవారు తమ కేవరసన బంధువులో తేల్చుకోలేక తికమకపడి అంతలో కంటికి పదరుగా రంగులు కనబడటంతో వాటివెంట దృష్టిని పోనిస్తున్నారు యువకులు. ఏ జేబులో ఏ అప్పుందో అనవసరంగా వృథా చేయడమెందుకని వేటాడేస్తున్నారు అప్పారావులు. సూక్ష్మంగా చెప్పాలంటే పవ వైవిధ్యానికి చిన్న శైజు ఉదాహరణలా ఉంది ఆ సీను.

పెళ్ళిచూపుల్లో సరిగా చూచేందుకు సిగ్గు అడ్డం వచ్చిన పెళ్ళికూతురు మధ్య కట్టిన నైలాన్ గుడ్డలోంచి చూపులు సారించి లీలగా కనబడుతున్న "అవటోయే......"ని చూసి సంతృప్తి పడుతోంది. మామగారిచ్చిన అడ్వాన్సుతో కొన్న రిస్టువాచిలోకి పదేపదే చూసినా కాలం గడవకపోవడంతో తిథులు, వారాలు, నక్షత్రాలని కొప్పడుతున్నాడు ఈ క్షణం కోసం పాతికేళ్ళు ఆగిన పెండ్లికొడుకు.

మేళాలు భూనభోంతరాలు అదరగొడుతున్నాయి. ముహూర్తం సమీపిస్తోంది. పురోహితులు పోటీలు పడి మంత్రాలు చదివేస్తున్నారు. ఒకాయన మంగళ సూత్రం పళ్ళెంలో పెట్టుకుని అందరికీ అక్షతలు పంచిపెడుతున్నాడు.

కొంచెం అవంటా నిలబడిన పెళ్ళికొడుకు తండ్రికి పై పేరాగ్రాఫ్‌లో ఆఖరి లైను తప్ప మిగిలినవేవీ కన బడటం లేదు. బయట గంద్రగోళం పట్టించుకోనంతటి ఆనందోత్సాహాల్లో మునిగి నిర్వికల్ప సమాధిలో తేలుతున్నాడనికాదు దాని భావం. మాయాబజారు 'ప్రియదర్శిని' లో రేవతీదేవికి కనబడిన శాస్త్రిలు (డబ్బు) ఆయనకి ఎప్పుడూ కంటిముందు ఆడుతుంటాయి.

"ముహూర్తం సమీపిస్తోంది. ఇతగాడు ఇంకా కనబడడేమి చెపుమా" అన్న జిజ్ఞాసతో అప్పటికే ఆయన సగం వెంట్రుకలు పీకేసుకుని తన పక్కన పోసుకున్నాడు. గడియారంవంక, అక్షింతలు పంచి పెడుతున్న పురోహితుడివంక, పందిరిలోకివచ్చే ద్వారం వంక — ఆయన చూపులు మార్చి చూస్తున్నాడు.

"ఇంకా కాలం గడవదేమి చెప్మా" అనుకుని భారంగా బలంగా నిట్టూర్చాడు పెళ్ళికొడుకు. జీవితంలో రాబోతున్న మార్పుకు బంగారుతో చిరు చెమటపట్టిన పెళ్ళికూతురు ఆ నిట్టూర్పు తాలూకు గాలిసోకి 'హాయి' అనుభవిస్తోంది.

"ఏమిటిలా పరుగెడుతోంది టైము బొత్తిగా భయం, భక్తి లేకుండా. ముహూర్తం ఇంకా అయిదు నిముషాలు మాత్రం ఉంది" అని చిందులు తొక్కుతున్నాడు లింగరాజుగారు.

"అమ్మయ్య ఇంక అయిదు నిముషాలేగా ఉంది— ఈ కాసేపు ముఖం చాటేస్తే మంగళసూత్రం కట్టాక తన్నుకుచావనీ" అని నవ్వుకుని, "అయినా ఆ శుభ క్షణాన్ని నేను కూడా చూచేదగాక" అని పందిట్లోకి దొంగచాటుగా ప్రవేశించి ఒక లావుపాటి శాల్తీని చాటు చేసుకుని నేత్రానందం కావించుకుంటున్నాడు ధూపాటి వియ్యన్నకి డిటో అయిన పెండ్లికూతురు తండ్రి.

కాని ఆయన—తన వియ్యంకుడికి తనంటే ఎంత ప్రేమ ఉందో పసికట్టడంలో కొంచెం తక్కువ అంచనావేశాడని చెప్పక తప్పదు. పావురాన్ని చూసిన డేగ వేగాన, కప్పని చూసిన పాము చందాన, ఎలుకని చూసిన పిల్లి ఒడుపుతో, కాబోయే వియ్యంకుడి పక్కన చేరి, "ముహూర్తం వేళకి వచ్చారే బావగారు" అని బుజం విరిగేలా తట్టి పెళ్ళున నవ్వాడు లింగరాజుగారు.

బిక్క చచ్చిపోయాడు సదరు పావురం, కప్ప, ఎలుక—ఇంక అటువంటివే బోలెడు అయిన కన్యాదాత వియ్యన్నగారు. తేలిగ్గా నవ్వుదామని కూడా ప్రయత్నించాడుగాని అది పెదిమలు దాటి రాలేదు.

"మరి ముహూర్తం ఇంకా మూడు నిముషాలు మాత్రం ఉంది. సొమ్ము జతపరుస్తే"......అన్నాడు ఆహారంపట్ల వ్యవహారం పట్ల మొహమాటం ఎరగని లింగరాజుగారు.

"ఒక్కసారి ఇలారండి" దీనంగా కోరాడు సదరు కన్యాదాత వియ్యన్నగారు.

లింగరాజుగారి మనస్సులో లీలగాఉన్న అనుమానం వేళ్ళు తన్ని చెట్టయి, వృక్షమయి వూడలు కూడా దింపేసింది. "అనుకున్నంతా అయింది స్మీ" అనుకుని గడియారాన్ని సంప్రదించాడు. "ఫరవాలేదు వెళ్ళిరా, ఇంకా రెండు నిముషా లుందిలే—కాళ్ళ బేరం కూడా కావియ్" అంది.

నెక్స్ట్ సీనులో ఒక గది, ఆ గది కిటికీగుండా కనబడుతున్న కళ్యాణమంటపం లింగరాజుగారి కంట పడకుండా అడ్డం నిలబడి ఆయన్ని బతిమాలుతున్న వియ్యన్నగారికన్న రెండు ఆకులు ఎక్కువ చదివి అయిదారంగుళాలు పొడుగు సాగిన లింగరాజుగారు వియ్యన్నగారి తలమీదుగా 'క్రేన్‌షాట్' లో చూస్తూ ఆయన చెపుతున్నది వినుట నభినయిస్తున్నాడు.

"ఇంకేమయినా చెప్పేదుందా?" అన్నాడు లింగరాజుగారు టైము చూసుకుంటూ.

"ఒకనెల లోపల జత పరుస్తాను. పదివేలు. ప్రస్తుతానికి ఈ రెండూ ఉంచండి. ఇవి చేతులు కావు" అన్నాడు చేతులు పట్టుకున్న వియ్యన్నగారు.

"నెలా అయాకే ముహూర్తం పెట్టించక పోయావ్?" అని చీదరించుకుని, అవతల మంగళ సూత్రం కట్టేందుకు కొడుకు లేవడం గమనించి ఇవతలికి రాబోయాడు.

వియ్యన్నగారు ఇక తెగించారు. ఒక్క నిముషం— ఈ ఒక్క నిముషం వియ్యంకుడిని ఆపగలిగితే...... గట్టిగా వాటేసుకున్నాడు లింగరాజుగారిని.

లింగరాజుగారు వదిలించుకుందుకు చేసిన ప్రయత్నం వ్యర్థమయింది. కిటికీలోంచి 'జగ్గయ్య' గొంతుతో వూరు ఉద్దరిల్లేట్టు 'ఆగు' అని అరిచాడు.

అసలు మన పెద్దలు సూత్రధారణవేళ మేళాలు గట్టిగా మోగించాలన్నది, తుమ్ములు వగైరా వినబడకుండా అని అంటారుగాని నా ఉద్దేశ్యం మాత్రం ఈ 'ఆగు' వంటి కేకల్ని వినబడనీయకుండానే అని!

# కవి సార్వభౌముడు

## నోరి నరసింహ శాస్త్రి

### జరిగిన కథ

సర్వజ్ఞ చక్రవర్తి బిరుదాంచితుడగు కొండవీటి ప్రభువు పెదకోమటి వేమారెడ్డి శ్రీనాథభట్టును కవిసార్వభౌమ బిరుదు పట్టముతో అలంకరించి, సర్వవిద్యానిలయమైన శ్రీ విద్యానగరమునకు విద్యావిజయ ప్రస్థానము చేయవలసిందని అర్థిస్తాడు. కార్యసిద్ధికై దైవజ్ఞులుసూచించిన పౌష్టిక క్రియలు ఆచరించి శ్రీనాథుడు యాత్రకు సంసిద్ధుడవుతాడు. సింగన ప్రధానితోను, కామనభట్ట కాణునితోను ముచ్చటించి, డిండిముని శాస్త్ర పాటవము, లోపాలు తెలుసుకుంటాడు. వేమభూపాలుడు ఆయనకు ఉచితమైన వీడ్కోలు ఇచ్చి పంపుతాడు. విద్యానగరం చేరినతరువాత శ్రీనాథుడు ముమ్మక్రకవి ఆతిథ్యం స్వీకరిస్తాడు. డిండిమభట్టును జయించేందుకే శ్రీనాథుడు వచ్చాడన్నవార్త వ్యాపిస్తుంది. డిండిమునకు ఆవిషయం శిష్యుల ద్వారా తెలిసి, శ్రీనాథుని బెదరగొట్టడానికి, లింగనసోమయాజి క్రతువు చూచేమిషతో యజ్ఞశాలకు వెడతాడు. శ్రీనాథునివెంట వచ్చినమల్లవీరుడుపర్వతమల్లురొక్క శిష్యుడువిద్యానగరమల్లవీరుడైన విద్యామల్లు శిష్యునిచేతిలో ఓడిపోతాడు. శ్రీనాథుని కవిత్వం దోషభూయిష్ఠమైందని విద్యానగరంలో ప్రవాదు బయలేరుతుంది. శృంగేరీ విరూపాక్ష పీఠాధిపతుల ఆశ్రమంలో అరుణగిరినాథుని పత్నికీ, శ్రీనాథుని పత్నికి సఖ్యము ఏర్పడినది. శ్రీనాథుడు మానసోల్లాస కావ్యాన్ని అభిప్రాయార్థం అరుణగిరినాథులకు పంపుతాడు. తాను గూఢచారుడను అనుమానమును పోగొట్టుకొనుటకు శ్రీనాథుడు కటకపాలుని సందర్శించి మెప్పుపొందుతాడు.

డిండిమునకు మానసోల్లాసము పంపి అనాటితో వారము దినము లయినది. ఈనాడు అభిప్రాయార్థము నృసింహభట్టు వెళ్లవలసిన రోజు. ఆయనతో మరెవరిని తోడిచ్చి పంపుట ఉచితము అని శ్రీనాథుడు మిత్రుల సలహా అర్థించెను. వారిలో పలువురకు డిండిమభట్టుతో సంభాషించి రావలెనని ఉబలాట మున్నది. నలుగురు పండితులు వెళ్లెదమనిరి. ఒకరు సుబ్రహ్మణ్య శ్రౌతి. రెండవవాడు సాంఖ్య న్యాయ వైశేషిక దర్శనములలో విద్వాంసుడగు తాతంభట్టు. మూడవవాడు ఉభయమీమాంసా కోవిదుడగు పేరిశాస్త్రి. నాల్గవవాడు అష్టాదశ భాషాకవి యగు లక్కనసూరి. లక్కనసూరి ప్రాకృత భాషాభేదము లన్నిటిలో ధారాళముగా సంభాషింప నభ్యాసము చేసినవాడు. అతడు కొంచెము వాచాలు డగుటచే శ్రీనాథుడు సందేహించుచు, "లక్కనార్యా, అక్కడ మానసోల్లాసము సంగతి నృసింహభట్టు తప్ప మరెవరూ ప్రశంస చేయరాదు. మీ నోరు ఆ విషయ

50—వ పేజీ చూడండి






దైవజ్ఞపోతూరి శ్రీరామమూర్తి

12-1-1962 శుక్రవారము మొదలు
18-1-1962 గురువారము వరకు

### మేషం !

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రస్తుతం గ్రహస్థితి మీ గొప్పదనాన్ని సూచిస్తున్నది. మీ ఆర్థికస్థితి బాగుంటుంది. ఇంతకు ముందు మీ అశ్రద్ధవల్ల వచ్చిన ఇబ్బందులను చక్కగా దాటుకుంటారు. చేసినపనినే తిరిగి చేయవలసి వచ్చినా విశ్వాసంతో పైవారిని సంతృప్తిపరచ గలుగుతారు. మీ చేత పని చేయించుకొని పేచీ పెట్టుకునేవారు ఉంటారు. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సులభంగా వస్తుంది. ఉష్ణ, శైత్య ప్రకోపాలవల్ల తాత్కాలికంగా అనారోగ్యం చేస్తుంది. పండితులతో పరిచయం లభిస్తుంది. విలువగల వస్తువులు కొంటారు. విశేషంగా డబ్బు పెట్టుబడి పెట్టవలసిన వ్యాపారాలలో ఆరంభంలో కనుపించిన ఉత్సాహం క్రమంగా తగ్గవచ్చు. మీ క్రింద పనిచేసే వారితో తగాదాలు రాగల అవకాశాలున్నవి. 16, 17 తేదులలో శుభ కార్యసిద్ధి, వృత్తిలో కీర్తి, ధన లాభము.

* * *

### వృషభం !

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఈ సమయంలో పట్టుదల ప్రధానంకాదు. పైన ఉన్నభారం తగ్గించుకొనటానికి ప్రయత్నించటం అవసరం. కుటుంబంలో అనారోగ్యాలవల్ల ఖర్చులు, అశాంతి కనుపిస్తవి. వృత్తిలో భాగస్తుల

> **గ్రహస్థితి**
>
> కర్కాటకంలో రాహువు, ధనుస్సులో అంగారకుడు, ధనుర్మకరాలలో సూర్య శుక్రులు, మకరంలో బుధ, గురు, శని, కేతువులు, మీన, మేష, వృషభ, మిధునాలలో చంద్రుడు.

వంటివారివల్ల స్వల్ప విషయాలలో అసంతృప్తి ఏర్పడుతుంది. క్రొత్తగా వ్యవహారాలలో దిగవలసిన అవసరం రావచ్చు. కాని, ఏదో ఒక విధంగా పరిష్కారం చేసుకొనటం మంచిది. ఆదాయం వృద్ధి అయ్యేటట్లు కనుపిస్తుంది. కాని, ఎప్పటి కప్పుడు ఏదో ఒక అభ్యంతరం వస్తూ ఉంటుంది. వారం రెండవ భాగంలో శుభ వార్తలు తెలుస్తవి. మీకు ఉత్సాహకరమైన విషయాలను చెప్పి వృత్తి, ఉద్యోగాలలో చిక్కులను తొలగించే మిత్రులు లభిస్తారు. విలాస వస్తువుల నిమిత్తం ఖర్చులు పెరుగుతవి. వాహనాలుకాని, స్థిరాస్తులుకాని కొనే ప్రయత్నాలు చురుకుగా జరుగవు. బంధువులవల్ల ఖర్చులు పెరుగుతవి. అశ్రద్ధవల్ల నష్టం. 12, 13 తేదులలో ప్రయాణాలు, ఆందోళనకరమైన వార్తలు.

* * *

### మిథునం !

(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఏది ఎలా ఉన్నా, ధనాదాయం బాగుంటుంది. ఖర్చు సామాన్యంగా బాధ తోచదు. వ్యవహార విషయాలలో ఉత్సాహపడదగిన సమయంకాదు. మొత్తం కార్యభారం పైనవేసుకొని శ్రమపడుతున్నా, మిమ్ములను గురించి సాటివారు అపోహ పడతారు. వస్త్రాలు, ఆభరణాలు మొదలయినవి కొంటారు. స్నేహితుల సలహ నిమిత్తం మీ శక్తిని వినియోగించవలసి వస్తుంది. ప్రయాణాలు చేయవలసి వస్తుంది. అకస్మాత్తుగా ధనం చేతికి రాగల అవకాశాలున్నవి. ఆప్తులమాదిరి సంచరిస్తూ, మిమ్ములను గురించి ఇతరులతో చులకనగా మాట్లాడేవారు ఉంటారు. జాగ్రత్తగా ఉండండి. వ్యవహార కార్యాలు సంపూర్తిగా నెరవేరవు. శుభ పుణ్య కార్యాలు అనుకూలిస్తవి. బంధువులు మిమ్ములను ఆదరించి సహాయం చేస్తారు. అగ్ని, ఆయుధాలు వీటితో నిర్లక్ష్యంగా ప్రవర్తించవద్దు. 16, 17 తేదులలో కుటుంబంలో అభిప్రాయభేదాలు, వృధా ఖర్చులు.

* * *

### కర్కాటకం !

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)

సాధారణంగా ఏ విషయంలోనూ లోపం కనుపించదు. డబ్బుయొక్క అవసరం అధికమౌతుంది. అందువల్ల మీ ప్రయత్నాలు ఆగవు. వ్యాపార కార్యాలలో మంచివారి సహాయం లభిస్తుంది. బంధువులవద్దనుంచి అనుకూల వార్తలు తెలుస్తవి. ఈ సమయంలో మీకు తరచూ సందేహాలు కలుగుతూ ఉంటవి. సాధ్యమైనంతవరకు ఇతరుల సలహాలను అనుసరించకుండా ఉండడం మంచిది. బంధువర్గంలో మిమ్ములను మాటలతో నొప్పించేవారు ఉంటారు. ఓర్పుతో అన్ని విషయాలలోనూ చిక్కు పడకుండా మీ అంతస్థును కాపాడుకోగలుగుతారు. మీ ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. క్రమ క్రమంగా మీ ఆదాయం బాగుంటుంది. భూములు మొదలయిన వాటివల్ల ఫలితం లభిస్తుంది. ప్రయాణాలు సాగలేదని, అసంతృప్తి పడవద్దు. 13, 14 తేదులలో అధికారులతో స్నేహము, మానసికంగా సంతృప్తి, పరోపకారము.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

సమయానుకూలంగా పని చేయగలుగుతారు. ఆక స్మికంగా తోచిన వ్యవహారాలు పాటించటం అవి అనుకూలిస్తవి. మిమ్ములను కొంతవరకు పరీక్షించేవారు ఉంటారు. యంత్రాలు, భూములు మొదలయినవి కొనే ప్రయత్నాలు లాభిస్తవి. మీరు ఒకమాట చెప్పగానే పదిమంది ఆమోదిస్తారు. ప్రత్యేకంగా కలుగజేసుకొని, శ్రమపడకుండా ఆ యా సమయాలలో మీ కార్యక్రమాలు నెరవేరుతవి. కొన్ని విషయాలలో దుబారా కనుపించినా అసంతృప్తి తోచదు. కుటుంబంలో ఆనందంగా ఉంటుంది. శుభకార్యాలు జరుగుతవి. డబ్బుఇచ్చి పుచ్చుకొనటంవంటి సందర్భాలలో నిష్కర్షగా ఉండటం అవసరం. వారం రెండవ భాగంలో కారణంలేని చికాకు, సందేహాలు వస్తూ ఉంటవి. ఎదురు చూస్తున్న వార్తలు వచ్చినా అంత లాభదాయకంగా ఉండవు. 16, 17 తేదులలో కార్యభారం, అసౌఖ్యము, సంఘంలో మంచిపేరు.

* * *

**కన్య:**

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

అవసరాన్నిబట్టి మీ డబ్బును బహు జాగ్రత్తగా వినియోగించగలుగుతారు. ఒకరి మాటలకు సమాధానం చెప్పవలసిన అవసరం తొలగుతుంది. మీతో అవసరం తీరగానే దూరంగాపోయేవారు ఉంటారు. మీ ధనాదాయం పెద్దగా వృద్ధికాలేదనే బాధ పెట్టుకోవద్దు. క్రమ క్రమంగా ఆదుర్దా తగ్గి, సుఖం లభిస్తుంది. క్రొత్త మనుష్యులతో చేరటానికిగాని, క్రొత్త వ్యాపారాలలో ప్రవేశించటానికిగాని ఉత్సాహం కలుగదు. దైవ కార్యాలలో పాల్గొంటారు. తలవని తలంపుగా ధనం లభిస్తుంది. పిల్లల ఆరోగ్యం తృప్తికరంగా ఉండదు. స్నేహితుల మాటలధోరణి తాత్కాలికంగా ప్రోత్సాహకరంగా తోచినా చివరకు ఏ విధంగానూ ఉపయోగం ఉండదు. వృత్తి, ఉద్యోగాలలో మీ మాట చలామణి అవుతుంది. 15, 16 తేదులలో కార్య అనుకూలత, బంధువర్గంలో కలహాలు, అశాంతి.

* * * *

**తుల :**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఫలితం ఉన్నట్లే ఉంటుంది. కాని సుఖం వదులుకొని శ్రమ చేయవలసి వస్తుంది. ఒకరికి మాట ఇచ్చిన ప్రకారం మీ సామర్థ్యంతో సహాయం చేయగలుగుతారు. వృత్తిలో అభివృద్ధికరమైన మార్పులు వస్తవి. అయితే ముందుగా మీరు కొంత వ్యయాన్ని శ్రమనూ భరించవలసిన సమయం. స్వబుద్ధితో యోచించి, కార్యరంగంలో ప్రవేశించగలుగుతారు. బంధు మిత్రులతో మాట్లాడే సందర్భంలో ఓర్పుగా ఉండటం అవసరం. ధనాదాయ పరిస్థితులు కొంత వరకు మేలుగా ఉంటవి. కుటుంబంలోనివారు మిమ్ములను సరిగా అర్థం చేసుకొనకపోవటంవల్ల స్పర్థలు, అశాంతి రేగుతవి. అంతమాత్రంచేత ఏ పనీ ఆగదు. ఇతరుల మాటలను నమ్మి మీరు అను [illegible] కాలంలో డబ్బును వినియోగించవద్దు. 13, 14 తేదులలో విందులు, వినోదాలు, ఉత్తర, తూర్పు దిక్కులనుంచి శుభవార్తలు.

* * *

**వృశ్చికం !**

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

ప్రతిదానికీ ముందు ఆదుర్దా ఎక్కువ. ఈ సమయంలో వచ్చే వార్తలు కూడా అలాగే ఉంటవి. అందువల్ల యథార్థంగా అపాయం కలుగదు. వృత్తి ఉద్యోగాలలో ఇంతకుముందు ఉన్నటువంటి చిక్కులు పోటీ తొలగిపోతవి. మనశ్శాంతి లభిస్తుంది. ఇతరుల దుష్ట యోచనలు మీమీద పనిచేయజాలవు. అయితే శక్తికి మించినభారం పైన పెట్టుకోదగిన సమయం కాదు. కుటుంబంలో ఖర్చులు పెరగగల సమయం. మంచివారి సలహా లభిస్తుంది. మీ ఆరోగ్యం ఇంతకుముందుకన్నా మేలుగా ఉంటుంది. కాని, మానసికంగా స్పష్టత కనుపించదు. వారం చివరలో అతి స్వల్ప విషయాలలో తగాదాలు వస్తవి. దండుగ పనులలో ధనవ్యయం చేస్తారు. 14, 15 తేదులలో నౌకరులతో పేచీలు, కార్యభంగము.

* * *

**ధనుస్సు !**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ప్రత్యక్షంగా ఏ విధమైన ఇబ్బందీ రాకపోయినా వస్తుందేమోననేభావం కలుగుతూ ఉంటుంది. దైవికంగా వచ్చిన అవకాశం సంతృప్తికరమైన ఫలితాన్నిస్తుంది. ఈ సమయంలో వృత్తి వ్యాపారాలలో మీ ప్రత్యేక శ్రద్ధవల్ల ప్రయోజనం తక్కువ. బంధువులు మిమ్ములను గౌరవంతో చూస్తారు. మీ ఆరోగ్యం సరిగా యుండదు. భారీ కార్యక్రమాలలో డబ్బును వినియోగించతగిన సమయంకాదు. తరచు తగాదాలు రాగల సూచన లున్నవి. మీ అంతరంగిక విషయాలలో మరొకరి జోక్యం లేకుండా జాగ్రత్త వడండి. పిల్లల మూలంగా ఖర్చులు పెరుగుతవి. ఆదాయం పెద్దగా పెరగదు. కాని, ఏ విషయంలోనూ ఇబ్బంది కనుపించదు. పదిమందిలో గౌరవం పొందగలుగుతారు. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి. 12, 13 తేదులలో పనుల తొందరలో దుబారా, ఆలోచనలేని పనులు.

* * *

**మకరం :**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

జరుగవలసిన పని ఏదీ ఆగదు. ముందుగా ఆలోచనలు, తెమలక అవస్థ పడతారు. రావలసిన ధనం ఒకసారిగా అందకపోవటంవల్ల అధైర్యం తోస్తుంది. వృత్తిలో మునుపటికన్నా ప్రోత్సాహం కనుపిస్తుంది. అధికారులవల్ల ఆదరము, సహాయము లభిస్తవి. యథార్థం మాట్లాడటంవల్ల స్నేహితులతో పేచీలు రావచ్చు. ఇతరుల నిమిత్తం హామీ ఉండటం వంటి బాధ్యతలు పెట్టుకొనతగిన సమయంకాదు. ప్రయాణాలు లాభిస్తవి. మాటలలో మీ గుట్టును తెలుసుకొనేవారు ఉంటారు. జాగ్రత్తగా ఉండండి.

**ఈ వారము ధరలు**

బంగారం ధర వారాంతంలో పెరిగే ఉంది. వెండి ధరలో పెద్ద మార్పులు కనుపించవు. ధాన్యం ధర తగ్గే అవకాశాలున్నవి. ప్రత్తి ధర కూడా అవుతుంది. మిర్చిధర తాత్కాలికంగా పెరుగుతుంది. వెంటనే మండి తగ్గే అవకాశాలున్నవి. ధనియాల ధర మామూలుగానే ఉంటుంది. నూనెల రకాల ధరలు క్రమంగా పెరుగుతూ ఉంటవి. గోధుమల ధర మండి వస్తుంది. మినుములకు గిరాకీవస్తుంది.

లాటరీ, పట్టా వ్యాపారంవంటి సాహస కార్యాలలో కొంతవరకు అనుకూలం పొందగలుగుతారు. సంచారము, దేహశ్రమ అధికం అవుతవి. ఎదటివారి సమర్థతను తెలుసుకోకుండా వారిని అనుసరించవద్దు. 15, 16 తేదులలో కార్యసిద్ధి, పడమర దిక్కునుంచి లాభ వార్తలు.

* * *

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

మీరు ఓర్పుతో ఉండి గౌరవం పొందగలుగుతారు. ఏ విషయంలోను మధ్యవారి మాటలమీద ఆధారపడవద్దు. ముందు కొంత శ్రమ పడవలసి వస్తుంది. కాని, పదిమందిలో మీ యోగ్యతను కాపాడుకోగలుగుతారు. ఎక్కువ శ్రమతో కూడిన కార్యక్రమాలు నిర్వహిస్తారు. ముందు ముందు మీ కష్టం బాగా ఫలిస్తుంది. వృత్తిలో మీరు అనుకొనే చిక్కులు ఏమీ రావు. ఖర్చుల విషయంలో చాలా జాగ్రత్తగా ఉండటం అవసరం. ఇచ్చేవారు ఉన్నారని తొందరపడి అప్పులు చేయవద్దు. కుటుంబంలో జరుగవలసిన పనులలో ఒక క్రమం అనేది ఉండదు. మొత్తంమీద ఏదో ఒకవిధంగా జరుగుతవి. తరచూ మీ బాధ్యతలను మరచిపోతూ ఉంటారు. ధర్మకార్యాలు నిర్వహిస్తారు. 17, 18 తేదులలో మిత్రలాభం, వ్యవహారాలలో అనుకూలత, ఇష్ట వస్తు లాభం.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

గౌరవ ప్రదమైన కాలం. డబ్బు ఖర్చు చేసినా, తగినంత ఉపయోగము, విలువ పొందగలుగుతారు. ఒకరి మనస్సును బాధించకుండా మీ పనిని సాధించుకోగల అవకాశాలు లభిస్తవి. నిష్ఠుర ప్రసంగాలు వచ్చినా మీ ఆదాయానికిగాని, పేరు, ప్రతిష్ఠలకుగాని దెబ్బ తగలదు. ధైర్యంతో ఉండటం అవసరం. భాగస్తులతో కలసి చేయు పనులలో సులభంగా ముందుకు పోలేకపోతారు. ఇతరులవద్దనుంచి రావలసిన డబ్బును జాగ్రత్తగా రాబట్టుకొనటం అవసరం. గొప్పదనం కోసం ప్రాకులాడటంవల్ల కొన్ని చిక్కులను ఎదుర్కొనవలసిన సమయం. కోర్టు కచేరీలలో అనుకూలంగా ఉంటుంది. దూర ప్రయాణాలు చేయవలసి రావచ్చు. 15, 16 తేదులలో శుభ సంతోష కార్యాలు, వృత్తిలో శ్రమకు తగిన ఫలం. 

# డాక్టర్ రాజు

బొమ్మలకథ

దేవిక

7















# జూల్స్ వెర్న్

# భూగర్భంలోనికి సాహసయాత్ర




## జరిగిన కథ

హాంబర్గ్ నగర నివాసి ప్రొఫెసర్ లిడెన్‌బ్రోక్ ఒక పాత గ్రంథం సంపాదిస్తాడు. దానిలో దొరికిన ఒక తవ్వకపత్రంలో రహస్య సందేశం ఏదో ఉంటుంది. కాని అది ఆయన తమ్ముడు కొడుకైన ఆక్సెల్ మాత్రం తెలుసుకుని భయవిహ్వలుడవుతాడు.

అయినా తన పెదనాన్న దాని విషయమై పడుతున్న బాధ చూడలేక, రహస్యం చెప్పేస్తాడు. 'ఆర్నె సాక్నుస్సెమ్' అనే ప్రాచీన ఐస్‌లాండిక్ శాస్త్రజ్ఞుడు, యాత్రికుడు భూగర్భంలోనికి వెళ్లినట్లు వ్రాసి ఉంటుంది. ఐస్‌లాండ్‌లో ఆరిపోయిన ఒక అగ్ని పర్వతం ముఖద్వారంలో నుంచి వెళ్లినట్లు ఉంటుంది. ఆక్సెల్ ఇది నిజం కాదని వాదించినా వినిపించుకోనకుండా ప్రొ॥ లిడెన్‌బ్రోక్ డెన్మార్కు మీదుగా ఐస్‌లాండ్ ప్రయాణం కడ్తాడు. డెన్మార్కులో హెర్ థామ్సన్ సహాయంతో ఐస్‌లాండుకు ఒక పడవ కుదుర్చుకుంటారు. అక్కడ ప్రొఫెసర్ ఫ్రిడరిక్సన్ ఇంట్లో దిగుతారు. స్నాఫెల్స పర్వతం వద్దకు దారి చూపేందుకు ఫ్రిడరిక్సన్ వారికొక గైడ్‌ను కుదురుస్తాడు. అతని పేరు హాన్స్. అతని సహాయంతో వారు స్నాఫెల్స పర్వతానికి బయలుదేరుతారు. దారిలో గర్టర్, ఆల్ఫటాన్స, సార్స, బూడిర, గ్రామాలలో బసచేస్తారు.

## 14

స్టాపీ ఒక పల్లెటూరు. అందులో ఉన్న ముప్పై గుడిసెలూ ఎండలో మాడిపోతూ ఉంటాయి. దానికితోడు అగ్నిపర్వతంమీద ప్రతిబింబించే సూర్యరశ్మి కూడా వీటిమీద పడుతూ ఉంటుంది. నేల అంతా లావాతో కప్పబడి ఉంటుంది. ఊరు ప్రక్కనే ఒక ఫ్యోర్డ్ ఉన్నది. దీని తీరం కూడా రాతిదే. ఈ రాయి పేరు బాసాల్ట్.

ప్రకృతి ఇక్కడ వింత నిర్మాణాలు చేసింది. ఈ రాతితీరం స్తంభాలు స్తంభాలుగా ఉంటుంది. వీటిపైన తిరిగి కప్పులాగ ఏర్పడిన శిలావిశేషాలు వల్ల నిర్మించిన కట్టడాలను పోలి ఉంటాయి. ఈ స్తంభాల మధ్య సముద్రపు టలలు వచ్చిపడి నురుగులు కక్కుతూ ఉంటాయి. వీటి తీవ్రాఘాతాలకు ఆగలేని స్తంభాలు కొన్ని క్రిందపడిపోయి ఉన్నాయి. ఒక ప్రాచీనాలయం కూలిపోయినట్లు అనిపించింది—

47-వ పేజీ చూడండి



# పగటిదొంగలు

యం. యస్. పతి

"పుల్లయ్యా!" అని పిలిచిండు మామ.

"ఏంది మామా!" అనుకుంట ఇంట్లకెలి వరండల కురికొచ్చిన.

"నువ్విడ ఎప్పుడన్న సీన్మ చూసినవా?" అని అడిగిండు.

"యాడ చూసిన మామా! ఇక్కడ సీన్మ లెక్క డుంటయో, ఎట్ల జరుగుతయో నాకెం తెలువ దాయె" అని అన్న.

"అయితే మన పక్కింటోల్ల పిలగాడు ఇయ్యాల్ల మ్యాట్నీ సీన్మ చూసుటానికి పోతుండంట. ఆయన తోటి పోతవా?" అని అన్నడు మామ.

"పోత మామా!" అని అన్న నేను.

అట్లనంగనే, "ఇగో ఈ రూపాయుంచుకో" అని ఒక రూపాయి నోటు జేబులకెలి తీసిండు. వద్దంటె మంచిగుండదని తీసుకున్న.

"మ్యాట్నీ సీన్మలు మూడిటికి శురువైతై. మీరిడ్నుంచి ఓ రెండు గంటలు మొదలే పోతెగాని మీకు టికట్ దొరుకదు. అదయినా ఎంతో ఉశార్ తోటిఉండి మీలైన్ల ఎవ్వరినీ కూడా గుసాయించ నియ్యకపోతే దొరుకుతది. లైన్ల నిలబడ్డంక జర సేపు ఒంటేలుకని, మంచి నీళ్లకని బైటికిపోతే నీ జాగ కూడా పోతది. అందుకని లైన్లకు (క్యూలోకి) రాకముందే అవన్ని చేసుకోవాలె" అని చెప్పిండు మామ. నేను సరేననంగానే మామ కొలువుకు పోయిండు.

* * *

నేను మొఖంగిట్ల కడుక్కోని, స్నానంచేసి భోంచేసి పక్కింటి రంగయ్యోల్ల పిలగానికోసం ఎదురుచూసుకుంట వరండల కూచున్న

అందాదకు పన్నెండౌతున్న టైముకు ఒక పద్దెనిమిదేళ్ల పిలగాడు మా యింటి కొచ్చిండక. నేనాయినను మీదినుంచి కిందిదాక పరీక్షగ చూసిన.

ఆ పిలగాడు అందాదకు (దాదాపు) 5½ ఫీట్ల పొడుగున్నడు. నల్లగ, బక్కగున్నడు. బాలు (క్రాపు) మీదికి దూసిండు. కండ్లకు నల్ల కండ్లద్దాలు పెట్టు కున్నడు. ఇన్‌షటుపి బెల్టు పెట్టిండు. ఆ బెల్టు నడుముకంటె కిందికే ఉన్నది. కాళ్లకు "బాటా" బూట్లు తొడిగిండు. ఆ బూట్లల్లకెలి పైతా బలు (సాక్స్) బైటికి కనిపించాల్నో ఏమోనన్నట్లు ఆయన ప్యాంటు రెండు మూడించులు బూట్ల కంటె మీదికే ఉంది. ఎడమ చేతికి గడియారముంది.

ఆయిన తొడిగిన బుష్‌కోటుబట్ట ఎర్రగా, దానిమీద అడ్డంగ, పసుప్పచ్చ గీతలున్నయ్. లోపటి తెల్లటి బనీను కనిపించాల్నో ఏమోగాని కాలరు దగ్గర్నుంచి రెండు మూడు గుండీలు పెట్టక వట్టిగనే వదిలి పెట్టిండు. ఇది పట్నం మనుషుల తరీఖ (తరహా) కావచ్చనుకున్న.

ఆ పిలగాడు రాంగనే జరసేపు నన్ను కిందికి మీదికి చూసి "నీ పేరేంది?" అని అడిగిండు.

"పుల్లయ్య" అని చెప్పిన.

ఆ పేరు వినంగానే వాడు పచ్చి చింతకాయ తిన్నట్టు మొఖం పెట్టిండు.

ఇదే సందని నేను "నీ పేరేంద"ని అడిగిన.

"సురేందర్" అని చెప్పిండు.



పోహా, ఉండుటు ప్యాంటు పక్క రోజుల లెక్కున్నా గాని ఈ పట్నపోల్లకు పేర్లయితే రాజ కుమారుల తీరుగ ఉన్నయ్.

"నువ్వు పక్కింటి రంగయ్య కొడుకువా?" అని అడిగిన.

"ఆఁ!" అన్నడు.

"మరి సీన్మకు పోదామని వచ్చినవా?" అని అడి గిన.

"ఆ, గండుకే వచ్చిన. మీ మామ నిన్ను నాతోటి సీన్మకు తీసుక పొమ్మన్నడు."

"అట్లయితే ఆగు. నేను మా అత్తకు చెప్పొస్త" అనుకుంట ఇంట్ల కుకిరిన. అత్త ఇంట్ల బియ్యం చేస్తుంది—నేను సీన్మకు పోతున్నని చెప్పిన. సీన్మ అయిపోంగనే జల్ది రమ్మని చెప్పింది—సరేనని ఉశారు తోని ఇవుతల పడ్డ.

మేము సీన్మ టాకీసు చేరేవారకు బుకింగ్ ఆఫీసు ముందట చిన్న లైను కట్టుంది. మేము సైకిల్ను స్టాండుల పెట్టివొచ్చి లైన్ల నిల్చున్నం. మాకంటె ముందట వో ఇరువై మందిదాకున్నరు.

"మనకు టికట్ జల్దే దొరుకుతది" అన్నడు సురేందర్.

"మంచిదేగద" అన్న నేను.

అట్ల మేము గంటన్నరసేపు నిలబడేవరకు ఇరవై మందున్న తర్డ్‌క్లాసులైను నూటయాభై మంది దాకయింది. మా ముందట్నే వో ముప్పై, నలభైదాక గుసాయించిండ్రు. వాళ్లందరు గుసా యించుడు ఎవ్వరికి తెలువకుండనే జరిగిపోయింది.

అట్లింకో అర్ధగంట గడిచింది. అంతట్లనే టికట్లిచ్చేటోడు ఒక చిన్న పెట్టె పట్టుకొని వొచ్చి బుకింగ్ ఆఫీస్‌ల చొచ్చిండు.

ఇగ చూసుకో, రెండు గంటల్నుంచి ఎదిరి చూస్తు న్న తర్డ్‌క్లాసు లైన్ల ఎంత ఉశార్ పుట్టిందో! ఇదువార్‌దాకా చచ్చిన పీనుగులు పడిగట్టున్నవాళ్లు ఇప్పుడు లేడి పిల్లలెక్క ఎగురుడు మొదలు పెట్టిండ్రు. ఉడుకుడుకు కాఫీలు పది చెంబులు తాగినట్టు యిందో ఏమో, ఒకనిమీద ఒకడు పడుకుంట ముంద టికి దొబ్బుడు శురువైంది. ఇదే ఛాన్సనుకొని ఇది వార్‌దాకా అవతల నిల్చున్న కొందరు "హీరోసాబులు" లైన్ల గుసాయించుతున్నరు. ఇగ వెనుకున్నోల్లు "ఉస్‌కో నికాల్‌దో, నికాల్‌దో" అని కేకలేసుడు మొదలు పెట్టిండ్రు. వాళ్లట్లఉన్న జాంగలకెలి కాకు లెక్క మొత్తుకుంటున్నరేకాని, లైన్ల గుసాయించి నోన్ని ఒక్కడు కూడా ముందుకొచ్చి బైటికి గుంజేస్త లేడు.

ఇట్ల గుద్దులాటలోటి, తన్నులాటలోటి గుసా యించేటోల్లతోటి బుకింగ్ ఆఫీసు ముందట చిన్న లడాయి శురువైంది.

ఇంతట్లనే ఇద్దరు పోలీసులు ఆడి కొచ్చిండ్రు. రాంగనే లైను పక్కకుండి గుసాయించాలని చూస్తున్న వాళ్లందర్నీ ఆడికెలి బైటి కెల్లగొట్టిండ్రు. పోలీసు లకు తిరుగబడాలని చూసినోల్లను చేతులున్న లాటీల తోటి కొడుతున్నరు. ఇట్ల పోలీసులు రాంగనే లైన్లున్న చప్పుడు జర తక్కువైంది. అయినాగాని పోలీసుల కండ్లల్ల పడకుంట కొందరు లైన్లల్ల చొర్రుతునే ఉన్నరు.

బుకింగోడు టికట్లిస్తనే ఉన్నడు; టికట్లందంగనే ఒకనిమీద ఒకడు పడుకుంట సీన్మ హేటర్ దిక్కు ఉరుకుతునే ఉన్నరు. కాని మాలైను జర్ర కూడ ముందటికి జరుగుతనేలేదు. మరి ఆ బుకింగోడు టికట్లెవ్వరి కిస్తుండో ఆ దేవునికే ఎరుక.

ఒక పోలీసోడు నా దగ్గర చానసేపు నిల్సున్నడు. ఆఖరుకు వానికి కాళ్లు గుంజినయో ఏమో, బుకింగ్ దిక్కు పోయిండు. వాడటు పోంగనే ఒక హీరోసాబు జల్ది ఉరికొచ్చి నా ముందట గుసాయించిండు. మల్ల లైన్ల చప్పుడు శురువైంది. "ఉస్‌కో నికాల్‌దో ఉస్‌కో నికాల్‌దో" అని మొత్తుకున్నరు. ముందటికి పోయిన పోలీసోడు చటుక్కున వెనుకకు తిరిగి నా దగ్గరి కొచ్చి నా ముందటున్నోన్ని గుంజేసుటానికి బదులు నన్నవుతలికి గుంజి పారేసిండు.

"అరె, అరె, నేను రెండు గంటల్నుంచి లైన్ల నిలబడ్డ. నా ముందటాయిన ఇప్పుడు గుసాయించిండు" అని నేనెంత మొత్తుకున్నా, నా దోస్తు సురేందర్ ఎంత చెప్పినా వాడు వినిపించుకోకపోవుడే గాక, వాని చేతిలున్న లాఠీతోటి నాకుమీద రెండు చురుకులందిచ్చిండు. అప్పుడు నిజంగ నా కండ్లల్లకెలి నీళ్లు టపటప రాలినై. ఈ లొట్టసీను సీన్మకోసమని పోలీసోళ్లతోటి బే—ఇన్సాఫ్ (అన్యాయం)గ దెబ్బలు తినాల్నా! ఈ పట్నపోళ్లకు సీన్మలంటె ఎందుకింత పిచ్చి. రెండు గంటల్నుంచి లైన్ల నిలబడి కాళ్లు గుంజినాగాని, ఒంటేలుకొచ్చినాగాని, దూపైనా (దాహం వేసినా)గాని, వెనుకోళ్లు ముందటికీ, ముందటోళ్లు వెనుకకు దొబ్బి దొబ్బి పచ్చడి చేసినాగాని, ఓర్చుకుంట నిలబడాలె. ఆఖరుకు పోలీసోడు గుంజిపారేస్తే ఏడుపు మొఖం పెట్టుకొని పోవాలె! ఎందుకొచ్చిన తిప్పలిదంతా! ఈ పట్నంల సీన్మలు చూసుటానికంటె బండ గట్టుకొని బాయిల దునుకుడు మంచిదనిపించింది.

ఇంతట్లనే సురేందర్ టికట్ తీసుకొని ఉరికొచ్చి, "నువ్వు బ్లాకుల టికట్ కొనుక్కొనిరా. నేను లోపల సీట్లు రోకాయించుత" అనుకుంట సీన్మ హేటర్ దిక్కురికిండు.

ఇంతేరా, పట్నం మనుషుల తీరు. దోస్తైన నేను టికట్ దొరుకక ఏడ్పు మొఖం పెట్టుకొనుంటే, తనకు దొరికిందిగదా అన్న ఖుషీ తోటి హేటర్లకు బగాయించె!

ఇంక జర్ర సేపటి వారకు బుకింగ్ బందయింది. టికట్ దొరుకనోళ్లందరు నా లెక్కనే నారాజ్ తోటి నిల్సున్నరు.

మల్ల జర్రసేపటికి నల్లకమీజా, తెల్ల పంట్లోనూ తొడుక్కున ఒకడు "ఎక్‌రూపాయ్, ఎక్‌రూపాయ్" అనుకుంట జేబులకెలి ఇరువై—ముప్పై దాకా థర్డ్ క్లాస్ టికట్లు తీసి పట్టుకున్నడు. అక్కడున్న ఏడ్పు మొఖాలన్ని వాని చుట్టూరా ముసురుకున్నై. ఆఠాన కిచ్చే టికటు వాడు రూపాయి కిస్తున్నడు. పది నిమిషాలల్ల పది—పదిగేను రూపాయలు కమీషన్ కొడుతడు. మా మామేమో రోజూ పొద్దుగాల ఎనిమిదీటికి పోయి పొద్మికి ఆరు గంటల దాక పని చేస్తె ఆయినకు రోజూ అయిదు రూపాయలన్నా రావు. కాని వీడేమో ఎసొంటి కష్టం లేకుంటనే ప్రజల కండ్లల్ల పచ్చి మిరపకాయల కారం రుద్ది బోలెడు రూపాయలు సంపాయిస్తున్నడు. ఈ బ్లాకోడు రాంగనే దేవు డొచ్చిండనుకొని వాని దగ్గర, చెప్పిన ధరకు టికట్ కొని సీన్మ చూసుటానికురుకుతరు. కాని వాన్ని పోలీసుకు పట్టియ్యాలని ఎవ్వరూ అనుకోరు. వాళ్లు అనుకోని పనిని నేనన్న చేసి, నా ప్రతాపం చూపెట్టాలనుకున్న.

ఇదువార్‌దాక బుకింగ్ దగ్గరున్న పోలీసోళ్లు సీన్మ గేటుతానికి పోయిండ్రు. వాళ్లటు పోవుడుచూసి బ్లాకోడు ఇక్కడ తన బజారు మొదలు పెట్టిండు. వీన్నెట్లయినా పోలీసులకు పట్టియ్యాలనుకున్నగదా, అందుకని మోకా (అవకాశం) ఎప్పుడు దొరుకుతదా అని చూస్తున్న. బ్లాకోడు పది టికట్లమ్మిండు. ఇంక ఇరువై దాక వాని చేతిలున్నై. వాడు పది రూపాయల నోటిచ్చిన ఒకాయినకు తొమ్మిది రూపాయలు చిల్లరిస్తున్న మోకా చూసి జల్ద వాని ఎడమచేతిలున్న టికట్లు గుంజుకొని గేటు దిక్కురికిన. ఎకాయెక్‌గ జరిగిన దానికి బ్లాకోడు గబ్‌రాయించు నా దిక్కు దౌడాయించిండు. నేను పోలీసులను పోంచాయించి టికట్లు వాళ్ల చేతులపెట్టి, "అగో, ఆ ఉరికొచ్చేటోడు ఈ టిక్కట్లు బ్లాకమ్ముతున్నడు!!" అని అన్న. అంతలోపట ఆ బ్లాకోడు రానే వచ్చిండు. వాడు రాంగనే ఒక పోలీసు వాన్ని పట్టుకొని, "ఈ బ్లాకు టికట్ల బిజినిస్ ఎప్పటినుంచి నేర్చినవ్? నడువ్. నీ పెండ్లి చేపిస్తం" అని వాన్ని డరాయించి నా దిక్కు తిరిగి, "మాతోటి రా బాబూ, మేనేజర్‌తాన నీకు ఇనా మిప్పిస్తం" అని అన్నడు.

నేనూ, పోలీసులూ, బ్లాకోనితోటి మేనేజర్ కమ్రల కొచ్చినం. మేనేజర్ మా నలుగురిని ఇంకో కమ్రలకు తీసుకపోయిండు. అక్కడ ఇప్పటిదాక బుకింగ్‌లల్ల టికట్లిచ్చినోళ్లు కూడా ఉన్నరు. వాళ్లు ఇస్పేటాట ఆడుతున్నరు. పక్కకున్న టేబుల్‌మీద పొడుగు పొడుగు సీసాలూ, గ్లాసులూ, సిగరెట్ డబ్బాలూ, అగ్గిపెట్టెలూ ఉన్నై. సీసాలల్లకెలి ఏందో నీళ్లసొంటిది గ్లాసులల్ల పోసుకొని తాగుతున్నరు.




మే మా కమ్రల (గది)కు పోంగనే వాళ్లందరు నిలబడి నన్ను వింతగ చూస్తున్నరు. అసలుదొంగేమో బ్లాకోడైతే వీళ్లంత నన్ను దొంగ లెక్క చూస్తున్నరేంద్రా అనుకున్న. ఇంతట్ల వాళ్లందరిలో దొడ్డున్నోడు నాతానికొచ్చి, "హలో, హీరోసాబ్! నువ్వు మా బ్లాకోన్ని పట్టుకున్నవటకద. ఇగో నీకు ఇనాం" అనుకుంట నా ఛాతిమీద పిడికిలితోటి గట్టిగ గుద్దిండు. నేను వెల్లెలుకల పడ్డ. వాడు నా బాలు పట్టిమీదికి లాపట్టి నా రొండు చెంపలమీద పటేల్, పటేల్‌మని ఏడెనిమిది దెబ్బలు కొట్టిండు. ఆ దెబ్బలకు నాకు గిరొచ్చింది. (స్పృహ తప్పింది) నా జన్మలో అసొంటి దెబ్బలు ఎన్నడూ తినలేదు. అందుకని నేను వాటిని నిభాయించుకోలేక కింద పడ్డ. అట్ల పడ్డగాని, నన్ను వదిలిపెట్టక పోలీసోళ్లు బూట్లతోటి తన్నుకుంట, లాఠీలతోటి కొట్టిండ్రు. వీళ్లిట్ల కొడుతుంటే మిగిలినోళ్లు పకపక నవ్వుతున్నరు.

ఈ తీరుగ వాళ్లు నరకలోకాన్ని చూపించినంక ఇట్లన్నరు: "ఉంకోసారి గిసొంటి పనిచేస్తే పట్నంల ప్రాణంతోటి బతుకవ్, జాగ్రత్త!!!" అని బెదిరించి వాళ్ల కమ్రలకెలి బైటికి నూకేసిండ్రు.

* * *

నేను సైకిలెక్కి పోతున్నట్టేగాని, నా ప్రాణంల ప్రాణం లేదు. కండ్లు తిరుగుతున్నై. కాళ్లు సైకిల్ పెడల్ తొక్కలేకపోతున్నై. హాండిల్ నే నో దిక్కు తిప్పుతే అదో దిక్కు పోతుంది. ఇగ ఎట్లో నిభాయించుకుంట కాచిగూడ స్టేషన్‌కు

46-వ పేజీ చూడండి

## ఆంధ్రసచిత్రవారపత్రిక

# నవలా రచన పోటీ

# బహుమతి రు. 1000

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సాంఘిక నవలా రచనకు మరొక పోటీ నిర్వహించదలచామని తెలుపటానికి సంతసిస్తున్నాము.

[15-12-1961 గడువుగా పెట్టిన నవలలపోటీ ఫలితాలు త్వరలో తెలుపుతాము. ఇది మరొక పోటీ.]

ఈ పోటీకి పంపే నవలలు మా కార్యాలయానికి 1-5-1962 లోగా చేరాలి.

## నిబంధనలు

- రచనలు కాగితానికి ఒక వైపుననే వ్రాసి ఉండాలి.
- 250 అరఠావు (ఫుల్ స్కేప్) పేజీలు మించి ఉండరాదు.
- కథా వస్తువు నేటి ఆంధ్రదేశం సాంఘిక జీవితానికి సంబంధించి ఉండాలి.
- రచనలు స్వంతమయినవిగా ఉండాలి. అనువాదాలు పంపకూడదు.
- పోటీలో తుది నిర్ణయం సంపాదకులదే. ఈ విషయంపైన ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు.
- రచనలు త్రిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజి జతపరచి పంపాలి.
- పోటీలో బహుమతి పొందని నవలలు యోగ్యములయితే విడిగా ప్రచురిస్తాము.
- బహుమతి నవలకు సంబంధించిన అన్ని హక్కులూ ఆంధ్ర సచిత్ర వారపత్రికకే చెంది ఉంటాయి.

*రచయితలు ఎప్పటివలె మాతో సహకరించి ఈ పోటీ జయప్రదం చేయగోరుతాము.*

*ఇంతకుముందు పోటీకి నవలలు పంపినవారందరికీ కృతజ్ఞులము.*

# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి

## రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!

ఎందుకంటే : ఒక్క సారి తోముకొంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మక్రిములను 85% వరకు తొలగించును**

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే అరికడుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతితో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమెన్నడూ తెలియచేయనంతటి శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది !

భోజనం నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమం తప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేపకమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన చిక్కి పోతున్న ఆహారపు కణములను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు ఇష్టపడతారు. ఎందుకంటే దాని పేస్టు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !




మీకు పౌడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా కొంటే వస్తుంది




కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.




[ప్రపంచమంతటా ప్రజలు రేడియో, టెలివిజన్‌ల ద్వారా ప్రసారం అవుతున్న వార్తలు చాలా కుతూహలంగా వింటున్నారు. మరి రెండు గంటలలో అంతరిక్ష నౌక "యు. ఎస్." అంగారక గ్రహ ప్రయాణంమీద బయలుదేరి వెళ్ళటానికి సిద్ధంగా ఉన్నది. మార్చి 16, 197.........సంవత్సరం : కాలం రాత్రి పది గంటలకు సరిగ్గా మూడు నిముషాలు తక్కువ.]

11—57, 12—00 గంటల మధ్య (ఇండియన్ స్టాండర్డ్ టైం) భూమి చుట్టూ తిరుగుతున్న 'అంతరిక్ష స్టేషన్‌నుంచి 'యు. ఎస్.' బయలుదేరుతుంది. పదకొండు గంటల ముప్పై నిముషాలనుంచి 'రన్నింగ్ కామెంటరీ' ప్రారంభమవుతుంది. అంతవరకు ఐక్యరాజ్య సమితి ద్వారా వివిధ దేశ నాయకులు, శాస్త్రజ్ఞులు చేసిన ఉపన్యాసాలు ప్రసారం అవుతున్నాయి. ఇవి అన్ని దేశాలలోనూ ఆ యా దేశాల భాషలలోకి తర్జుమా అవుతున్నాయి. ముందుగా సమితి కార్యదర్శి మాట్లాడారు. అందరికన్నా చివర ఐక్యరాజ్యసమితి అధ్యక్షులు అంతరిక్ష నావికులకు తమ సందేశం అందజేస్తారు. ఆపైన 'యు. ఎస్' నావికులు కొన్ని మాటలు చెప్తారు......

1957 లో మొదటి స్పుట్నిక్ రష్యా 'ప్రయోగించిన' తర్వాత అంతరిక్ష యానానికి సంబంధించిన పరిశోధన అతివేగంగా 'పురోగమించింది.' స్పుట్నిక్ 1 ప్రయోగించిన నాలుగు సంవత్సరాలలో రష్యా ప్రప్రథమంగా ఒక మానవుడిని అంతరిక్షంలోకి పంపింది. యూరీ గగారిన్ భూప్రదక్షిణం ఇప్పుడు చరిత్రాంశాలలో ఒకటి! మొదట 'అంతరిక్ష పరిశోధన' లో రష్యా అమెరికాలు పోటీ పడినా, క్రమంగా ఐక్యరాజ్యసమితి అధ్వర్యం క్రింద ఈ పరిశోధన 'అంతర్జాతీయం చేశారు. అన్ని దేశాలూ కలిసి కృషి చెయ్యటంతో అభివృద్ధి అతి వేగంగా జరిగింది.......

భూమి చుట్టూ పరిభ్రమించే 'ప్లాట్‌ఫారమ్‌'లు తయారుచేసి, కక్ష్యలలోకి పంపారు. మొత్తంమీద పది ప్లాట్‌ఫారంలు నిర్మించారు. ప్రస్తుతం నాలుగు మాత్రమే పని చేస్తున్నాయి. మూడవ ప్లాట్‌ఫారం మీదనుంచి ఒక చిన్న 'అంతరిక్ష నౌక' లో మొదటిసారిగా ఇద్దరు మానవులు చంద్రమండలం చేరుకున్నారు ; రష్యా అమెరికా దేశాల వారికే ఈ గొప్ప అవకాశం దొరికింది. వీ ఇద్దరూ సురక్షితంగా తిరిగి భూగోళం చేరుకున్నారు. వీరి పేర్లు చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతాయి....

అంగారక గ్రహం చేరే ప్రయత్నాలు ప్రారంభించారు. కొన్ని సంవత్సరాలకుగాని, సన్నాహాలు పూర్తి కాలేదు. ఇంతలో చంద్రమండలానికి ప్రతి సంవత్సరం ఒక యాత్ర జరిగేది! అక్కడ ఒక చిన్న 'మూన్ కాలనీ' కూడా ఉన్నది. ఈ కాలనీ జనాభా సంఖ్య పద్నాలుగు! 'అంతరిక్ష పరిశోధన'లో అతి తెలివైనవారు ఆ విచిత్రమైన వాతావరణంలో నిర్విరామంగా తమ కృషి చేస్తూ ఉన్నారు......

అంగారక గ్రహానికి వెళ్ళే నౌక పదవ 'ప్లాట్‌ఫారమ్‌' 'అంతరిక్షం స్టేషన్ 10' మీదనుంచి బయలుదేరాలని నిశ్చయించారు. ఈ 'స్టేషన్ 10' మానవుడు సృష్టించిన అద్భుతాలలో ఒకటి అని అనటం లోకసామాన్యం అయిపోయింది. ఇది నిజానికి ఒక చిన్న పట్టణం వంటిది. భూగోళంలో సముద్రాలమీద తేలివెళ్ళే మహా నౌకలలోఉండే సౌకర్యాలన్నిటితోబాటు శాస్త్ర పరిశోధనలకు కావలసిన పరికరాలూ, ఒక పెద్ద అంతరిక్ష నౌక నిర్మించేందుకు సాధనలూ కూడా ఉంటాయి. వేలమంది కార్మికులు, నిపుణులూ అక్కడే జీవిస్తూ ఉంటారు. భూగోళంమీదకు ప్రతివారం వచ్చి వెళ్ళే సదుపాయాలు ఏర్పరచారు.

అంతరిక్ష నౌక 'యు. ఎస్' కట్టడానికి నాలుగు సంవత్సరాలపైన పట్టింది. (పూర్తి అయిన తర్వాత ప్రపంచ నాయకులు చాలామంది వెళ్ళి చూసి వచ్చారు. అంతరిక్ష యానం 'క్రొత్త ఒక వింత' అయి, చాలా కాలం అయినా, 'ప్రాత ఒక రోత' మాత్రం కాలేదు!) అసంఖ్యాకులైన ప్రజలు అది ఎప్పుడు బయలుదేరుతుందా అని కాచుకుని కూర్చున్నారంటే అతిశయోక్తి లేదు.......

56-వ పేజీ చూడండి

# వ్యాసరచన పోటీ

# నేటి మన సినిమాలు

మొదటి బహుమతి - రు. 50

రెండవ బహుమతి - రు. 30

మూడవ బహుమతి - రు. 20

తెలుగునాట ఇంచుమించు అన్నివర్గాలవారికీ సినిమా 'వినోద, సాంస్కృతిక కాలక్షేపం'గా ఉన్నదంటే అతిశయోక్తికాదేమో! మద్రాసువంటి ఇతరరాష్ట్రాలలో సంగీత సాహిత్యాలను మనకన్నా ఎక్కువగా ప్రోత్సహిస్తూ ఉండటం కూడా మనం గమనిస్తున్నాము.

'సాంస్కృతిక జీవితం'లో ఇంత ప్రాధాన్యం వహిస్తున్న సినిమాలు ప్రజల, ముఖ్యంగా బాలబాలికల, యువజనుల, భావనాగతులపై ప్రభావం చూపిస్తున్నవనటం సత్యదూరంకాదు.

గతంలో మనచిత్రాలు ఇప్పటి వాటికన్నా సంఘసంస్కరణాభిలాషను కలిగించాలని ప్రయత్నించేవనిపిస్తుంది. వితంతు వివాహాలు, కులతత్వ నిర్మూలన మొదలైన సంస్కరణలు ఆధారంగా కథావస్తువులు రూపొందేవి. ఇప్పటి చిత్రాలు సాంకేతికంగా వాటినిమించి ఉన్నత స్థాయిని అందుకున్నాయి. కాని విభిన్నపంథాలలో తయారవుతున్నాయి.

ఈ వైఖరిపైన పాఠకుల అభిప్రాయాలు తెలుసుకునే ఉద్దేశంతో ఈ పోటీ నడుపుతున్నాము. అంతేకాక వారు చేయదలచిన సూచనలు తెలుస్తాయనే ఉద్దేశం కూడా లేకపోలేదు.

తమ అభిప్రాయాలు, సూచనలు వ్యాసరూపంలో పొందుపరుస్తూ 12-2-1962 లోపుగా మా కార్యాలయంకు అందజేయవలసిందిగా పోటీలో పాల్గొనేవారిని కోరుతున్నాము.

● వ్యాసాలు 5 అరఠావు పేజీలు మించి ఉండరాదు. ● కాగితం ఒక వైపునే వ్రాయాలి. ● కవరు పైన 'నేటి మన సినిమాలు' అని స్పష్టంగా వ్రాసిఉండాలి. ● తుది నిర్ణయం సంపాదకునిదే. దానిపైన ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు. ● త్రిప్పి పంపగోరువారు తగిన తపాలా బిళ్లలు జతపర్చి పంపాలి.



దేవదాసు' చిత్రం ఆరుసార్లు చూశాను. సావిత్రి ఫాన్‌నైపోయాను. పార్వతి పాత్రలో ఆమె ఎంత అందంగా ఉంది! ఎంత గొప్పగా నటించింది! చిన్న వయసులో ఆమె ఆ పాత్రకు ఎంత గొప్పగా జీవం పోసింది! శరత్ పార్వతే సావిత్రి అని అనిపించగలి గింది. అందచందాలతోబాటు ఆమె గంభీర నటనకు నేను ముగ్ధురాలినైపోయాను. ఆమెను కలుసుకోవాలనే ఉబలాటం నాలో పెరుగుతూండేది. అప్పుడు నేను మదరాసు స్కూల్లోనే చదువుతున్నా. ఐతేనేం సావిత్రిని స్వయంగా చూడడానికి వీలు కలుగలేదు.

ఆ తరువాత నా చదువు గుంటూరు ఏ. సి. కాలేజీకి మారింది. ఇంటర్ ఫస్టు ఇయర్ చదువుతున్నా. కాలేజీలో నాటకాలు ఉత్సవాలు వచ్చాయంటే నా ఆనందానికి హద్దులుండేవికావు. ఆ ఏడాది "స్వప్న వాసవదత్త"లో పాల్గొనబోతున్నాను. అంతేకాకుండా ఒక నృత్యం కూడా చేయమన్నారు నన్ను. వెంటనే నేను 'వదిన' చిత్రంలో సావిత్రి చేసిన నృత్యాన్ని ప్రదర్శిస్తానన్నాను.

మేకప్‌రూమ్‌లో మా స్నేహితులంతా స్వంతంగా మేకప్ చేసుకుంటున్నాము. నాటకాల కార్యక్రమం ప్రారంభించేవేళ దగ్గిర పడుతున్నకొద్దీ మాలో ఉత్సాహం పెరిగిపోతోంది. ఆ సమయంలో మంచి వార్త ఒకటి అందింది. మా కాలేజీకి ఫిలిం స్టార్స్ వస్తున్నారనే వార్త. ఓ! మేమంతా ఎగిరిగంతు లేశాం. సినిమా తారలను తెరపై రూపాల్లో కాకుండా అసలు స్వరూపాల్ని చూడగలిగే అవకాశం దొరికిం దని, మా నాటక ప్రదర్శనల్ని వారు చూస్తారని ఎంతో సంబరపడిపోతున్నాం.

కాలేజీలో మా ఉత్సవాలు జరిగే రోజునే "సంతానం" చిత్రం శత దినోత్సవం గుంటూరు థియేటర్‌లో జరిగింది. అందేత తారలంతా గుంటూరు వచ్చారు. వారిని మా కాలేజీకి రమ్మని అధికారులు ఆహ్వానించారట.

తారలు మా కాలేజీకి వచ్చేసరికి నేనింకా మేకప్ రూమ్‌లోనే ఉన్నా. అ[illegible]కు వచ్చారు తారలు. ఎవరా తారలు? నాకు [illegible]న తారలే! ఇంక నా సంతోషాన్ని మాటల[illegible]. వారిని మాకు పరిచ[illegible]చూసి, ప్రతి నమస్కా[illegible] విద్యార్థినుల మంతా ఎవరికివా[illegible] నమస్కారం అందించారం[illegible]. [illegible] నవ్వారంటే నన్ను చూసి [illegible]రని. ఇప్పటికీ [illegible] నాగేశ్వర రావుల నవ్వుముఖాలు తలచుకున్నపుడల్లా [illegible]లో అవి ప్రతిబింబిస్తూనే ఉన్నవి.

ఈ ఆనందావేశాల్లో నేను స్టేజిమీద నటనను నాట్యాన్ని సంతృప్తికరంగా ప్రదర్శించాను. అధికారులు నాకు ప్రథమ బహుమతి అందించారు.

ఇంటర్మీడియేట్ గుంటూరులో ఉత్తీర్ణురాలనైన పిదప బి. ఏ. మదరాసులో చదవాలని తిరిగి ఇక్కడకువచ్చి, ఎతిరాజ్ కాలేజీలో చేరాను. ఆ కాలేజీ లోని నా సహాధ్యాయినులందరూ నాగేశ్వరరావుగారిని స్వయంగా చూడాలనుకున్నారు. సరే మేమంతా ఒకరోజు బయల్దేరి వాహిని స్టూడియోకి వెళ్లాం కిలకిలమంటూ.

ఆరోజు నాగేశ్వరరావు మహాదేవి పిక్చర్స్ చిత్రం షూటింగ్‌లో పాల్గొంటున్నారు. సెట్‌మీదకు మేం వెళ్ళగానే అక్కడ ఆయనతో కలిసి నటిస్తున్న సావిత్రికి మమ్మల్ని ఆయన పరిచయం చేశారు. బి. ఏ. చదువుతున్నాననీ, సినిమాల్లో ప్రవేశించాలను కుంటున్నాననీ సావిత్రికి నా గురించి నాగేశ్వరరావు గారే చెప్పి పరిచయం చేశారు.

ఆక్షణం ఎటువంటిదోకాని, సావిత్రిని మరు క్షణంనుంచి అక్కయ్యా అని పిలవాలనే అభిమానం నాలో పొంగింది. కాని పిలవడానికి తగిన చనువు అప్పటికి కలగలేదు. నేను సినిమాల్లో ప్రవేశిస్తున్నందుకు ఆమె ఆనందించింది. ఉత్సాహపూరితంగా ప్రసంగించింది. ఆ సెట్‌పై మేమంతా చాలాసేపు ఉండి, నటీ నటులు తెలా పాత్రలకు రూపం కల్పిస్తారో గ్రహించాము.

45-వ పేజీ చూడండి

పదేళ్లలో నూరు[illegible]లో నటించటం [illegible] సావి[illegible]రాది క్రితమే చిత్ర[illegible]చి తారా పథాన్ని అ[illegible] వాసంతి బి. ఏ. చె[illegible]ప్పిన సవి[illegible]ల వివరణలో ఈ శీర్షిక ప్రారంభిస్తున్నాము.



భూమిలోవున్న ఖనిజాన్ని వెలికితీసి, కరిగించి, పోత పోసిన ఇనుప పట్టాలమీద ఆ రైలు నడుస్తోంది. మూగగా చిన్నగా పట్టాలమీద నడిచి పోవడమే దాని పని. హోరని కురుస్తున్న వర్షంలోనైనా, నిప్పులు కురిపించే వేసవి గాడ్పుల్లోనైనా, ఆగకుండా పరిగెత్తుతుంది, పట్టాలు సరిగా వున్నంతవరకూ. కన్ను పొడుచుకున్నా కనిపించని చిక్కని చీకటిలోకి దయ్యాలు రాజ్యంచేసే ప్రదేశాల్లోకి ఘోర మృగాలు తిరిగే అడవుల్లోకి నిర్భయంగా, ఒంటిగా ప్రయాణం చేస్తుంది. దాని వేగమే దాని రక్షణ.

అనేక రకాల మనుష్యుల్ని మోసుకుపోతుంది. వారి హృదయాల్లో వున్న దిగుళ్ల బరువు గానివేమీ బాధించదు. వారి మనస్సుల్లోవున్న వేదనతో దానికి సంబంధంలేదు. వారి హెచ్చు తగ్గుల హోదాల పని పట్టించుకోదు. ఎవరు కోరిన గమ్యస్థానానికి వారిని తీసుకెళ్ళుతుంది. తన గమ్యస్థానానికి తను చేరుకుంటుంది. దాని వలా వుండాలని మానవుడు కోరేడు! అతని శాసనాని కది తలవంచింది.

ఆ రైలు మద్రాసునుంచి బయల్దేరింది. అక్కడ చాలామంది ఎక్కారు. అందులో ఒక నడివయస్సు వ్యక్తి కూడా వున్నాడు. ఆయన పొడుగ్గా, ఎర్రగా వుంటాడు. మనిషి చాలా గొప్ప కుటుంబీకుడిలా కన్పించజేసే కళ ఏదో ఆయన మొహంలో వుంది. కాని అతని చేతిలోవున్న సంచీ, అతను ధరించిన పంచే, లాల్చీ, అతను ఎక్కిన థర్డుక్లాసు కంపార్టుమెంటూ, అతని సాధారణ స్థితిని చాటుతున్నాయి. ఆయన కళ్ళు చాలా అందమైనవేగాని, వాటిలో ఏదో బాధ కన్పిస్తుంది. రైలు మద్రాసు వదలిన రెండు మూడు గంటలదాకా, ఆయన దృష్టి ఎక్కడో వుంది.

సాయంకాలం ఆరు గంటలకి పెట్టెలో ఎక్కి కూర్చున్న ఆయువకు రాత్రి ఎనిమిది దాటేవరకూ తన చుట్టూవున్న పరిసరాలమీద శ్రద్ధ లేకపోయింది. ఆ సమయంలో రైలు ఒక స్టేషనులో ఆగడం, కొత్త మనుషులు లోపలికి వస్తూంటే లోపలివారు వద్దనడం, కొత్తవారు తోసుకురావడం, లోపలివారు వారితో దెబ్బలాడడం, చివరికి రైలు కదలేలోపున కొత్తవారు లోపలికి రావడం గడబిడతో ఆయన తన దృష్టి కొత్త ప్రయాణీకులవైపూ, పాత వారివైపూ పోనిచ్చారు. కొత్త ప్రయాణీకులు కాస్సేపు నిల్చొని, తరువాత మెల్లిగా జాగా చేసుకు కూర్చొని, పాతవారై పోయారు. తరువాతి స్టేషనులో వీళ్లే, మళ్ళీ కొత్తవాళ్ళని రానీకుండా వుండాలని చూశారు.

ఆ కొత్త పాతల సంఘర్షణ అలాగ జరుగుతూనే వుంది. రైల్లో అనేక రకాల మనుష్యులు ఎక్కుతూ వుంటారు. అది ప్రతి వ్యక్తికీ నూతన వాతావరణం. అతనెవరో ఎవరికీ తెలియదు. తక్కువ హోదా గలవాళ్ళు ఎక్కువ స్థితివరులులా నటించవచ్చు. నిజంగా గొప్పవాళ్ళు చాలా సామాన్యుల్లా కన్పించవచ్చు. ఒక వయసు మళ్ళిన స్త్రీ ఎక్కడా జాగా లేక నుల్చుంది. నలుగురు యువకులు చాలా దర్జాగా కూచొని సిగరెట్లు త్రాగుతున్నారు. ఆమె వారిని కొంచెం జరిగి జాగా ఇమ్మంది. వాళ్ళు మొదట వినిపించుకోలేదు. తరువాత, "ఎక్కడ కూచుంటా వమ్మా. మాకే జాగాలేదు" అని విసుక్కున్నారు. గాని ఆమెకు జాగా ఇవ్వలేదు. పైగా ఇంజనులో ఆమె ఆడవాళ్ల కంపార్టుమెంటు ఎక్కుతుండవలసిన దనీ, ఇలాటి వాళ్ళంతా ప్రయాణాలు చెయ్యడం అనవసరమనీ అనుకున్నారు.

ఒకరి కష్టసుఖాలు వారికేం తెలుస్తాయి? ఆమె ఏ అత్యవసరపనిమీద వెళ్తోందో వాళ్ళకేం తెలుసు? వాళ్ల ఉద్దేశంలో ఆమె, ముందూ వెనకా ఆలోచించకుండా తమంతవారిని స్థలం అడగడమే తప్పు. వాళ్ళు ఆమెను మర్యాదా తెలియని మనిషి అన్నట్లు చూశారు.

ఇంతలో ప్రక్క బెంచిమీదవున్న ఒకాయన, "అమ్మా, ఇలారండి" అని పిలిచి జాగాచేసి కూర్చో పెట్టాడు. ఆమెను ఏ వూరు వెళ్తున్నదీ అడిగాడు. ఆమె బెజవాడ వెళ్తున్నానంది. తన కూతురికి జబ్బు చేసిందని తెలిసి, అల్లుడింటికి వెళ్తోంది. అల్లుడు బెజవాడలో వున్నాడు. అతను బెజవాడవచ్చి ఆరు నెల లయిందిట. గాంధినగరంలో ఇల్లుట. ఆమెకు బెజవాడ తెలియదు.

ఆవిడకు జాగా ఇచ్చినాయన, "ఫరవాలేదమ్మా. వీరు నలుగురూ బెజవాడలో దిగుతారు. మీ కొక రిక్షా మాట్లాడి పెట్టమని చెప్తాను" అని ఆ యువకులతో ఆమెకు బెజవాడలో రిక్షా మాటాడి పెట్టమని చెప్పాడు. వాళ్ళు కొంచెం చేలాకోళంగా ఒకరి నొకరు చూసుకొన్నారు.




"ఎక్కడ అమె అల్లుడుగారిల్లు?" అని ఒక యువకుడు అడిగాడు.

"గాంధీనగరంలోట" అన్నా డాయన.

"ఏం చేస్తా డాయన?"

దానికి ఆమె జవాబిచ్చింది. "మా అల్లుడు ఎలక్ట్రికల్ ఇంజనీరు. పేరు సుందరరావు" అంది. అది వినగానే ఆ యువకులు నలుగురూ తెల్లబోయారు. అంతవరకూలేని మర్యాదను చూపిస్తూ, 'అలాగా! ఫరవాలేదమ్మా. మేము ఆయనవద్ద "లైన్ మెన్"గా పని చేస్తున్నాం. తప్పకుండా వారింటికి తీసికెళ్ళి దిగబెడ్తాము" అని, అక్కణ్ణుంచి బెజవాడదాకా ఆమెకు సకలోపచారాలు చెయ్యసాగారు.

ఇలాటి సంఘటనలు కొన్ని జరుగుతూంటాయి. మద్రాసులో ఎక్కినాయన ఇదంతా చూస్తున్నాడు. ఆయన కెదురుగావున్న బెంచీమీద ఎప్పుడెక్కారో ఒక ఒక చక్కని పదహారేళ్ళ యువతీ, పాతికేళ్ళ యువకుడూ కూర్చొని మాట్లాడుకుంటున్నారు. వారికి పెళ్ళయినట్లు లేదుగాని, ఇద్దరూ పరస్పరం అతిగా ప్రేమించుకుంటున్న దంపతుల్లా మాటలూ, చేష్టలూ జరుపుతున్నారు.

కాస్సేపు గట్టిగా మాట్లాడుకుంటున్నారు. కాస్సేపు మెల్లిగా మాట్లాడుకుంటున్నారు. ఎవరెవరి గురించో తెగ చెప్పుకుని నవ్వుకుంటున్నారు. అవసరమున్నా లేకపోయినా ఒకరి నొకరు తాకుతున్నారు. వాళ్ళ ఆనందం, వాళ్ళ సంభాషణలోవున్న ఉత్సాహం వాళ్ళ ముఖాలలోవున్న కాంతీ చూస్తూ, ఆయన "ప్రేమ అనేది ఇలా వుంటుందికదా!" అనుకున్నాడు.

కిటికీలోంచి బయటకు చూశాడు. ఆకాశంలో నక్షత్రాలూ దూరంగావున్న కొండలూ, పొలాలూ అన్నీ మెల్లిగా వెనక్కిపోతున్నాయి. దూరంగా వెన్నెల్లో కన్పిస్తున్న ప్రకృతి ప్రశాంతంగా వుంది. రైల్లో కూడా ఇందాకటి హడావుడిలేదు. ఎదురుగావున్న ప్రేమికులు తప్ప, తక్కినవారంతా వెనకాలకి జారబడి కునుకులు తీస్తున్నారు.

నిద్రపోతున్నవాళ్ళలో ముసలివా ళ్ళున్నారు. తల్లి ఒడిలో పడుకుని, స్తన్యాన్ని నోట్లోపెట్టుకొని చప్పరిస్తూ, నిద్రపోతూ, మళ్ళీ అప్పు డప్పుడు చప్పరిస్తూన్న చంటిపిల్ల లున్నారు. వాళ్ళ నలా ఒడిలో వుంచుకొనే నిద్రపోతున్న మాతృమూర్తు లున్నారు. నిద్రలో అప్పుడప్పుడు కళ్ళు తెరిచి, ఒకసారి ఆ అందమైన యువతివైపుచూసి, ఆమెతో మాట్లాడే యువకుణ్ణి ఈర్ష్యగా చూసి, మళ్ళీ నిద్రపోయే యువకు లున్నారు.

అందర్నీ అజ్ఞానంలా ఆవరిస్తుంది నిద్ర. ఈ జీవితమేమిటి? దీని అర్థమేమిటి? గమ్యమేమిటి? రోజు రోజుకూ మృత్యువు దగ్గరకు వస్తోందే. ఈ వ్యామోహం మన కెందుకు? అని ఆలోచించరు. పెళ్ళాం గురించీ, కొడుకుల గురించీ, డబ్బు చాలక పోవడం గురించీ ఆలోచిస్తారు పగలంతా. రాత్రయ్యేటప్పటికి నిద్రిస్తారు. రైళ్ళలోనూ నిద్రే, బస్సులలోనూ నిద్రే. ఇంటి దగ్గరా నిద్రే. కిటికీలోంచి క్షణక్షణానికి మారే ప్రకృతి దృశ్యాలని ఎవరూ చూడరు. జీవితం గురించి ఆలోచించరు.

నిద్రపోయేవాళ్ళందర్నీ చూస్తుంటే, ఆయనకు కూడా నిద్ర వచ్చింది. ఆయన తనలో తను నవ్వుకున్నాడు. శరీరంయొక్క అవసరాలు ఎటువంటివైనాసరే అణగద్రొక్కలేవు. తీరతాయి. అయినా ఈ శరీరంయొక్క స్వభావమే విచిత్రమైనది. అది సుఖించడానికి తగిన అవకాశాలున్నప్పుడు సుఖాన్ని కోరదు. ఆ అవకాశం లేనప్పుడు మరీ కోరుతుంది. మెత్తటి పరుపులూ, పందిరిపట్టెమంచాలూ, ఫ్యాన్లూ వున్న భవనాల్లో నిద్ర పట్టక ఎంతోమంది బాధపడతారు. కఠినంగావున్న రైలు బెంచీమీద వళ్ళు ఒరుసుకుపోతున్నా, హాయిగా నిద్ర వస్తోంది కొందరికి.

ఆయన చిన్న కునుకు తీసి మేల్కొనేసరికి బెజవాడ వచ్చేసింది. బెజవాడలో ఆ కంపార్టుమెంటులో చాలామంది దిగారు. మళ్ళీ కొత్తవాళ్ళెక్కారు. ఆయన కాఫీ, టిఫిన్ తీసుకోడానికి బయల్దేరి వెళ్ళాడు. ఎందుకంటే తెల్లవారింది.

మళ్ళీ ఆయన తిరిగి వచ్చి కంపార్టుమెంటులోకి ఎక్కి కూచున్న వెంటనే రైలు కదిలింది. కొంతమంది ప్రయాణీకులు గట్టిగా రాజకీయాలు చర్చిస్తున్నారు. ఒకాయన తన రాజకీయ అనుభవాల్ని ఇతరులకు చెప్తున్నాడు. ఒక పోలీసు అధికారి కూడా ఆ కంపార్టుమెంటులో వున్నాడు. కొందరు పోలీసు డిపార్టుమెంటుమీద కొన్ని విమర్శలు చేశారు. ఆయన కాస్సేపు అవి విని, "ఇప్పుడు ప్రభుత్వమంతా మీ చేతుల్లో వుంది కదా! పరిపాలనంతా మీదే. మీరు చెప్పినట్టే మేం చేస్తున్నాం" అన్నాడు. అది విని కొందరు అవునవునన్నారు.

కొంత సేపయింతరువాత మన్నెపుం ధరవరం మీద చర్చ జరిగింది. ప్రతి వ్యక్తీ కాలాన్ని విమర్శిస్తున్నాడు. అన్ని విషయాలమీదా తన అసంతృప్తి వెల్లడిస్తున్నారు. ఈ కాలపు చదువులు బాగులేవు. పెళ్ళిళ్లు బాగులేవు. ఆఫీసులు బాగులేవు. వెనకటి తెల్లవాడి పరిపాలనలోనే చాలా మేలన్నా డొకాయన. సామాన్యుడి అభిప్రాయాలు వినాలంటే రైలు బండిలో థర్డు క్లాసు ప్రయాణమే చెయ్యాలి. ఎందుకంటే సామాన్యుడికి సభావేదిక ఎక్కి తన అభిప్రాయాల్ని చెప్పగల అవకాశమూ, వాకచక్యమూ రెండూ వుండవు. అందువల్ల అతని అభిప్రాయాలూ అందరికీ తెలియవు. రైలు ప్రయాణంలో, ఉబుసు పోకకి సంభాషణ ప్రారంభించి, తన మనస్సులోని భావాలు వెలికి గ్రక్కుతాడు సామాన్యుడు.

జనం ఎక్కుతూనే వున్నారు. దిగుతూనే వున్నారు. నిముష నిముషానికీ ప్రకృతి తన రంగుల్ని మార్చుకొంటూ, కొత్త కొత్త ముస్తాబులు చేసుకుంటోంది. రైలు తన క్రమం తప్పకుండా ముందుకు పోతోంది. వదుల్ని, పొలాల్ని, కొండల్ని దాటుకుంటూ పోతోంది.

సాయంకాలపు చీకటులు చుట్టూ అవరించాయి. రైలు లోపల లైట్లు వెలిగాయి. అప్పటికి తను ఆ రైల్లో ఎక్కి ఒకరోజు గడిచిందనుకున్నాడు మద్రాసులో ఎక్కినాయన.

రాత్రి పదిగంటలప్పుడు ఒక చిన్న స్టేషనులో రైలాగింది. అది చాలా చిన్న పల్లెటూరనీ, రెండు మూడు మిల్లులువుండి ధాన్యం వేరుసెనగ వ్యాపారం చేస్తాయనీ తెలుసుకొని, అక్కడ దిగడానికి సంకల్పించాడు మద్రాసులో ఎక్కినాయన.

ఆ వూరిపేరు రామవరం. ఆ స్టేషనులో ఆయనొక్కడే దిగాడు. స్టేషను చిన్నది. ఒక లైటు వెలుగుతోంది. చుట్టూ చీకటి. రైలు వెళ్ళిపోయేదాకా ఆగి, రైలు వెళ్లాక స్టేషను దాటి వూళ్లోకి బయల్దేరాడు. ఆ వూళ్లో చిన్న హొటలుందిగాని, అది తొమ్మిది లోపలే కట్టేస్తారు. స్టేషను దగ్గర ఒక కిళ్లీకొట్టుంది. అది కూడా బండి వెళ్ళిపోగానే మూసేసే ప్రయత్నంలో వుంది.

ఆ కిళ్ళీకొట్టులో ఒక సోడా తాగి, రెండు అరటి పళ్లు కొనుక్కు తిన్నాడు, ఆ ప్రయాణీకుడు. రాత్రి ఎక్కడ గడుపుదామా? అని ఆలోచిస్తుంటే, ఎదురుగా ఒక డాబా కన్పించింది. అందులో వరుసగా నాలుగు కొట్లు కన్పించాయి. పొడుగాటి వరండా వుంది. ఆ వరండామీద ఒక రిద్దరు నిద్ర పోతున్నారు.

ఆ కొట్లలో ఒక కొట్టువద్ద ఒక బోర్డు తగిలించివుంది. నల్లని ఆ బోర్డుమీద 'కన్ను' యొక్క బొమ్మను తెల్లరంగుతో వేయబడి 'కళ్ళుబాగు చేయబడును' అన్న అక్షరాలతో సహా చీకట్లో కూడా స్పష్టంగా కన్పిస్తోంది. ఎవరిదో కంటి డాక్టరుగారి బోర్డు అయివుంటుందనుకొని, ఆ ప్రయాణీకుడు ఆ వరండామీద నడుం వాల్చాడు. ఆ గచ్చుమీద ఆయనకు చక్కని నిద్ర పట్టింది.

## 2

సూర్యోదయమై ఒక గంటకాలం గడిచినా, లోకం రాధానాథమిశ్రగారికి తెలిసి రాలేదు. ఆయన

# ఏడు కొండలు

ఆలస్యంగా నిద్ర లేవడానికి కారణం సాధారణంగా కేసులు వత్తిడేనని చెప్తూంటారు. అర్ధరాత్రీ, అపరాత్రీ అనకుండా చుట్టుప్రక్కల గ్రామాల నుంచి రోగులు తాలూకు మనుష్యులు పరిగెత్తుకొచ్చి, "డాక్టరు బాబూ, మీ రెలాగయినా వచ్చి మా వాళ్ళ ప్రాణం రక్షించాలి" అని కాళ్లమీద పడుతూంటే ఆయన మట్టుకు ఏంజేస్తాడు? ఆ కేసులు చూసి తెల్లవారుజామున ఏమూండిటికో నాలుగింటికో ఇంటికివచ్చి పడుకుంటారు మిశ్రగారు. 'అటువంటప్పుడు తెల్లవారిన తరువాత ఆలస్యంగా మెలకువ రాక, తొందరగా వస్తుందా? అని ఆయన తన కోసం ప్రొద్దున్నవచ్చే రోగులతో చెప్తూంటారు.

మిశ్రగారి ప్రాక్టీసు చాలా గొప్పదనీ, ఆ చుట్టూ పక్కల గ్రామాల వాళ్లంతా ఆయన దగ్గరకే వస్తూంటారనీ, ఆ రోగులు అనుకుంటారు. కాని, మిశ్రగారి పనిమనిషి నారాయణి మాత్రం అలా అనుకోదు.

---

సుప్రసిద్ధ ఫ్రెంచి తత్వశాస్త్రజ్ఞుడు వోల్టెయిర్‌ని ఆయనకు ఇష్టంలేనివ్యక్తి చనిపోయినప్పుడు రెండు ముక్కలు చెప్పమన్నారు.

"వీరు గొప్ప దేశభక్తులు, ప్రతిభగల రచయిత, నమ్మదగిన మిత్రుడు, ఏకపత్నీవ్రతుడు-నిజంగా చచ్చినట్లయితే" అన్నాడు వోల్టెయిర్.

---

"రాత్రంతా పడుకొన్నది చాలదంటయ్యా! లే. లే. బారెడు పొద్దెక్కినా ఇంకా పడకేనా?" అని, ఇల్లూడుస్తున్న నారాయణి మిశ్రగారిని లేపసాగింది.

నారాయణికి ముప్పై యేళ్ళుంటాయి. నల్లగా మెద్దులాగ వుంటుంది. డాక్టరుగారివద్ద ఏడాది నుంచి పని చేస్తోంది. దాని అసలుపేరు నారాయణ. కాని డాక్టరుగారు 'నారాయణి' అని పిలుస్తారు.

మిశ్రగారు అంత తొందరగా లేచే ఘటంకాదు. మొహంమీదనుంచి కప్పుకున్న దుప్పటైనా తియ్యకుండా, "ఆహాహా! భలే కల వస్తోందే నారాయణీ మంచి కల. నీకూ నాకూ పెళ్లవుతోందిట. బాజాలు వాగుతున్నాయి. బ్రాహ్మడు మంత్రాలు చదువుతున్నాడు. భలే! భలే! నువ్వు మంచి పట్టుచీర కట్టుకున్నావట....." అని వర్ణించసాగాడు.

"ఏం డాక్టరు బాబూ, మందు మహత్యం ఇంకా తగ్గలేదా?" అని అడిగింది నారాయణి.

"ఛీ ఛా! నేను మందు తాగానని ఎవడన్నాడు? నీ కుంత అన్నాడూ? 'అంట'" అని డాక్టరుగారు దుప్పటిలోంచే అడిగారు.

"పొద్దున్నే నిద్ర మంచంమీద పెళ్లి గిళ్లీ అంటున్నారు. అందుకని అడిగాను. తొందరగా లేస్తే కాస్త మీ ఆరోగ్యం బాగుంటుంది."

డాక్టరుగారు కోపంగా, "ఏం? ఇప్పుడు నా ఆరోగ్యానికేమిటొచ్చింది? నే నింకా కాస్సేపు పడుకుంటాను. అసలు నే నివాళంతా పడుకోదల్చుకున్నాను. రాత్రంతా ఒక సీరియస్ కేసు చూస్తూ మెలుకువతో వున్నాను. కావలిస్తే వాళ్లని కనుక్కో. కాస్సేపట్లో వస్తారు" అన్నారు.

"అయితే సరే. నే పోతున్నా బాబూ. మళ్లీ సాయంకాలం నువ్వు నిద్రలేచే సమయానికి వస్తాను" అని చీపురుకట్ట మూలబెట్టి వెళ్ళిపోబోయింది నారాయణి.

"అరెరెరె! పగలంతా పడుకుంటానని ఎవరన్నారు? మాట, మాట. నారాయణీ" అని తన దుప్పటి తీసి మంచంమీద లేచి కూర్చున్నారు. ఎదురుగా నుంచొన్న నారాయణిని చూస్తూ. "కొంచెం టీ పెట్టు. నే నిప్పుడే మొహం కడుక్కుని వస్తాను" అని చెప్పి, మంచంమీదనుంచి లేచారు. డాక్టరుగారికి మహావుంటే ముప్పై అయిదేళ్ళుంటాయి. కానీ, చిన్న వయస్సులోనే ఆయన తల సహం నెరిసింది. సన్నగా, పొట్టిగా, నల్లగా వుంటా రాయన. సాధారణంగా గళ్ళలుంగీ, లాల్చీ వేసుకుంటారు. ఆయన పలుదోము పుల్ల తీసుకొని మొహం కడుక్కోడానికి వెళ్ళారు.

మిశ్రగారిది అసలు ఉత్తరప్రదేశ్ రాష్ట్రం. కాని మూడు తరాలనుంచీ వారి కుటుంబం ఆంధ్రదేశంలో స్థిరపడిపోయింది. పెళ్లిళ్ళూ, పేరంటాలు జరపవలసి వచ్చినప్పుడు వారి స్వంత వూరు వెళ్తూంటారు. రామవరానికి కొద్ది దూరంలోవున్న నాయుడుపేట అన్న గ్రామంలో మిశ్రగారి తండ్రి ఒక ఇల్లూ, పదెకరాల పొలమూ సంపాదించారు. వారికి కులవృత్తి యునానీవైద్యం. కళ్ళు బాగు చెయ్యటంలో వారికి చాలా నేర్పు వుంది. పట్నాలకు పోయి పెద్ద పెద్ద డాక్టర్లకు చూపించుకోడానికి తాహతులేని పల్లెటూరి ప్రజలంతా వీరి దగ్గరకు వస్తూంటారు.

తండ్రి గణించిన ఆస్తినంతా చెల్లెళ్లిద్దరికీ, వారి రాష్ట్రంలో పెళ్ళి చెయ్యడానికి ఖర్చైపోయి, రాధానాథమిశ్రగారి కేమి మిగలలేదు. ఆయన ఒక్కడే కొడుకు. తల్లీ, తండ్రి చనిపోయాక రామవరం వచ్చి ప్రాక్టీసు పెట్టాడు. ఆయనకు రాబడి బాగానే వస్తుందికాని, ఖర్చు కూడా అలాగే చేస్తాడు. చెల్లెళ్లకు అప్పుడప్పుడు కొంత పంపిస్తూంటాడు.

నారాయణ బాగా బ్రతికి చెడిన మనిషి. కొంచెం చదువు కూడా వచ్చు. మొదట ఆమె కొక ముసలివాడి కిచ్చి పెళ్లి చేసారు. ఆ పెళ్ళి ఆమెకు ఇష్టం లేదు. అయినా, అన్నల బలవంతంమీద కాపురం చేస్తూండేది. ఇంతలో ఒక యువకుడు ఆమెను రామనగరం లేవదీసుకుపోయాడు. కొద్దినెలలు ఆమెతో కాపురంచేసి, వాడెక్కడికో పరారయ్యాడు. మళ్ళీ పుట్టింటికి వెళ్ళడం ఇష్టంలేక, కలిగినవారిళ్లలో చాకిరీ చేస్తూ, పొట్ట పోషించుకోవడానికి నిశ్చయించింది. మిశ్రగారివద్ద పనిచేస్తోంది.

మిశ్రగారు మొహం కడుక్కుని వచ్చేసరికి, ఆయన గదిలో కుర్చీమీద ఒక కొత్త వ్యక్తి కూచొని వుండడం

చూశారు. తనకోసం వచ్చే రోగులలో ఒకరై వుంటా డని అనుకొని, ఆ వ్యక్తితో సంభాషణ ఆరంభించారు.

"మనదేవూరయ్యా?" అని అడిగారు మిశ్రగారు.

"మాది దూరదేశం. నేను చిన్న సహాయం కోసం వచ్చాను మీ దగ్గరకు" అన్నాడా వ్యక్తి.

"చెప్పండి బాబూ. ఎలాటికేసయినా కుదురు స్తాను. నా పేరు ఈ చుట్టుపట్ల ఏభై మైళ్ళ లోపున వున్న గ్రామాలలో అందరికీ తెలుసు. రాత్ర నకా పగలనకా జనం వస్తూనే వుంటారు. ఒకొక్క ప్పుడు తీరుబాటు లేక కొన్ని కేసులు వదిలిపెడ్తూం టాను. ప్రక్కవూళ్ళో మావాడే ఒక డున్నాడు లావ్‌ుజీ అని, వాడి దగ్గరకు పంపిస్తూంటాను. ఏదీ మీ కన్ను చూపించండి?" అని దగ్గరకు రమ్మని ఆయనకు సైగ జేశారు.

"నా కళ్ళలో ఏమీ లోపం లేదు."

"ఓ! వంట్లో జబ్బా! ఫరవాలేదు. ఎలాటి వ్యాధైనా మన పేరు చెప్తే హడల్. శరీరంలో ఎంత జీర్ణించిన వ్యాధులైనా సరే. అయితే మీరు వున్న విషయం వున్నట్టు చెప్పాలి. వైద్యుడి దగ్గర దాస్తే లాభంలేదు. "వైద్యో నారాయణో హరిః" అన్నారు. మీరేం సిగ్గు పడక్కరలేదు. మానవుడన్న తరువాత ఎటువంటి పొరపాటైనా వస్తుంది. ఏదో కొద్ది క్షణాల సుఖానికి కకూర్తిపడి కొందరు భయంకర వ్యాధుల్ని తగిలించుకొంటారు. అయినా ఇబ్బంది లేదు. మన వైద్యంలో అటువంటి రోగాలన్నీ పరార్."

"అబ్బే! అటువంటి దేమీకాదు."

"అయితే మరీ మంచిది. నీరసానికీ, నిద్రలేక పోవడానికీ, బాంబుల్లా పని చేసే మందులున్నాయి. రక్తపుష్టి, గుండె బలం, కండబలం, జీర్ణశక్తి, జ్ఞాపకశక్తి అన్నీ కలిగించే మందు నేను స్వయంగా తయారు చేసింది వుంది. ఖరీదు కూడా ఎక్కువ లేదు. ఆ ఔషధాన్ని సేవిస్తే మరి జన్మలో నీరస మన్నది రాదు. ఒకే ఒక మోతాదుతో మీకు మంచి గుణం కన్పిస్తుంది. లేకపోతే డబ్బు వాపస్."

"నేను వచ్చిన పని, మిమ్మల్ని చిన్న సహాయం కోరదామని. నేను నిన్న రాత్రి బండిలో ఈ వూళ్ళో దిగాను. నా కీ వూరు కొత్త. ఏదైనా పని సంపాదించు కొందామని వచ్చాను. మీ కెవరైనా తెలిసినవారుంటే నాకు చిన్న పని దొరికే మార్గం చూపిపెట్టండి."

మిశ్రగారు ముందు అర్థం కానట్టు చూసి, "పని కావాలా?" అన్నారు.

"అవును. నేను యం. ఏ. వరకూ చదివాను."

మిశ్రగారు తల వూపుతూ, "ఈ వూళ్ళో పనులేమిటయ్యా? ఇక్కడ యం. ఏ. చదువెవ రికి కావాలి? అయినా ఏదైనా పట్నం వెళ్ళండి."

"వెళ్దామనుకున్నాను. రాత్రి బండిలో నా బెడ్డింగూ, పర్సూ ఎవరో కొట్టేశారు. నా దగ్గర దమ్మిడీ యినా లేదు. టిక్కెట్టు లేదని టిక్కెట్టు కలె క్టరు దింపేశాడు. చేతిలో విద్య వుంది కాబట్టి కొన్నాళ్ళు కష్టపడి డబ్బు సంపాదిద్దా మను కొంటున్నాను."

"అయ్యో! పాపం. మీ సామాను జబ్బా పోయా యా? హాఁ!" అని కొంచెం విచారించి, "ఏయ్! నారాయణీ, మా కేమైనా ఇవాళ టీ తాగే యోగ ముందా లేదా?" అని కేకేశారు మిశ్రగారు.

"ఇదుగో తెస్తున్నా" నంటూ రెండు కప్పు లతో టీ తెచ్చి ఇద్దరి ముందరాపెట్టి వెళ్ళిపోయింది. మిశ్రగారు ఆ వ్యక్తిని, టీ తీసుకోమని కోరారు. ఇద్దరూ టీ తీస్కో నారంభించారు.

"మీ పేరు?" అని అడిగారు మిశ్రగా రాయన్ని.

"నా పేరు శ్యామలరావు"

"మీ కాపురస్థలం"

"మాది అసలు ఆంధ్ర దేశమే. చాలా కాలం బట్టి మద్రాసులో వున్నాం. ఏదో అక్కడా అక్కడా చిన్నచిన్న పనులు చేసుకుంటూ కాలం గడుపుతున్నాను. ఢిల్లీలో మా వా డొక డున్నాడు. వాణ్ణి పట్టుకుంటే ఏదైనా మంచి ఉద్యోగం దొరకచ్చునని ఆశ వుంది. అక్కడకనే బయల్దేరాను. దారిలో ఇలా జరిగింది."

మిశ్రగారు కొంచెం ఆలోచించారు. "ఈవూరు చాలా చిన్నది. ఇక్కడ పెద్ద భాగ్యవంతులెవరూ లేరు. రెండు మిల్లులున్నాయి. ఏమన్నా పనుంటే అక్కడే వుండాలి. సరే వాకబు చేద్దాం. అంతవరకూ ఇక్కడే వుండండి" అన్నారు.

శ్యామలరావు, మిశ్రగారు చూపించిన ఆద రానికి చాలా సంతోషించారు. తన సంచీ తెచ్చి



"ముసలాయన ఏమన్నాడు?" అని అడిగాడు ఎడిటరు అప్పుడే ఆ ఊరికి వచ్చిన రాజకీయ నాయ కునితో ఇంటర్‌వ్యూ ముగించుకు వచ్చిన రిపోర్టర్‌తో.

"అసలు మాట్లాడందే!"

"అయితే రెండు 'కాలం'లకు మించి రిపోర్టు రాయకు."

కె. నారాయణరావు (చెంగల్పట్టు)



మిశ్రగారి గదిలో పెట్టుకున్నారు. నారాయణి ఆయన స్నానానికి నీళ్ళు తోడిచ్చింది.

ఆయన స్నానం చేస్తూంటే నారాయణి, ఆయన చాలా పరధ్యానం మనిషనుకొంది. తువ్వాలులేదు. సబ్బులేదు. ఉన్న నీళ్ళన్నీ నెత్తిమీద పోసుకుంటున్నా డాయన. తను ఇద్దామనుకొందిగాని, మగాయన! అందులో పడి వయస్సాయన! స్నానం చేస్తూంటే తనెంతకని అక్కడ తచ్చాడుతుంది. కాని ఈ బాబు గారి ధోరణి చూస్తే, అసలాయనకు ఎదురుగుండా తిరుగుతున్న వ్యక్తి ఆడా? మగా? అన్న సంశయమే వున్నట్టు లేదు. ఎవరో చాలా మంచాయన లాగు న్నాడు.

నారాయణి సబ్బూ, డాక్టరుగారి మడత తువ్వాలు ఒకటీ తెచ్చిస్తే ఆయన ఒళ్ళు తోముకొని, తువ్వా లుతో తుడుచుకొన్నాడు. తను కట్టిన పంచె అక్కడే వదిలేశాడు. తన సంచీలోని పంచె కట్టుకున్నాడు.

డాక్టరుగారికోసం నలుగురు రోగులొచ్చారు. వాళ్ళని పరీక్షించి, మందు లిచ్చి పంపేటప్పటికి పది కొండు అయింది. శ్యామలరావుగార్ని భోజనానికి లెమ్మ న్నాడు డాక్టరు. ఆయన యాంత్రికంగా లేచారు. నారాయణి వంట వండింది. ఆమె వడ్డించింది.

భోజనంచేస్తూ మిశ్రగారు శ్యామలరావుకి చాలా విషయాలు చెప్పారు. అసలీ పల్లెటూరు లాంటి అధ్వాన్నపు వూరు ఎక్కడా ఉండదన్నారు. పాపం పెరిగిపోతోంది ఇక్కడన్నారు. మనుషుల్లో నీతి లేందే! పట్టి దగుల్బాజీ రకం. మిశ్రగారు గాబట్టి వీళ్లతో నెగ్గుకొస్తున్నారు. మరొకాడైతే ఈపాటికి పరుగెత్తాలిసిందే ఈ వూరునుంచి. అప్ప టికీ తనకి కూడా టోకరా వెయ్యాలని చూశారు ఇక్కడవాళ్ళు. అబ్బే! వాళ్ల పప్పులు తనదగ్గ రేమీ ఉడకలేదు. తను అలాటి మనుషుల్ని చూడ గానే పోల్చేస్తారు. 'భాయీ! డబ్బు లేకుండా వైద్యం చెయ్యడం నావల్ల కాదు. నీ కిష్టముంటే సగం డబ్బు అక్కడ పెట్టి మందు వేయించుకో. లేకపోతే నీకూ, నాకూ రాం, రాం' అని చెప్పే స్తారు. ఎంత పెంకి ఘటమైనా, ఈ డాక్టరు బాబు దగ్గర తన పేషీ లేమీ పనిచెయ్యవని తెలుసు కుంటాడు. ఆ విషయం అందరికీ తెలుసు. అబ్బో! పెద్ద పట్టణాల్లో మెసలచ్చు గాని, ఇలాంటి పల్లెటూరులో మెసలడం చాలా కష్టం.

నారాయణి ఆవాళ బంగాళ దుంపల కూర చాలా బాగా చేసిందని మెచ్చుకున్నారు.. ఆయనకు కూడా వంట వచ్చును. మునుపు ఆయనే వంట చేసుకునేవారు. కానీ నారాయణి కూడా వంట బాగా చెయ్యటంవల్ల ఆ డ్యూటీ ఆమె కప్పగిం చారు. మిశ్రగారు.

శ్యామలరావుగారు భోంచేస్తూ డాక్టరుగారి మాటలన్నీ శ్రద్ధగా విన్నారు. తను ఈ తెలియని వూరు రావటం, మిశ్రగారి పరిచయమవటం తమకు కొంత దిగులు తీరిందన్నారు.

"ఫరవాలేదు. శ్యామ్ బాబూ. ఈ ఊళ్ళో సత్యన్నారాయణగారి మిల్లులో మీ కేదైనా పని దొరకవచ్చు. కష్టాలు వస్తూనే ఉంటాయి. కష్టా లకి జడిసి ఎంతకాలం బ్రతుకుతాము. భగవాన్ సహాయం చేస్తే ఎంతసేపు? ఎలాటి కష్టా లైనా ఇట్టే తీరిపోతాయి. అసలు మనల్ని పరీ క్షించడానికే కష్టాలొస్తాయి." అన్నారు మిశ్ర గారు.

శ్యామ్‌బాబు అవు నన్నారు. భోజనమయిం తరువాత, శ్యామ్‌బాబును కాసేపు విశ్రమించమని, ప్రక్కనున్న పల్లెటూరులో తనకేదో పనుందని చెప్పి డాక్టరుగారు బట్టలు వేసుకొని వెళ్ళి పోయారు. శ్యామ్‌బాబు, నారాయణి వేసిన పక్క మీద పడుకొని నిద్రపోయారు.

మధ్యాహ్నం సుమారు మూడు గంటలకు శ్యామ్‌బాబుకు మెలకువ వచ్చింది. నారాయణి టీ తీసుకొచ్చి యిచ్చింది. అప్పటి కింకా డాక్టరు గారు రాలేదు. డాక్టరుగా రెప్పుడు వచ్చేదీ నారా యణికి తెలుసేమోనని, అడిగారు. ఆమె తనకు తెలియదంది. పైగా ఆయన ఎప్పుడు వచ్చేదీ చెప్పలేము. ఒకొక్కప్పుడు రెండేసి మూడేసి రోజులు కూడా పడుతుందని, చెప్పింది.

శ్యామ్‌బాబుకు నారాయణి చాలా తెలివైనది గామా, మంచి మనిషిలాగా కన్పించింది. "సత్య

# ఏడుకొండలు

న్నారాయణగారి మిల్లెక్కడో మీకు తెలుసా?" అని అడిగా రాయన, నారాయణిని.

"ఈ ఎదురుగావున్న వీధివెంట వెళ్తే వస్తుంది బాబూ" అంది నారాయణి. ఆమె మనస్సులో ఈ బాబుగారెవరా? ఈ వూరు ఎందుకొచ్చారా? అన్న ఆలోచన మెదుల్తూనే వుంది. కాని తను అలాంటి విషయాలు అడగడం మర్యాద కాదనుకొంది. ప్రొద్దున్న డాక్టరుగారికీ, ఆయనకూ జరిగిన సంభాషణ వింది. కాని, ఆమె మనుష్యుడు ఆయన డబ్బూ, పేమాపూ పోగొట్టుకున్న మనిషిలా లేడు. ఎందుకో ఆ పేరు చెప్పారు. అయినా నారాయణి ఒక్క విషయం మాత్రం నిశ్చయంగా నమ్మింది. ఈ బాబు చాలా మంచి మనసుగల వ్యక్తి. ఏ కారణం వల్లో కష్టాల్లో ఇరుక్కున్నాడు.

శ్యాంబాబు బయటకు బయల్దేరాడు. సత్యనారాయణగారి మిల్లు వెదుక్కుంటూ వెళ్ళాడు. వీధి చివరకి వెళ్ళగానే కొద్ది దూరంలో మిల్లు కన్పించింది. ఆ వూళ్ళో వుద్యోగాన్వేషణకంతకన్నా మార్గంలేదు. ఆరోజు మిల్లుకు సెలవు. మిల్లులో ఎవరూ లేరు. దాని యజమాని, ఇంటి దగ్గర వుంటారని తెలిసింది.

ఎలాగైనా తను ఆయనను కలుసుకోవాలి. అందుకని ఇంటికి వెళ్తేనే మంచిదని నిశ్చయించాడు శ్యాంబాబు.

ఆ చిన్న పల్లెటూరిలోవున్న కొద్ది మేడల్లో సత్యనారాయణగారిదొకటి. మొత్తం ఏడెనిమిది మేడలుంటాయేమో! అందులో కొన్ని రంగులతోనూ, సిమెంటు పలకం డిజైన్లతోనూ వున్న మేడ ఆయనది. శ్యాంబాబు, ఆ యిరుకువీధుల్లో, చిన్న పిల్లలు ఒంటిమీద బట్టైనా లేకుండా ఆడుకుంటూంటే, వాళ్ళనీ, పొట్టభాగం ఆవే వున్న వూరివాళ్ళనీ, రవికెల్లు తొడుక్కోకుండా చీరకట్టు తమాషాగా కట్టుకునే స్త్రీలనూ చూస్తూ వెళ్ళసాగాడు.

రామవరం ఇంచు మించు ఆంధ్ర రాష్ట్రానికి చివరవుండే పల్లెటూళ్ళలో ఒకటి. అక్కడికి ఉత్కళ రాష్ట్రం చాలా దగ్గర. ఉత్కళ దేశపు వేష భాషలూ, ఆచారాలూ కొన్ని అక్కడ వ్యాపించి వున్నాయి. ఎలాగైనా ఆ ప్రదేశము, తక్కిన రాష్ట్రమంతటి కన్నా సంస్కృతిలో వెనకబడివుందనే చెప్పాలి.

సత్యనారాయణగారు బాగా ధనమూ, పలుకుబడీ వున్న మనిషి. ఆయనకు ధాన్యం మిల్లూ, సావె మిల్లూ కూడా వున్నాయి. ఆయనకు ఇద్దరబ్బాయిలూ ఇద్దరమ్మాయిలూ వున్నారు. మనిషి ఎర్రగా పొడుగ్గా వుంటాడు. రాజకీయాలంటే చాలా ఆసక్తి. వయస్సు నలభై దాటివుంటుంది. ఆ వూరి పంచాయతీబోర్డు ప్రెసిడెంటాయనే. కొంత రాజకీయ బుద్ధి కూడా వుంది ఆయనకు.

శ్యామలరావుగారు వెళ్ళగానే ఆయనను కలుసుకోవడానికి వీలులేకపోయింది. ఎందుకంటే ఆయన లోపల ఎవరో పెద్ద పెద్ద ఆఫీసర్లతో మాట్లాడుతున్నారని తెలిసింది. ముందు హాలులో ఆయన గుమాస్తా కనిపించి శ్యామలరావుగారు ఎందుకు వచ్చిందీ కనుక్కొని, ఆయన్ని కూచో పెట్టాడు. ఒక అర గంటలో వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత శ్యామలరావుగారిని లోపలికి పిలిచి, సత్యనారాయణగారికి ఆయన గురించి చెప్పాడు.

సత్యన్నారాయణగారు, శ్యామలరావుగారితో ఇంగ్లీషులో మాట్లాడాడు. శ్యామలరావు ఇంగ్లీషులో జవాబిచ్చాడు. వాళ్ళిద్దరు మాట్లాడిన భాషకు చాలా తేడా వుంది. సత్యన్నారాయణగారు పెద్ద చదువు చదువుకున్నాయన కాదు. ఆయనకు వచ్చిన ఇంగ్లీషు వర్తక వ్యాపారానికి పనికి వచ్చేది మాత్రమే.

శ్యామలరావు భాష, సంభాషణ స్టైలు సంటివి. వచ్చిన ఉచ్చారణతో ఆయన మాట్లాడే తీరు చూస్తే సత్యన్నారాయణగారికి ముచ్చట వేసింది. ముందు తనవద్ద ఉద్యోగాలేమీ లేవన్నా రాయన. కాని, తరువాత శ్యామలరావుగారి కిష్టమైతే ఒక ఏర్పాటు చేయగలనన్నారు. తన రెండవ అబ్బాయి ఇంటరుకు ప్రయివేటుగా కట్టున్నాడు. పెద్దమ్మాయి ఎప్పటి నుంచో మెట్రిక్కు కట్టాలని అంటూవుంది వస్తోంది. ఆమెకు తగిన మాస్టరు దొరకటంలేదు. ఏ వూరికి ఆమెను పంపటం ఇష్టంలేదు. ఇక అబ్బాయి చదువుకోసం ఏ దగ్గరలోవున్న పట్నానికైనా పంపితే సినిమాలూ అవీ మరిగి సరిగా చదవడు. అందుకని వాళ్ళిద్దరికీ ప్రయివేటు చెప్పడం ఒక పని. తరువాత మిల్లు గుమాస్తా ధర్మయ్యగారికి ఇంగ్లీషు అంతగా రాదు కాబట్టి మిల్లులో ఇంగ్లీషు అవసరమైనప్పుడు ఆయనకు సాయం చేయడం రెండవ పని. ఈ రెండు పనులూ చేస్తూ వుండమని కోరాడు. శ్యాంబాబు అందు కంగీకరించాడు.

కొద్ది రోజులు శ్యాంబాబు ఓపిక పట్టే తను రాబోకు ఇళ్ళల్లో ఒకటి ఖాళీ అవుతుందని అందులో ఆయన వుండవచ్చునని, అంతవరకు ఎలాగో గడుపుకోమని చెప్పారు. జీతమేమీ నిర్ణయించలేదుగాని, ప్రస్తుతంలో ఆయనకు కావలసి డబ్బు గుమాస్తానడిగి తీసుకోమని చెప్పారు. తరువాత గుమాస్తా ద్వారా, శ్యాంబాబుకు, తనకు నెలకు నలభై రూపాయలు మించకుండా ఇవ్వమని సత్యనారాయణగారు గుమాస్తాకి చెప్పినట్లు తెలిసింది.

(సశేషం)

సావిత్రిని సెట్‌మీద ఎంతసేపైనా చూస్తూం డాలని అనిపించింది. అప్పుడామె ఆ చిత్రంలో అంధు రాలిపాత్రను నిర్వహిస్తోంది. ఆమెను చూసి, కొత్తగా నటనారంగంలో ప్రవేశించేవారు ఎంతైనా నేర్చుకో వలసిఉందనే అభిప్రాయం అవాడే నాకు ఏర్పడింది. ఈనాటికీ ఆ భావం నాలో చెరిగిపోలేదు.

నా విద్యార్థిదశఅంతా కాలేజీ పాఠాలయ్యాక విరామ సమయాల్లో ఎప్పుడూ సావిత్రి గురించే మాట్లాడుకుంటూండేవాళ్ళం. కాలేజీ విద్యార్థినుల్లో ఆమె ఫాన్స్ అసంఖ్యాకం. ఒక రోజున మాలో మాకు దెబ్బలాట వచ్చింది. ఆమె తెలుగు అమ్మా యని మేం గర్వంగా చెప్పుకుంటూంటే, తమిళ విద్యార్థినులు "కాదు, తమిళం అమ్మాయి" అని వారు గర్వంగా చెప్పుకునేవారు. జుట్లు గుద్దుకుంటూ వాదించేవరకూ మా వాదన పెరిగిపోయేది. సావిత్రి శ్రీ జెమినీ గణేశన్‌కి సతి అయిన తరువాతనే మాకీ వాగ్యుద్ధం చెలరేగింది. ఆఖరికి మాలో మేమే రాజీ పడేవాళ్ళం. ఆమె తెలుగువారి అమ్మాయి అనీ, అరవ వారి కోడలనీ......క్లాస్ లెక్చరర్ వచ్చేవేళకి కాంప్రమైజు అవక తప్పేదికాదు మాకు.

బి. ఏ. పట్టా పుచ్చుకున్న తరువాత నేను 'లా' చదవాలనుకున్నాను. లా కాలేజీలో చదువు సాగుతూండ గానే చలన చిత్రరంగంలో ప్రవేశించటానికి అవకాశం కలిగింది. గేవాకలర్‌లో తయారవుతున్న "లవ కుశ" చిత్రంలోను సారథివారి "కాళిదాసు" చిత్రంలోను నాకు తొలి అవకాశాలు వచ్చాయి. వాటిని చదువు సాగిస్తూనే నిర్వహించాను. ఆ తరువాత చదువుకి స్వస్తి చెబితేనేగాని, చిత్రాలలో పాత్రల నిర్వహణ కొనసాగేటట్లు కనబడలేదు.

తలవని తలంపుగా నా అభిమాన తార, నా ఆరాధ్య నటీమణి సావిత్రితో కలిసి నటించే భాగ్యం 'శ్యామాలి' అనే చిత్రంలో కలిగింది. ఆ చిత్రంలో ఆమె మూగ అమ్మాయి పాత్ర నటిస్తోంది. నేనామె చెల్లెలుగా నటిస్తున్నాను. పాత్రల మధ్య బాంధవ్యం కూడా నా కోరికల ననుసరించే ఏర్పడిందని సంతో షించాను.

ఆ చిత్రంలో మేం ఇద్దరం కలిసి నటించే సెట్ షూటింగ్‌కోసం వేయికళ్ళతో ఎదురుచూస్తూ వచ్చాను. ఆరోజు రానే వచ్చింది. అది నాకు పండుగ రోజుగానే నేటికీ ఉండిపోయింది. నాకు నటన విష యంలో సూచన లిచ్చింది. నన్ను ప్రోత్సహించింది. మరునాడు నేను సెట్‌కు రొంపతో బాధపడుతూ వచ్చాను. సావిత్రి నన్ను చేరదీసి, "సొంఠి కాఫీ తాగు తూండు రొంప వచ్చినప్పుడల్లా" అని సలహా యిచ్చింది. ఆరోజు ఆమెను తెరపైనే కాకుండా ఎల్ల వేళల్లోనూ అక్కా అని పిలవటానికి నిర్ణయించు కున్నాను. నా అభిమానానికి ఆమె కూడా ఆనందించి నన్ను చెల్లెలుగా స్వీకరించింది. నా ఆనందాన్ని మాటల్లో చెప్పలేను.

ఏవో కారణాలవల్ల "శ్యామాలి" చిత్ర నిర్మాణం పూర్తి కాలేదు. సావిత్రి అక్కయ్య స్నేహం నాకు

# సావిత్రి అక్కయ్య

39-వ పేజీ తరువాయి

వాళ్ళింటికి రమ్మనమని ఆహ్వానం అందించింది. ఒకసారి మా ఇంటికి వచ్చిన బంధువులు సావిత్రిని చూడాలని పట్టుబట్టారు. ఆమె ఆహ్వానావకాశాన్ని ఉపయోగించుకుంటూ మేం అంతా వాళ్ళింటికి వెళ్ళాము.

అప్పటికి ఆమె సేలంనుంచి రావటంతోనే అనా రోగ్యానికి గురి అయిందట. ముందుగా మా కా సంగతి తెలియలేదు. మాకు ఆదరంతో అభిమా నంతో ఎంతో మర్యాదల్ని అందించింది. ఆమెలో ఉన్న మంచి గుణాలు ఒక్కొక్కటే నాకు అర్థమవు తున్నాయి.

ఆ తరువాత నాకు వీనస్ పిక్చర్స్‌వారి తమిళ చిత్రం "తేన్‌నిలవు" (విరిసిన వెన్నెల తెలుగు డబ్బింగ్ చిత్రానికి మూలం) లో నటించే అవకాశం వచ్చింది. ఆ చిత్రంలో శ్రీ జెమినీ గణేశన్ హీరో. ఆయనను నేను అన్నయ్యా అని పిలవటం అలవాటు అయింది. మరి మా సావిత్రి అక్కయ్య ఎలా అవుతుంది? వదిన అవుతుంది. వదినా అని ఆ అను రాగాలరాశిని పిలవటం అంటే నాకేదో ఎబ్బెట్టుగా తోచేది. వదినా అనే పిలుపులో ఏదో దూరపు చుట్టం లా అర్థం ధ్వనిస్తూండేది నాకు. మనస్సు చివుక్కు మంటూండేది. అందుకు ఒక విధంగా నాతో నేనే రాజీ పడ్డాను. శ్రీ గణేశన్ సమక్షంలో ఆమె ఉన్న ప్పుడు వదినా అని పిలవటానికి, ఆమె ఒక్కర్తే ఉన్నప్పుడు అక్కా అని పిలవటానికి నిర్ణయించు కున్నాను.

"తేన్‌నిలవు" చిత్రం షూటింగ్ ఎక్కువ భాగం కాశ్మీరులోనే జరిగింది. కాశ్మీరుకి ముందుగా మా యూనిట్ అంతా వచ్చింది. కొలది రోజుల తరు వాత మదరాసునుంచి సావిత్రి అక్కయ్య వచ్చింది కాశ్మీర్. పండు మిరపకాయ పచ్చడి పట్టుకు వచ్చింది. చలితో, చప్పటి భోజనంతో నిస్పృహ కలిగిన నాకు ఆ పచ్చడి అమృతంలా అందింది.

కాశ్మీర్‌లో ఆమెకు ఎక్కువగా పని ఉండేదికాదు. ప్రతిరోజూ ఆమె భర్తతోబాటు షూటింగ్‌కు వచ్చేది. ఆయన నటిస్తూంటే నటనలో సూచ నలు ఆయనకు అందిస్తూండేది. ఆయన వాటి నెంతో సరదాగా స్వీకరించేవారు. మరొకప్పుడు డైలాగ్ బాగా చెప్పలేదని ఆమె ఆయన్ని వెక్కిరిం చేది. "నీ చేత్తో ఇప్పుడే టిఫిన్ పెట్టావు. డైలాగ్ ఎలా బాగుంటుంది?" అని ఆయన ఆమెను వెక్కి రించేవారు. ఆ భార్యా భర్తలు ఎంతో అన్యోన్యంగా కాలం గడుపుతూండేవారు.

సాయంకాలం ఐదు గంటలకి రోజూ షూటింగ్ పూర్తవుతూండేది. సావిత్రి అక్కయ్య భర్తతో కలిసి ఏ క్లబ్‌కో వెళ్ళిపోయేవారు. రెండు నెలలపాటు కాశ్మీర్‌లో వారి విధంగా అనురాగంతో, వేడుకగా గడుపుతూండటం చూసిన మా యూనిట్ వారంతా "ఇది జెమినీ గణేశన్ సావిత్రుల హనీమూన్" అని సంబరపడేవారు. (తేన్ నిలవు అంటే హనీమూన్ అని అర్థం.)

నా ఫేవరిట్ స్టార్ నాకు సావిత్రి అక్కయ్య అయింది. మా పరిచయం అభిమానం రోజు రోజుకీ పెరుగుతూనే ఉంది. ఆమెలో చాలా సుగుణాలున్నవి. తోటి నటీమణి అంటే ఆమె ఎన్నడూ అసూయ పడదు. కొత్తవాళ్ళకీ పాతవాళ్ళకీ ప్రోత్సాహం అందిస్తూండడం ఆమె స్వభావం.

సెట్‌మీద ఆమె ఏ 'మూడ్'లో ఉన్నాసరే చమ త్కారంగా మాట్లాడటం ఆమెలోగల మరొక సుగుణం. ఆమె మనసులో కారు మేఘాలు ఉండవు. ఇతరుల గురించి ఏహ్యంగా ఎన్నడూ మాట్లాడదు. ఆమెతో మేం కాలం వెళ్ళబుచ్చాలని కోరుకోవటంలో ఇదే ఆకర్షణ. పరాయివాళ్ళెవరైనా వస్తే వాళ్ళతో ఎంతసేపు, ఏ విధంగా మాట్లాడాలో బాగా తెలుసు. సంస్కారంగల సరసమైన నటీమణి, వ్యక్తి ఆమె.

చిత్ర నిర్మాతలందరూ ఆమెను మెచ్చుకుం టారు. కాల్‌షీట్‌వేళకి సరిగ్గా పంక్చుయల్‌గా వచ్చేస్తుందామె. ఈ మంచిపేరు తెచ్చుకోవాలని నాకూ ఉత్సాహంగా ఉంది. ఒకరోజున మా అక్కను అడిగా "ఏ వేళా నేర్చుకున్నావక్కా ఈ పంక్చుయాలి టీని?" అని.

చిన్నప్పుడు తన తండ్రిగారు, ఇప్పుడు తన భర్త గారు ఇందుకు కారకులనీ, ఎక్కడికి వెళ్ళాలన్నా వారిద్దరూ "క్విక్, క్విక్" అంటూ, తొందరచేసి, సకాలంలో కార్యక్రమాలకి హాజరు కావటంలోని విద్యుక్త ధర్మాన్ని నూరిపోశారనీ, ఆలస్యాన్నీ, బద్ధకాన్నీ వారు భరించేవారు కారని ఆమె జవాబిచ్చింది.

ఆమె దాంపత్య జీవితం గురించి రెండు వాక్యాలు వ్రాసి ఈ వ్యాసం ముగిస్తాను. సినిమా తారలలో ఆనందమయంగా జీవితం గడుపుతున్న "స్టార్ కపుల్" వీరే. వీ రిద్దరూ చాలా బిజీ స్టార్స్ కూడా. ఇద్దరూ కలసి కొన్ని చిత్రాలలోనూ, విడి విడిగా కొన్ని చిత్రాల్లోనూ వీరు నటిస్తూంటారు. ఇద్దరికీ రోజూ కాల్‌షీట్ కార్యక్రమం ఏ స్టూడియోలోనో ఉం టూనే ఉంటుంది.

వేర్వేరు కాల్‌షీట్స్‌లో, వేర్వేరు స్టూడియోల్లో ఇద్దరూ పని చేస్తూంటే విరామ సమయంలో ఇద్దరూ కలుసుకుంటారు. భోజనాలు, టిఫెన్లు కలసి ఆరగించి, తిరిగి సెట్స్‌కు వస్తారు. ఈ "బిజీ" తారలు గృహాన్ని కూడా స్వర్గసీమ చేసుకోగలుగు తున్నారు. స్టూడియోలనుంచి ఇంటికి చేరగానే వీ రిద్దరూ తమ పాప "విజ్జీ" (కుమారి విజయ చాముండేశ్వరి)తో హాయిగా కాలం గడుపుతారు. తారగా, గృహిణిగా సావిత్రి అక్కయ్య మా అంద రికీ ఆదర్శ మహిళగా విరాజిల్లుతున్నది.

ఇది నా తొలి రచన. అందుచేత దీనిని నా సావిత్రి అక్కయ్యకే అంకితం చేస్తున్నాను. 

సేకరణ : మధుమూర్తి



# పగటి దొంగలు

33-వ పేజీ తరువాయి

హైకోర్టు మూలలున్న ఎవరెస్టు లాడ్జి పక్కకెలి పోతున్న.

కొంచెం దూరంనుంచి ఒక బిచ్చగాడు నా దిక్కొ స్తున్నడు. వాడు గుడ్డోడున్నట్టున్నడు. చేతిల ఒక కట్టె పట్టుకొని దానితోటి ముందట వుటుకు కుంట నడుస్తున్నడు.

"కండ్లులేని పచ్చిని బాబూ! ఒక పైస దానం చెయ్యండ్రి బాబూ!" అనుకుంట వస్తున్నడు. ఆ రోడుమీద మనుమ్మలెవ్వరు లేరు. అసలా సడకు మీద ఎప్పుడు కూడ జన సంచార మెక్కువుండది. అసొంటి సడకుమీద బిచ్చగాడు పాపం, మనుములున్న లనుకుంటున్నడు. కండ్లేమో లెవ్వాయె! మనుము లున్నది, లేంది ఎట్ల కనిపిస్తది. అసలియ్యాళ్ల, లేవు బిచ్చగాళ్లకు దానం చేసే పుణ్యాత్ములు ఎక్కడ కనిపించరు. దానికితోడు మన సర్కారోళ్లు కానీలు తీసేసి, నయాపైసలు పెట్టి బిచ్చగాళ్ల కింకింత కష్టాన్ని తెచ్చి పెట్టిండ్రు.

పాపం, బిచ్చగాళ్లకు ఎంత తిప్పలొచ్చి పడ్డదని అనుకున్నంతల బిచ్చగాడు నా దగ్గరి కొచ్చిండు. వాని పెయ్యి (దేహం) మీది తోలంత ముడుతలు పడ్డది. గడ్డం సాధుకంటె ఎక్కువ పెరిగింది. తొడుక్కున అంగి, ధోతి ఎన్నేండ్లనుంచి వాని పెయ్యిమీదున్నయోకాని, నల్లబడి, తుక్కు తుక్కు చినిగిపోయిన్నై. వాని హాలత్ చూసేవారకు నా కండ్లల్ల నీళ్ళు తిరిగిన్నై. వాడు నా దగ్గరికి రాంగనే జేబులకెలి ఒక ఆఠానబిళ్లతీసి వాని గిన్నె లేసిన. వాడు నాకు దండాలు పెట్టుకుంట పోయిండు. నేను వానికి మదత్ చేసిన గదా అన్న సంతోషంతోటి ముందటికి పోయిన.

అట్ల నేను తో పది—పన్నెండు గజాల దూరం పోయిన్నో లేదో కాని వెనుకకెలి "రచ్చించండి బాబూ, రచ్చించండి! ఎవడో దొంగముండకొడుకు నా పైసలు గుంజుకుంటున్నడు" అన్న బిచ్చగాని కేకలు విన్చొచ్చి నేను వెనుకకు తిరిగి చూసిన. ఎవడో ఒక రౌడీగాడు బిచ్చగాని గిన్నెలున్న పైసలు బల వంతాన గుంజుకుంటున్నడు. వాడు చేస్తున్న అన్యా యానికి నాకో తమ్ములు తిని వచ్చిన బలం ఎక్క న్నుంచో ఎకాయెకిన ఉరికొచ్చింది. జల్ది నా సైకిల్ వెనుకకుతిప్పి బిచ్చగాన్ని తాని కొచ్చేవాతల దొంగోడు నన్ను చూసి ఆ పైసలన్ని అంగి జేబులేసుకొని రోడు కడ్డంగ ఉరుకుడు మొదలు పెట్టిండు. నేను నా సైకిల్ బిచ్చగానితాన పారేసి దొంగోని వెనుకపడ్డ. అట్ల వాన్ని నో ఇరువై గజాల దాకా ఉరికిపిచ్చి దొరుక పట్టి, వాని బాలందుకున్న. బాలు పట్టుకోంగనే నా కండ్లముందట సినిమాటోటర్ల నన్ను కొట్టిన గాడిద కొడుకులు కనిపించిండ్రు. వాళ్లమీదున్న పగంత తీరేటట్టు వీని గదువ (గడ్డం) కిం ‹ ‹కులోటి తోటి ఒక్క గుద్దు గుద్దేవారకు "అమ్మ బాబో!" అనుకుంట వాడు వెల్లెలుకల పడ్డడు. వాని జేబు లున్న పైసలన్నికింద పడ్డై. మల్ల వాని గల్ల (కాలర్) పట్టి మీదికెత్తి ఉంకోక గుద్దు గుద్దిన. ఆ రెండు గుద్దులకు వాని మఖమంత చిగిపోయింది. ఇంక అక్కడుంటే బతుకవనుకొని లేచి పీకో పీరోమని బాగాయించిండు.

అప్పుడు నేను కిందపడ్డ బిచ్చగాని పైసలన్ని ఏరుకొని సంతోషంతోటి బిచ్చగాడున్న తాని కొచ్చిన. కాని ఆశ్చర్యం! అడ బిచ్చగాడు లేడు! నా సైకిలు లేదు!! వాటికి బదులు అక్కడ వేషాలేసె టోళ్ల గడ్డం, మీసాలు చింకి గుడ్డల జోలె, ఒక చేతి కట్టె పారేసి ఉన్నై. అప్పుడు తెలిసింది నా సైకిలు కొట్టెసుటానికి వాళ్లిద్దరాడింది నాటకమని.

చూసిండ్రా దోస్తులారా, పట్నంల ఎసొంటి దోఖాబాజోల్లు, పగటిదొంగ లుంటరో. ఇగ నాకైతేదో అయింది. కాని మీరు పట్నమొస్తే మాత్రం నా లెక్క తొందర పడక ప్రతి పనిని ఎంతో జాగర్తగ చెయ్యండ్రి మరి! లేకుంటే నాగతే పడ్తది. ఇక వుంటా. ★



# భూగర్భంలోనికి సాహసయాత్ర

31వ పేజీ తరువాయి

శతాబ్దాల కాలం గడిచినా చెక్కు చెదరకుండా శాశ్వతంగా అజరమైనవిగా కనిపించాయి.

ఇది మా ప్రయాణంలో ఆఖరి మజిలీ. హాన్స్ అతి చాకచక్యంగా మమ్మల్ని ఇక్కడకు తీసుకు వచ్చాడు. ఇంకా మా ఉద్యోగంలో ఉంటాడుకదా అని ధైర్యం తెచ్చుకున్నాను.

ఫాదరీ (లేక రెక్టర్) ఇంటిని సమీపించాము. ఇది నిరాడంబరమయిన ఒక గుడిసె. ఆ వూరిలో ఉన్న తక్కిన గుడిసెలవలెనే ఉన్నది. ఇంటిముందు ఒక వ్యక్తి గుర్రానికి లాడం వెయ్యటానికి సిద్ధం అవుతున్నాడు. చేతిలో సుత్తి, నడుంచుట్టూ ఒక 'అప్రన్' (Apron) వేసుకుని ఉన్నాడు.

"సాల్‌ఫెర్టూ" అన్నాడు వేటగాడు.

"గోడ్‌డాగ్"అని ఆ వ్యక్తి స్వచ్ఛమయిన డానిష్‌లో సమాధాన మిచ్చాడు.

హాన్స్ మా పెదనాన్నతో, "క్యైర్‌కోహెర్ట్" అన్నాడు.

"హోహో రెక్టరా! ఆక్సెల్ ఈ మహానుభావుడే 'రెక్టర్'ట."

మా గైడ్ 'క్యైర్ కోహెర్ట్'కు పరిస్థితి వివరించాడు. అతను సుత్తి దింపి ఒక వింత పిలుపు పిలిచాడు. ఇది గుర్రాలకూ, గుర్రాల వ్యాపారంచేసే వారికీ సుపరిచితమే అయిఉంటుంది. వెంటనే గుడిసెలోనుంచి ఒక పొడుగుపాటి స్త్రీ బయటకు వచ్చింది. ఆరడుగులు ఉండకపోయినా ఇంచు మించు అంతా ఉన్నది.

ఒక ఐస్‌లాండిక్ ముద్దుతో స్వాగతం ఇస్తుందేమోనని భయపడ్డాను కాని ఆవిడ అలా చెయ్యలేదు. అసలు మేము వచ్చామని సంతోషం ప్రకటించలేదు.

అతిథుల గది ఇంట్లో అన్నిగదులలోకీ అధ్వాన్నమైనదనిపించింది. ఇరుకుగా, అశుభ్రంగా మురికి వాసన వేస్తున్నది. కాని దానితోనే తృప్తిపడవలసి వచ్చింది. రెక్టర్‌గారు పాతకాలపు ఆతిథ్యం లెక్కచేసే మనిషి కాదని తెలిసింది. సాయంత్రం లోపుగా ఆయన, కమ్మరి, జాలరి, వేటగాడు, వడ్రంగి అని తెలుసుకున్నాను కాని దైవ ప్రతినిధి అని మాత్రం అనిపించలేదు. ఇది ఆదివారం కాదనుకోండి! బహుశ ఆ దినం తన వృత్తిపైన ఆసక్తి చూపిస్తాడా?

పాపం, ఈ పేద ఫాదరీలను ఖండించాలని ఉద్దేశం కాదు. వారి జీతం చాలా తక్కువ. నెలకి వూరినుంచి వచ్చే రాబడి అరవై 'మార్కు'లు కూడా ఉండదు. అందుచేతనే మరేవైనా పనులు చేసుకోనవలసి వచ్చేది. కాని కొంతకాలానికి వాడికి జాలరుల గుణాలు, వేటగాళ్ల గుణాలు మొదలైనవి అబ్బుతాయి. ఆ సాయంత్రమే మా ఇంటి యజమానికి బాగా తాగడం అలవాటని గమనించాము.

ఎటువంటి మనిషితో సంప్రదించవలసి వచ్చిందో మా పెదనాన్నకి అర్థమయిపోయింది. పండితుని బదులు మొద్దుబారిన రైతు తటస్థమయ్యాడు. వీలైనంత త్వరలో ఈ ఇల్లు వదలి ప్రయాణం ప్రారంభించాలని నిశ్చయించాడు. అలిసిపోయి ఉన్నాననే విషయం మర్చిపోవాలనుకున్నాడు. కొండల మీదనే తరువాతి కొద్దిరోజులూ గడపటానికి పూనుకున్నాడు.

స్టేషీకి వచ్చిన మర్నాడే తిరిగి బయలుదేరటానికి సిద్ధమయ్యాము. మా సామాను గుర్రాల బదులు ముగ్గురు ఐస్‌లాండర్‌లు కొండలమీదకు తీసుకు వెళ్లే ఏర్పాట్లు హాన్స్ చేశాడు. అయితే మేము అగ్నిపర్వత ముఖద్వారంలోనికి చేరగానే తిరిగి వెళ్ళిపోతారనే విషయం స్పష్టంగా తేల్చుకున్నారు వీరు.

వేటగానితో మా పెదనాన్న ముఖద్వారం అంతు కనుక్కుందామని నిశ్చయించినట్లు చెప్పే సమయం వచ్చింది.

హాన్స్ తల వూపాడు. అంతే. తన ద్వీపతలంమీద ప్రయాణం చెయ్యటానికీ, అంతర్గర్భంలోనికి పాదుకుపోవటానికీ భేదం లేదనుకున్నాడల్లే ఉన్నది. అక్కడికి కాకపోతే ఇంకెక్కడికైనా వచ్చేవాడు. ఇక నా సంగతి : మా ప్రయాణంలో జరిగిన వివిధ సంఘటనలలో మునిగిపోయి ముందు విషయమే మర్చిపోయాను. నా ఆందోళన అధికం అయింది. ఏమి చెయ్యగలను? ప్రొఫెసర్ లిడెన్‌బ్రోక్‌గారిని ఎదిరించి ఉండినట్లయితే హాంబుర్గ్‌లోనే చేసి ఉండాలి. స్నాఫెల్స్ పర్వతం క్రింద కాదు.

---

"క్వశ్చన్ పేపర్లప్పుడే ముద్రణకు వెళ్ళిపోయాయి. ఆఖరి సందేహాలున్నవారు అడొగొచ్చు," అన్నారు లెక్చరర్ గారు క్లాసు నుద్దేశించి.

"ఏ ప్రెస్‌కి వెళ్ళాయండీ?" ఒక ఒక విద్యార్థి వెంటనే లేచి అడిగాడు.

ఎస్. రామారావు (విజయవాడ)

---

నన్ను కలత పెట్టిన ఆలోచనలలో ఒకటి మరింకెవ్వరికైనా కూడా భయం కలిగించేది.

"ఇదిగో చూడు, మనం స్నాఫెల్ పర్వతం ఆరోహించబోతున్నాము. సరే. ముఖద్వారం పరిశోధించబోతున్నాము. మంచిది. ఇంతకుముందు చేసినవారు చాలలేదు. కాని ఇది ఇంతటితో ఆగేదికాదు. భూగర్భంలోకి దారి దొరికితే, ఈ దౌర్భాగ్యుడు సాక్నుస్సెమ్ నిజమే చెప్తే, ఈ అగ్నిపర్వతం అంతరాళాలలో తప్పిపోతాము. స్నాఫెల్స్ పర్వతం ఆరిపోయిందని ఋజువేమిటి? మరొకసారి బ్రద్దలవదని హామీ ఎక్కడ? 1219 నుంచి స్తబ్దుగా ఉన్నంత మాత్రాన తిరిగి విజృంభించదని ఎలా చెప్తాము? అలా జరిగితే మా సంగతేమికాను?" అనుకున్నాను నాలో నేను.

ఇది ఆలోచించతగ్గ విషయమే. ఆలోచించాను. నిద్ర పట్టినప్పుడల్లా అగ్ని పర్వతాలు బ్రద్దలయినట్లు కలలు వచ్చేవి. 'లావా'గా మారి ఆ పాత్ర ధరించటం చాలా కష్టమనిపించింది.

ఇక ఆగలేక ఈ సమస్య మా పెదనాన్నకే చెప్పాలనుకున్నాను. కాని అతి లౌక్యంగా ప్రవర్తించదలచాను.

ఆయన దగ్గరకు వెళ్ళాను. నా భయం ఏమిటో చెప్పుకున్నాను. ఎగిరిపడ్తాడని తెలిసి అవసరమయినంత దూరంగా జరిగాను.

"దాని విషయమే ఆలోచిస్తున్నాను" అని మాత్రం అన్నాడు.

ఈ మాటలకు అర్థం ఏమిటి? ఇప్పటికైనా బుద్ధిమంతుడివలే ప్రవర్తించబోతున్నాడా? తన ఉద్దేశ్యం మార్చుకుంటాడా? అంత అదృష్టమా!

కొన్ని క్షణాలు మౌనంగా గడిచాయి. నేను వెంటనే ఆయనను ప్రశ్నించ సాహసించలేదు. ఆయనే ఇలా అన్నాడు :

"అవును, దాని విషయమే ఆలోచిస్తున్నాను. స్టేషీవచ్చిన తర్వాత ఈ ధ్యానలోనే ఉన్నాను. మనం తొందరపడి ఏదీ చెయ్యకూడదు."

"వీల్లేదు!" అన్నాను ఉద్రిక్తంగా.

"స్నాఫెల్స్ ఆరువందల సంవత్సరాలుగా మౌనంగా ఉంది. కాని మాట్లాడగలదు. అగ్ని పర్వతాలు బ్రద్దలయితే ముందుగానే కొన్ని సూచనలు తెలుస్తాయి. ఇక్కడ వారిని అడిగి చూశాను. నేనే నేలపరీక్ష చేసి చూశాను. ఆక్సెల్ పర్వతం బ్రద్దలవదని చెప్పగలను."

ఈ హామీ నన్ను నిరుత్తరుడినిగా చేసింది. సమాధానం ఇవ్వలేకపోయాను.

"నా మాటలమీద నమ్మకం లేదా?" అన్నాడు మా పెదనాన్న. "నాతో రా!"

యాంత్రికంగా అనుసరించాను. ఇల్లు వదలి సముద్రానికి ప్రతి ముఖంగా, ప్రకృతి నిర్మించిన గోడలో ఒక ద్వారంలోనుంచి, ఒక పొలం చేరుకున్నాము. 'పొలం' అన్నానేకాని, అందులో ఎక్కడ చూసినా రాళ్ళు కుప్పలు కుప్పలుగా పడి ఉన్నాయి. రాళ్ళవాన కురిసిందా అన్నట్లు ఉన్నది.

అక్కడక్కడ వేడినీటి వూటలు పొగలు గ్రక్కుతున్నాయి. అగ్ని పర్వత ప్రదేశమని తెలుస్తున్నది. నా భయం సరియైనదే ననిపించింది. కాని నా 'ఆశలు' కూలిపోయేట్లు మా పెదనాన్న ఇలా అన్నాడు.

"ఆ ఆవిరి చూశావుగా. ఆక్సెల్ అగ్నిపర్వతం బ్రద్దలవదని నిరూపిస్తోంది."

"అదెలాగ?" అని అరిచాను.

"ఈ విషయం గుర్తుంచుకో" అన్నారు ప్రొఫెసర్‌గారు. "అగ్ని పర్వతం బ్రద్దలయ్యేముందు ఈ వూటల వేడి అధికమవుతుంది. సరిగ్గా బ్రద్దలయ్యేసమయానికి అసలు ఆగిపోతాయి. వీటికి కావలసిన శక్తి అంతా పర్వతముఖద్వారంవైపు మరలి పోతుంది. నీటి వూట మామూలుగా ఉన్నంత కాలం మనకే ప్రమాదమూ లేదు."

"కాని—"

"ఇక చాలు. శాస్త్రం చెప్తే నోరు మూసుకోవలసిందే!"





# భూగర్భంలోనికి సాహసయాత్ర

చిన్నబుచ్చుకుని తిరిగి వెళ్ళిపోయాను. మా పెద నాన్న శాస్త్రీయమైన వాదాలతో నన్ను ఓడించాడు. కాని నాకు ఒక 'ఆశ' మిగిలింది. ముఖద్వారం లోనికి కొంత దూరం దిగిన తర్వాత ఇక వెళ్ళే దారి ఉండదని—సాక్నుస్సెమ్‌లు ఎందరున్నా.

రాత్రి పీడకలలు వచ్చాయి. అగ్ని పర్వతంలోనికి పడిపోయి ఒక రాతి స్వరూపంలో ఆకాశంలోనికి వెడలగ్రక్కబడినట్లు కల కన్నాను.

జూన్ 23 అనగా మరునటిరోజు మా సామాను మోసేవారితోబాటు హాన్స్ సిద్ధంగా ఉన్నాడు. ఇనుము మొట్లు వేసిన రెండు చేతి కర్రలు, రెండు తుపాకులు, తోటాల బెల్టులు తీసుకున్నాము. హాన్స్ జాగ్రత్త మనిషి. ఎనిమిది రోజులకు కావలసిన నీరు పట్టే ఒక తోలు సీసా తీసుకు వచ్చాడు.

ఉదయం తొమ్మిది గంటలు 'రెక్టర్' ఆయన భార్యవచ్చి తలుపుకు కొంచెం బయటగా నుంచున్నారు. మాకు వీడ్కోలు చెప్తారేమోనని ఎదురు చూశాను. వీడ్కోలు ఒక పెద్ద మొత్తానికి 'బిల్' (Bill) రూపంలో ఇచ్చారు. మేము వారి ఇంట్లో పీల్చిన గాలికి కూడా వెల కట్టినట్లున్నారు—ఉత్త గంద్రగోళపు గాలి అంటాను. స్విట్జర్లాండ్ పూటకూళ్ళ ఇళ్లలో 'క్షవరం' చేసినట్లు చేశారు వారిద్దరూ మాకు. తమ ఆతిథ్యం విలువ మరీ అధికంగా కట్టేశారు.

మా పెదనాన్న బేరం చెయ్యకుండా ఇచ్చుకున్నాడు. భూగర్భంలోనికి వెళ్ళే మనిషి కొన్ని 'రిగ్‌స్ డాలర్' (చిన్న నాణెములు)ల కోసం లెక్కచెయ్యడు.

ఈ వ్యవహారం పూర్తికాగానే హాన్స్ బయలుదేర వచ్చునని సంజ్ఞ చేశాడు. కొంది నిముషాలలో స్టాపీ వదిలివెళ్ళిపోయాము.

## 15

స్నాఫెల్స్ పర్వతం ఎత్తు అయిదువేల అడుగులు. ఈ పర్వతం రెండు శిఖరాలూ ఒక అగ్ని పర్వతాల వరుస చివర ఉంటాయి. మేము బయలుదేరిన చోటునుంచి పై శిఖరాలు కనిపించలేదు. ఒక పెద్ద మంచు కప్పు మాత్రం చూశాను.

ఒకరివెంట ఒకరు నడిచి వెడుతున్నాము. ముందు వేటగాడు, అతని వెంట మేము. కొన్ని బాటలలో ఒక మనిషికంటే పట్టడం అసంభవం. అందుచేత సంభాషణ ఇంచుమించు అసాధ్యం అయిపోయింది.

స్టాపీ 'ఫ్యోర్డ్' అవతల పూరి నేలలు తటస్థమయ్యాయి. వీటినిండా 'పీట్' (Peat) ఉన్నది (నైవేలీలో దొరికే పదార్థం వంటిది—అనువా.) దానిని తగుల బెట్టినట్లయితే ఐస్‌లాండ్ జనులందరూ ఒక శతాబ్దం వరకూ వెచ్చగా ఉండవచ్చు; అంత పీట్ ఉన్నది.

ఒక వైపు ఆదుర్దాగా ఉన్నప్పటికీ, ప్రొఫెసర్ లిడెన్ బ్రోక్ తమ్ముడు కొడుకుని గనుక, ఈ ఖని

ణాల వింతలను కుతూహలంతో పరిశీలించాను. ఐస్‌లాండ్ చరిత్ర మననం చేసుకున్నాను.

ఈ విచిత్ర ద్వీపం 'ఈమధ్యనే' సముద్రంలోనుంచి బయటకు వచ్చిందన్నమాట! ఇప్పుడు కూడా తెలియనంత మందంగా పైకి లేస్తున్నదేమో! ఇది నిజమయితే, దానికి కారణం భూగర్భంలో ఉన్న అగ్ని—హంఫ్రీడేవీ సిద్ధాంతాలు సాక్నుస్సెమ్ పత్రాలు, మా పెదనాన్న ఆశలు అన్నీ మంట గలిసినట్లే. ఈ వూహ నన్ను నేల పరీక్షకు ప్రోత్సహించింది.

ఐస్‌లాండ్ భూభాగం ఎక్కువపాలు అగ్ని పర్వతాల లావా రాళ్ళకు చెందినదే. అగ్ని పర్వతాలకు పూర్వం సముద్రంలోనుంచి పైకి వచ్చిన 'ట్రాప్' (Trap) రాయి నేల ఉండి ఉండాలి. ఒకప్పుడు ద్వీపం మధ్యలో ఒక బ్రహ్మాండమయిన చీలిక ఏర్పడి ఉంటుంది. ఈ చీలిక ఒక పెద్ద లోయ. ఈ లోయలో కరిగిన శిల పదార్థం ప్రవహించి కొండలు, గుట్టలు ఏర్పడి ఉండాలి. క్రిందభాగం ఇంకా పైకి లేస్తూనే ఉండటంచేత కొంత కాలానికి అన్ని పర్వతాలు పైన రాతి కవచం భేదించుకుని వచ్చి ఉంటాయి.

ఐస్‌లాండ్ భూభాగ చరిత్ర ఇది. అంతరాళాలలోఉన్న మహాగ్నులు ఈ పరిణామాలకు దారి తీశాయి. అవి ఇంకా మండకుండా ఆరిపోయినవి అనుకొనటం పెద్ద పొరపాటు. భూగర్భకేంద్రం చేరుకొనగలమనుకొనటం అన్నిటికన్నా పెద్దపొరపాటు!

ఈ విధంగా నన్ను నేనే సమర్థించుకుని ధైర్యం చెప్పుకున్నాను.

దారి క్రమ క్రమంగా కష్టసాధ్యంగా తయారయింది. భూమి మాముందు పైపైకి వెళ్ళిపోతున్నది. మా కాళ్ళక్రింద రాళ్ళు జారిపోతూ ఉండేవి. అప్రమత్తంగా ఉండటంవల్లనే క్రిందకు దొర్లిపడకుండా తప్పించుకొన గలిగాము.

హాన్స్ నింపాదిగా ముందు నడచి వెళ్ళిపోయాడు. చదును ప్రదేశంలో నడుస్తున్నట్లు నడుస్తూ వెళ్ళిపోయాడు. అప్పు డప్పుడు పెద్ద రాళ్ల అవతల మాయమయ్యేవాడు. ఈలవేసి ఎటుపోయాడో సూచించేవాడు. తిరుగు ప్రయాణంలో ఏవైపు రావాలో తెలిసేందుకు రాళ్లతో గుర్తులు పెట్టేవాడు. ఇది తెలివైనపనే. కాని ముందు జరుగబోయ్యే సంఘటనలవల్ల ప్రయోజనంలేదని తెలిసింది.

మూడు గంటలు, విసుగు పుట్టేటట్లు నడిచాము. అయినా కొండ చరియ క్రిందిభాగం వరకే చేరుకున్నాము. హాన్స్ ఆగమని సంజ్ఞలు చేశాడు. అందరం భోజనం కానిచ్చాము. మా పెదనాన్న రెండు వంతులు తిన్నాడు, శీఘ్రంగా నడవటానికి. కాని ఇది భోజనానికేకాక, విశ్రాంతికి కూడా వేసిన మజిలీ కాబట్టి మా గైడ్ ఇష్టం వచ్చినంతసేపు ఆగవలసి వచ్చింది.

స్నాఫెల్స్ కొండ సానువుల ఆరోహణ ప్రారంభించాము. పర్వతాల శిఖరాలు మంచుతో కప్పబడి ఉన్నప్పుడు చాలా దగ్గరగా కనిపిస్తాయి. ఇది ఒక మిథ్య. ఎన్ని గంటల తర్వాత చేరుకొనగలం! అంతలోకే పైపైన ఎంత అలిసిపోతామో! మా పాదాలక్రింద రాళ్ళు ప్రవాహవేగంతో క్రిందకు దొర్లిపోయేవి.

కొన్ని ప్రదేశాలలో కొండ చరియ ముప్పై ఆరు డిగ్రీల వాలుగా ఉండేది. వీటిని ఎక్కటం అసంభవం. చుట్టి వెళ్లటం కష్టమైన పని. ఈ సమయాలలో ఒకరి కొకరు సాయపడేవారము.

మా పెదనాన్న నా దగ్గరే ఉండేవాడని చెప్పవలసినదే. చాలాసార్లు పడిపోకుండా పట్టుకునేవాడు. ఆయన ఎప్పుడూ తడబడేవాడుకాదు. ఐస్ లాండర్ల సంగతి వేరే చెప్పనక్కరలేదు. నేర్పుగా కొండఎక్కి వెళ్ళిపోయేవారు.

---

ప్రఖ్యాత అమెరికన్ కార్టూనిస్టు చార్లెస్ ఏడంస్ తనికపైన రెండు తలల మనుష్యులంటే కార్టూన్‌లు వెయ్యడం ఆపేస్తానని ప్రకటించాడు. ఎందుకని అడగ్గా, "రెండు తలలవారు తిడ్తూ ఉత్తరాలు రాస్తున్నా" రన్నాడు.

ఎం. వి. కె. ఆచారి (వరంగల్)

---

ఈ చరియమీదుగా స్నాఫెల్స్ శిఖరం చేరుకొనటం సాధ్యం కాదనిపించింది. అదృష్టవశాత్తు ఒకగంటసేపు నానా అవస్థలూ పడిన తర్వాత మెట్లవలె సులువుగా ఎక్కేందుకు వీలుగా ఉన్న దారి దొరికింది. రాళ్ళ ప్రవాహం మధ్యలో ఆగిపోతే ఈ విధంగా ఏర్పడుతుంది. దీనినే అయిస్‌లాండ్ దేశంవారు 'స్టినా' (Stina) అంటారు. ఈ ప్రవాహం మధ్యలో ఆగకపోయినట్లయితే సముద్రంలోనికి 'పారి' కొత్త ద్వీపాలు వచ్చేవి.

కాని ఆగిపోయింది. మాకు బాగా ఉపయోగపడింది. తేలికగా ముందుకు సాగిపోయాము.

సాయంత్రం ఏడు గంటలకు రెండువేల అడుగులు ఎక్కాము. ఒక చదర ప్రదేశం ఉన్నది. పర్వత ముఖ ద్వారం దీనిమీదనే 'అనుకుని' ఉన్నదనవచ్చు.

మాకు మూడువేల రెండు వందల అడుగుల క్రింద సముద్రం; మంచు అఖండంగా ఉన్న పరిమితి దాటి వచ్చేశాము. అయిస్‌లాండ్‌లో ఇది క్రిందుగానే ఉంటుంది. విపరీతమైన చలి. గాలి బలంగా వీస్తున్నది. బాగా అలిసిపోయాను. నా కాళ్ళు పనిచెయ్యటం లేదని గ్రహించిన ప్రొఫెసర్‌గారు తన ఉబలాటం అణుకుని విశ్రాంతి తీసుకుందామన్నారు. కాని హాన్స్‌ను ఆగమని సంజ్ఞ చేస్తే అతను ఆగలేదు. తల అడ్డంగా ఆడించాడు.

"ఓఫ్ ఫాన్ ఫేల్" అన్నాడు.

"ఇంకా పైకి వెళ్ళాలిట" అన్నాడు మా పెదనాన్న.

హాన్స్ అవిధంగా ఎందుకు అన్నాడో అడిగాడు.

"మిస్టూర్" అని జవాబు చెప్పాడు మా 'గైడ్'.

"యా మిస్టూర్" అన్నాడు ఒక అయిస్‌లాండర్ భయపడుతూ.

"ఆ మాట కర్థమేమిటి?" అని నేను ఆందోళనగానే అడిగాను.

"అదుగో చూడు!" అన్నాడు మా పెదనాన్న.

క్రిందకు చూశాను. దుమ్ము, రాతిధూళి, ఇసుక ఇవన్నీ కలిసి ఒక పెద్ద స్తంభాకారంలో గాలికిపైకి లేస్తున్నాయి. మేము నుంచునిఉన్న చరియవైపుకు వస్తున్నది. దీనిలోనుంచి సూర్యరశ్మి కూడా చొచ్చుకొని రాలేకపోతున్నది. దాని నీడ పర్వతంమీద పడుతున్నది. చూడటానికి పైకి లేస్తున్న నీటి వూటవలె ఉన్న ఈ స్తంభం గనుక మా వైపుకు వంగినదంటే దాని మధ్యనున్న సుడిగాలిలో చిక్కుకుని పోయేవారము. దీనినే అయిస్‌లాండ్‌లో 'మిస్టూర్' అంటారు. మంచు ప్రవాహాలమీద పెద్దగాలి వీచినప్పుడు ఏర్పడుతుంది.

"హాస్టిగట్! హాస్టిగట్!" అని అరిచాడు మా గైడ్.

హాన్స్ తన వెంట వీలైనంత వేగంగా రమ్మంటున్నాడని తెలియటానికి నాకు డానిష్ భాష రానక్కరలేకపోయింది. ప్రయాణ తగ్గేందుకు వాలుగా పైకి ఎక్కటం ప్రారంభించాము. ముఖద్వారం అంచుచుట్టూ నడిచి వెళ్లాము. మేము అవతలవైపు చేరుకున్నామో లేదో 'మిస్టూర్' పర్వతానికి వచ్చి తగిలింది. కొండ ఆ అఘాతానికి అదిరిపోయింది. రాళ్లవాన కురిసింది. అగ్ని పర్వతమే బ్రద్దలయిందా అన్నట్లుంది. మా గైడ్ చెప్పినట్లు చేసి ఉండకపోయినట్లయితే ఈ పాటికి మా శరీరాలు ముక్కలు ముక్కలయి, దుమ్ముగా మారి, గాలికి ఎగిరిపోయి ఉండేవి.

సురక్షితంగానే ఉన్నా హాన్స్ ఆ రాత్రి అక్కడ గడిపేందుకు వీలు లేదన్నాడు. మరి అయిదు గంటల తర్వాత ఇంకొక పదిహేనువందల అడుగుల ఎత్తు ఎక్కాము. మేము నిజంగా నడిచినది తొమ్మిది మైళ్ళయినా ఉంటుంది. నే నీక సహించలేకపోతున్నాను. పల్చబడిన వాయువు నా వూపిరితిత్తులకు చాలటంలేదు.

కాని ఎలాగయితేనేమి, సాయంత్రం పదకుండు గంటలకు ఇంచుమించు చీకటి పడిన తర్వాత, స్నాఫెల్స్ శిఖరం చేరుకున్నాము. మధ్య రాత్రి సూర్యుడు క్రిందికిదిగిపోయి ఉన్నాడు. నా పాదాలవద్ద నిద్రిస్తున్న ద్వీపంమీద తన తెల్లటి కిరణాలు ప్రసరిస్తున్నాడు. (సశేషం)

ములో కట్టివేసికొందునని జాగ్రత్తము చేయవలె!" అనెను.

లక్కనసూరి చేతిలో నోరు మూసికొనుచు, "ఇదుగో ఇప్పుడే కట్టివేసికొంటున్నాను. అంతే కాదు. మీ నృసింహభట్టు ఎప్పుడు కన్నెర్రజేసి చూసినా, నోరు కట్టివేసు కొంటాను. ఒట్టు." అనెను.

అందరును విద్యానగర సంపన్నులట్లు కూర్పాసాదులు ధరించి హయారూఢులై బయలుదేరిరి. వెనుకటివలెనే పరిచారకులు వారిని మర్యాదగా గోష్ఠీశాలలో డిండిముని సన్నిధికి గొంపోయిరి. డిండిముడు నృసింహభట్టును వెంటనే గుర్తించి ఆదరించి "ఇందరు పెద్దలు దయచేసినారు. వీరిలో శ్రీనాథభట్టు ఎవరు ?" అని సంస్కృతములో ప్రశ్నించెను. దానికి నృసింహభట్టు ఉత్తరమీయకముందే లక్కనసూరి అందుకొని, ప్రాకృత భాషలో డిండిమభట్టును యోగానంద ప్రహసనమును బహువిధముల శ్లాఘించి, తాను ప్రాకృతాది భాషలలో ఏ కొంచెమో పరిశ్రమ చేసితినని, తాతంభట్టు సాంఖ్య న్యాయ వైశేషిక విద్వద్వర్యుడని, పేరిశాస్త్రి ఉభయ మీమాంసా కోవిదుడని, సుబ్రహ్మణ్య శ్రౌతి శ్రౌతములోనిధి యని పరిచయము చేసెను. తన పేరు చెప్పలేదు. శ్రీనాథుడు రాలేదని చెప్పలేదు.

వెనుక దూరమున నుండి శ్రోత్రియ వేషముతో నున్న శ్రీనాథుని డిండిముడు ఒక్కమారే చూచి యున్నందున సరిగా గుర్తుకు రాక, ఒడ్డు పొడుగులను బట్టియు, తన ప్రశ్నకు ఉత్తరమిచ్చుటను బట్టియు, ఇతడే శ్రీనాథుడై యుండవలె నను భ్రాంతిలో నాతడు పడెను. అందుచే ఆతనిపై వెంటనే ప్రతికూల భావ మంకురించెను. దానికి తోడు అతడంతగా ప్రాకృత భాషనే పట్టుదలగా మాట్లాడుచుండుటచే చిరాకు కూడ కలిగినది. అదిగాక డిండిముడు ప్రాకృత భాషలు క్షుణ్ణముగా నేర్చినవాడైనను, ధారాళముగా సంభాషించుట అభ్యాసము చేసియుండలేదు. అందువలన సంస్కృత భాషలో లక్కనసూరి నిట్లు ప్రశ్నించెను : "ఎన్నో ప్రాకృత గ్రంథాలు రచించిన హరిభద్రసూరియే 'బాలస్త్రీ వృద్ధ మూర్ఖాణాం నృణాం చారిత్ర కాంక్షిణామ్, అనుగ్రహార్థం తత్త్వజ్ఞైః సిద్ధాంతః ప్రాకృతః స్మృతః' అని అన్నారే, పండితవర్యా ! ఉత్తమ పురుషుల సంభాషణకు ఉచితమైన సంస్కృత భాషను వదలి, మీరు స్త్రీలకు, మందబుద్ధులకు, పరిచారకులకు, నీచ జనులకు, విదూషకులకు విహితమైన ప్రాకృత భాషలో మాట్లాడుచున్నారేమి ?"

లక్కనసూరి : "అహో తత్ప్రాకృతం హారి ప్రియా వక్త్రేందు సుందరమ్, సూక్తయో యత్ర రాజంతే సుధానిష్యంద నిర్భరాః!" తమరు సెలవిచ్చునది సంస్కృత నాటక మర్యాద. మహాకవులగు కాళిదాస భవభూతులు కూడ వ్యవహారములో ప్రాకృత భాషలోనే సంభాషించుచుండిరనుటకు నిదర్శనములున్నవి. అందువల్ల వ్యవహారమునకు సంస్కృతము పనికిరాదని ప్రాకృతమే అవలంబించుచున్నాను."

# కవిసార్వభౌముడు

27-వ పేజీ తరువాయి

డిండిముడు : "సంస్కృతం స్వర్గిణాం భాషా పైశాచం ప్రాకృతం విదుః !"

లక్కనసూరి : "శ్రీ గురవః ప్రాహుః ! అనుపాసిత సద్గురుకులస్య అజ్ఞాతవాఙ్మయ తత్త్వస్య కస్యాపి ఇదం వచో భవేత్, యుగాదే ప్రథమ పూరుషేణ ప్రప్రథమం మాతృకైవ ఉపదిష్టా. సాచ ప్రాకృత రూపా తతః సంస్కారే కృతే సంస్కృతం జాతమ్, కస్యాపి జ్ఞానలవ దుర్విదగ్ధస్య ఇయం ప్రాకృతనిందా.'—తమరు సెలవిచ్చిన వాక్యానికే ఈ విధంగా హేమచంద్రసూరి కుమారపాల ప్రబంధములో ప్రత్యుత్తర మీయబడినది గదా !"

ఆ మాటలకు డిండిముని ముఖము జేవురించినది. అతడు సదర్పముగా నిట్లనెను : "అవి అప్రామాణికులు అసంస్కృతులు ఐనవారి మాటలు. విద్వజ్జనుల జిహ్వాలలో నటించు సంస్కృతమును ఉజ్జగించి ప్రాకృతాభిమానము చూపుట వారి ప్రాకృత్వమునే ప్రకటించును గదా !"

వెంటనే లక్కనసూరి వినయముతో నిట్లనెను : "అజ్జ—కేవల ప్రాకృతభాషా కవులెందరు లేరు ! ఎందరెందరు మహాకవులు ప్రాకృత మయములైన సట్టకములు వ్రాయలేదు ! ప్రవరసేనుని సేతుబంధమును దండ్యాచార్యులే ప్రస్తుతించిరి గదా. వాక్పతిరాజు రచించిన గౌడవహో (గౌడవధ) కంటె సంస్కృత కావ్యములలో గొప్పవి ఉన్నవా ? హేమచంద్రసూరి సమరా యిచ్చకహా (సమరాదిత్య కథ) బాణభట్టు కాదంబరిని మించినది గదా ! ఇంకా చంద్రప్రభ చరియం, జంబూ చరియం, నేమి చరియం, నారాయణం, పంచమీ కహా, లీలావయీ కహా—ఆహా, ఏమి మధురమైన ప్రాకృత కావ్యాలండీ ! సంస్కృతము పురుష వాక్కువలె పరుషమైనదనీ, ప్రాకృత భాష సహజ మధురమైన యువతిజన వాక్కువలె అమృతమయమనీ పెద్ద లంటారు గదా ! అలంకార శాస్త్రము ప్రవచించేందుకు మాటికి తొంభై పాళ్ళు ప్రాకృత గాథలే ఉదాహరిస్తున్నారు గదా!"

డిండిముడు అడ్డుతగిలి, "మీ వాదము అపూర్వముగా ఉన్నది. మా బోంట్లము దానిని అంగీకరించినప్పుడే కదా, దానికి ఆధారము దొరకుట" అనెను.

లక్కనసూరి మరింత వినయముతో "తమబోటి విద్వద్వరేణ్యులను ఒప్పించు కుతూహలముతోడనే నేనిక్కడికి వచ్చినాను. తమరు అనుగ్రహింపనిచో ప్రాకృత భాషకు దిక్కేమిటి, మరి! కొందరు సంస్కృతభాషా కొందరు ప్రాకృత భాషా మాట్లాడుట సంస్కృత నాటకములలో సంప్రదాయము కనుక చెల్లిపోతున్నది. ఒకటి చిత్తగించండి. సత్యము విచారిస్తే అందులోని అనౌచిత్యమూ, అసందర్భమూ తమరు తప్పక ఒప్పుకొంటారు. శ్రీరాముడు సంస్కృతములో భాషిస్తూ ఉంటే, పూజ్యురాండ్రగు కౌసల్యామాతా సీతా మహాదేవీ ఆ భాష అవగాహన చేసుకొనియే ప్రాకృతంలో మాట్లాడుతున్నారనుకొందాము. కాని అపండితులైన చేటీచేట విదూషకాదులకు సంస్కృతము ఎట్లా అర్థమైనట్లు ? ఒకరొక భాషలోనూ, ఇంకొకరు ఇంకొక భాషలోనూ పరస్పర సంభాషణము జరపడము ఎంత అసందర్భముగా ఉంటుంది ! ఎంత అనుచితము !" అనెను.

నృసింహభట్టు అందుకొని నవ్వుచు "మీరిప్పుడు ప్రాకృతములోను, డిండిమ భట్టారకులు సంస్కృతములోను మాట్లాడుచున్నారు గదా ! ఒకరి మాటలు ఒకరికి అర్థమవుచున్నవి గదా ! సందర్భశుద్ధి తప్పుటలేదే !—సంస్కృత నాటక భాషా మర్యాద కూడా అటువంటిదే అనుకోరాదా ?" అనెను. ఈ మాట లాతడు చమత్కారార్థము కొంత ప్రాకృతములోను, కొంత సంస్కృతములోను మాట్లాడి అందరిని నవ్వించెను.

వెంటనే లక్కనసూరి కొంచెము ఆవేశముతో నిట్లనెను : "ఇప్పుడు నృసింహభట్ల సంస్కృత ప్రాకృత భాషా మిశ్రితవాక్కులు మిమ్ములను నవ్వింపలేదా ! అట్లాగే మాబోంట్లకు సంస్కృత నాటకములలోని భాషల కలగాపులగము హాస్యాస్పదంగా ఉంటుంది! అందుకే జయవల్లభుడు వజ్జాలగ్గము అనే కావ్యాలంకార గ్రంథంలో ఇట్లా అన్నాడు : 'పాయియ కవ్వస్స నమో పాయియ కవ్వంచ నిమ్మియంజేణ, తాహం చియపణమామో పఢిఊణ యజే విజాణంతి. పాయియ కవ్వాలావే పడివయణం సక్కయేణ జోదేయి, సోకుసుమ సత్థరం పత్థరేణ అబుహో వీణాసేయి, ఉజ్జ ఉసక్కయ కవ్వం సక్కయకవ్వం చ నిమ్మియం జేణ, వంసహరం వ పలిత్తం తడయడ తడ్డత్తణం కుణయి! [ప్రాకృత కావ్యమునకు ప్రాకృత కావ్యనిర్మాతకు నమస్కారము. దానిని చదివి తెలుసుకొనువారికి గూడ ప్రణామము చేయుచున్నాము. ప్రాకృతకావ్యాలాపమందు సంస్కృతమున ప్రతివచన మొసగువాడు అబుధుడు, కుసుమ ప్రస్తర

---

"డాక్టరుగారూ నాకు మంచి మందివ్వండి! తొంభై సంవత్సరాలు నిండినా ఆడపిల్లలను చూస్తే తరమ బుద్ధేస్తోంది!" అని వాపోయాడొక పెద్దమనిషి.

"దానికేముంది. ఇంకా కనీసం, ఇరవైయేళ్ళు బ్రతుకుతారన్నమాట," అని డాక్టరుగారు ఓదార్చాడు.

"అవుననుకోండిగాని ఎందుకు తరుముదామనిపిస్తుందో జ్ఞాపకం రావడంలేదు!"

యం. యస్. రాజారావు (మద్రాసు)

---

మును (కుసుమశయ్యను) ప్రస్తరముతో (రాతితో) వినాశనము చేయునట్టివాడు. పండుచున్న పెదుళ్ల ఇంటిని వలె సంస్కృత కావ్యమును సంస్కృత కావ్య నిర్మాతను వదలిపెట్టవలెను. అది తడతడ తట్టధ్వని చేయును.—] అందుకే హాలశాత వాహన ప్రభువు ఇట్లా అన్నాడు :

అమియం పాఉయ కవ్వం పడి ఉంటో ఉంచపేఆ అణంతి కామస్స తత్త తంతిం కణంతికే కహాణ లజ్జంతి! [ ప్రాకృత కావ్యము అమృతము. దానిని పఠించుట ఎరుగనివారు కామతంత్రము నెట్లు చేయుగలరు. ఎట్లు సిగ్గుపడగలరు !] అందువల్లనే పలువు రాచార్యులు కేవల ప్రాకృతమునే అవలంబించి గద్యపద్యకావ్యాలు పట్టి కాలురచించినారు. తను తిందుకునమ్మతింతు రనుకొందును !"

డిండిమునకు ఆగ్రహము పెరుగుచుండెను. వీమని ప్రత్యుత్తర మీయవలెనో తోపక వికృత ముగగా పకపక నవ్వుచు, "మీ వాదము మీ బుద్ధి సూక్ష్మతను సూచించుచున్నది. అదంతయు సంస్కృతమునకే వినియోగించినచో ఎంత రాణించి యుండును. అయినను మీతో వచ్చిన ఈ పండిత వరేణ్యు లందరు ఏమందురో విందము" అనెను.

నృసింహభట్టు అందుకొని "అర్యా, నా రెప్పు టును ఇంతే. ఎప్పుడును మాతో ఇదే గొడవ. వక్రమైన పంథ కననములో గనుక ఏ భాష అయినా చెల్లిపోయినది గాని మనకు శాస్త్ర చర్చలలో ప్రాకృతముతో అడుగు సాగునా ! ఈ ప్రాకృతాలకు ఏదో నామమాత్రమునకే గాని సరియైన వ్యాకరణమే లేదు. నోటికి వచ్చినట్లు ప్రేలి 'అష్టాదశ భాషలలోనిది కూడా కాదు. మరొక దేశభాష' అనవచ్చును. దాని పేరే ప్రాకృతము— అపభ్రంశము, పైశాచి ! కువలయమాలా కథలో గొల్లభాష, ఉక్కభాష [ఉత్కళ దేశభాష— గాద భట్టును ఎత్తిపొడుపు] ఫారసీ భాష కూడా చేర్చినాడు ! — ఇట్టి ప్రాకృతానికీ వేదార్థము కాపాడుచున్న మునిత్రయ వ్యాకరణ మున్న సంస్కృత భాషకు సాపత్య మేమిటి !" అనెను.

అప్పుడు తాతంభట్టు కల్పించుకొని యిట్లనెను: "ఏదో కవిగాళ్లకు కాబట్టి ఉక్తి విశేషమే కావ్యము, భాష ఏదైన నవుగాక, అను మాటలు చెల్లిపోయిన చెల్లిపోవచ్చుగాక ! మాకు కూడ వ్యాకరణశాస్త్ర మున్నదని ఈ ప్రాకృతులు వ్యాకరణాభాసమైన చూపించగలుగుదురు గాక ! మన న్యాయశాస్త్ర విచారణము ప్రాకృత భాషలో అడుగు కదల గలదా !—ఇంత ప్రాకృతాభిమానము గల మన మిత వీరి ప్రాకృతములో సరిగా ఒక్క లక్షణము చెప్ప గలుగు నేమో అడుగుదము. దీనిని ప్రాకృత భాషలో ఎట్లు చెప్పగలడు ?—" ఇట్లనుచు న్యాయశాస్త్ర పరిభాషలో విచారణ మారంభించెను.

డిండిమభట్టు ప్రాకృత సూరి వితండవాదము నుండి బయటపడి ఆనందముతో తాతంభట్టుతో న్యాయశాస్త్ర విచారణలోనికి దిగెను. వా రిద్దరు చాలసేపు గౌతముని న్యాయ సూత్రములను, అందుపైన వాత్స్యాయన నామాంతరము గల పక్షిలస్వామి రచించిన భాష్యమును, దానిపై బౌద్ధ దిఙ్నాగులు చేసిన ఖండనములను ఉద్యోతకారు లెట్లు ఖండించినదియు, దానిని మరల ధర్మ కీర్తి యను బౌద్ధాచార్యులు ఖండింపగా శ్రీధరా చార్యులు న్యాయశాస్త్ర గౌరవము నెట్లు ప్రతిష్ఠించి నదియు, ఆ తర్వాత వాచస్పతి మిశ్రులు తమ వార్తిక తాత్పర్య టీకలోను, అందుపై ఉదయ నాచార్యులు తాత్పర్య పరిశుద్ధిలోను కిరణావళి లోను న్యాయశాస్త్రము నాస్తికదర్శనము కాదని సిద్ధాంతీకరించుటయు—ఇత్యాది విషయముల గూర్చి ప్రశంసలు చేసికొనుచు మధ్య మధ్య వైశేషిక మును సాంఖ్యమును గూర్చియు ప్రస్తావించు కొనిరి. ఇద్దరును గంగేశోపాధ్యాయుని తత్త్వ చింతామణి పేరెత్తలేదు. తాతంభట్టు న్యాయ శాస్త్ర పాండిత్యమునకు డిండిమభట్టు అద్భుత మంది "కొండవీటి రాజ్యములో మీబోటి నైయా యికు లెందరున్నారు ?" అని ప్రశ్నించెను. "జబ్బై యిద్దరు లెక్క తేలినా" రని తాతం భట్టు చెప్పగా విని డిండిముడు తెల్లవోయి, అప్పుడు గంగేశోపాధ్యాయుల తత్త్వచింతామణి పేరెత్తెను. తాతంభట్టు దాని యతిశయమును శ్లాఘించి తాను దానిపై 'దీధితి' యను వివ రణ గ్రంథము వ్రాయుచున్నా ననెను. దీధితిలో నక్కడక్కడ విషయములు తెలిసికొని డిండిము డందుపై పూర్వపక్షము నారంభించెను. తాతం భట్టు వెంటనే వానిని ముక్కలు ముక్కలుగా ఖండించి తన ప్రతిభ ప్రకటించెను.

నృసింహభట్టు డిండిములను శాంతింపజేయ నెంచి పతంజలి మహాభాష్యాతిశయములోనికి సంభా షణము దింపుచుండెను. తాతంభట్టు వదలక న్యాయశాస్త్రములోనికే లాగుచుండెను.

పేరిశాస్త్రి ముక్కోపి. అతడు పూర్వోత్తర మీమాంసలు చక్కగా నధ్యయనము చేసినవాడు, ధర్మనిష్ఠ దగుటచే జంకుకొంకులు లేనివాడు. అత డింతసేపును మౌనముగా నుండెను. మీమాంసా శాస్త్రము సాంఖ్య న్యాయ వైశేషికములను ఖండించుటకే కాదు. వ్యాకరణశాస్త్రమునకు లేని గొప్పలు ఆరోపించుట సమంజసము కాదని కుమారిలభట్టు తన తంత్రవార్తికములో సిద్ధాంతము చేసియుండెను. అందుచే వినివిని విసుగు చెంది అతడు పర్వతము చాటున నుండి ఆకస్మిక ముగా పైబడి నెలరేగెడి తుపాను గాలివలె ఒక్క సారిగా అందరిపైన విరుచుకొని పడెను.

"అబ్బబ్బ, మా ఆంధ్రదేశము అవైదికము లైన ఈ సాంఖ్య న్యాయ వైశేషికములతో పాడై పోవుచున్నది. అవి దర్శనము లట ! మరీ ఈమధ్య హరిమిశ్రులు మా దేశములో ఉండిపోయి నప్పటి నుండి ఈ న్యాయశాస్త్రపు వెర్రి మితిమీరు చున్నది. అది పైగా నవీన న్యాయమట ! పూర్వ మీమాంసా శాస్త్రమునకే కాని 'న్యాయము' అను పదము ఈ కుతర్కమునకు చెల్లుబాటు కాగలదా? ఈ తర్కశాస్త్రముపై నభిమాన మెక్కువగుట చేత మా ఆంధ్రదేశము త్వరలో సృగాలములతో నిండిపోవునేమో యని మాబోంట్లము భయ పడు చున్నాము. శ్రీ విద్యారణ్యులు ప్రతిష్ఠాపించిన శ్రీ విద్యానగర రాజ్యములోనికి గూడ ఈ పాపము ప్రాకినదా, హరిహరి !" అనుచు నతడు చెవులు మూసికొనెను. (కేవల తర్కశాస్త్రము చదువుకొనిన వారు ఉత్తరజన్మలో నక్కలై పుట్టుదురని ప్రతీ కలదు. అందువలన తర్కశాస్త్రాధ్యయనము పూర్తి చేసినవారు పిదప కొంచెమైనను వేదాంతశాస్త్రాధ్యయ నము తప్పక చేయుట నేటికిని సదాచారము.)

ఆ మాటలకు డిండిముడు త్రుళ్లిపడెను. ఆయనకు అభిమానపాత్రములైన శాస్త్రములని నిట్లు తృణీకరించుట గుండెలలో గాలము వలె ప్రవేశించినది. వెంటనే ఏమి జవాబు చెప్పను తోచక వెకిలి నవ్వు నవ్వుచు, "మీతో వచ్చిన నృసింహభట్టు తాతంభట్టులే మీకు సదుత్తర మీయగలరు" అని వూరకుండెను.

నృసింహభట్టు : "కుమారిలభట్టు చేసిన



వ్యాకరణాశిక్షైనను ప్రత్యేక ప్రతిభాబలమును ఉద్దీపింపచేసినది. అంతేకాని ఆయన వ్యాకరణశాస్త్రమును త్రోసివేయ మనలేదు."

**తాతంభట్టు :** "శ్రీ విద్యాశంకరులు తమ శారీరక మీమాంసలో న్యాయ సాంఖ్య వైశేషికములనే కాక పూర్వమీమాంసకులను గూడ ఖండించినారు. పరమార్థ విషయములో నది చెల్లునే కాని, వారు జైమినీయమును పూర్తిగా కాదనిరా ?—మీ పూర్వమీమాంసను ఉత్తరమీమాంసను బౌద్ధులు, జైనులు ఖండించునప్పుడు మా న్యాయశాస్త్రమే మీకు శరణ్యము. మీకే ఏమి, ఆ జగన్నాథస్వామికే న్యాయశాస్త్రము శరణ్యము. ఉదయనాచార్యులు తీర్థయాత్రలో జగన్నాథస్వామిని దర్శింపబోగా, తలుపులు మూసియుండెను. ఆచార్యులు కోపించి,

'ఐశ్వర్య మదమత్తోసి మా మవజ్ఞాయ వర్తసే
ఉపస్థితేషు బౌద్ధేషు మదధీనా తవ స్థితిః.'

(ఐశ్వర్య మదమత్తుడవై నన్నవజ్ఞ చేసి వర్తించుచున్నావు. బౌద్ధులు వచ్చినప్పుడు నీ స్థితియే నా చేతిలో నుండును.) అన్నంతనే తలుపులు తెరుచుకొనలేదా !"

పేరిశాస్త్రి ధిక్కరించుచు, "పరమార్థమునకు విరుద్ధమైన సిద్ధాంతములు కలవి న్యాయ సాంఖ్య వైశేషికములు. పూర్వమీమాంస పరమార్థమునకు సాధనమైనది. ఇక వ్యాకరణ శాస్త్రాన్ని గూర్చి "ఏవం చా వేద మూలత్వా న్నధర్మ నియమార్థతా, యుక్తాశబ్దస్మృతే ర్వక్తుం నచాస్యాః శాస్త్రతా స్వయమ్" అని దానికి శాస్త్రత్వమే లేదని, వేదసిద్ధములైన శబ్దములకు లక్షణము వృథా యనియు, అవసరమైనంతవరకు సామవేద మందే లక్షణ మున్నదనీ,

'అధ్యాయిభిరేవాతో వేదః కార్త్స్న్యేన రక్ష్యతే
స్వరాక్షర వినష్టోపి ద్వేషి దన్యైర్న లుప్యతే
అప్రత్యక్షై రుపాధ్యాయై ర్లిఖితై ర్వ్యాకరణాదిభిః
న విహారాయితుం వేదో లభ్యతే తేన రక్ష్యతే.'

అనీ, శ్రుతుకోటిలోనివారైన వైయాకరణులచే వేదరక్ష ఎంతమాత్రము జరుగదనీ, కుమారిలభట్టు సిద్ధాంతీకరించినారు. ఈ సుబ్రహ్మణ్యశాస్త్రి వంటి వేదవిదులు వేదరక్ష చేయువారు. అంతే కాని వైయాకరణులు లెంతమాత్రము కారు. పదవాక్య ప్రమాణపారీణులగు శ్రీ విద్యాశంకరులు దిగ్విజయము చేయుటకు న్యాయపరిభాష వాడినారా ? వారి భాష్యములలో ఈ తర్కపు పడికట్లు ఉన్నవా ? అందువల్ల వారి వాదమునకు బలమేమైన తగ్గినదా ?—"

గౌడ డిండిముడు కుమారిలభట్టు విద్యాశంకరుల నామము లెత్తినంతనే వారికి భక్తితో నమస్కరించి, "వారి కాలములలో సంగతి సందర్భములు వేరు. అప్పుడు ఈ న్యాయ పరిష్కార పద్ధతి వాడుకలో లేదు. ఇప్పుడో, ఇతర మతముల కుతర్కములు —నన్నిటిని ఖండించుటకు న్యాయశాస్త్రమే శరణ్యము !" అనెను. తాతంభట్టు వాదువాద మొనర్చెను. సుబ్రహ్మణ్యశాస్త్రియు పేరిశాస్త్రియు ఏమో మాటాడ బోవుచుండిరి.

అప్పటికే చాలసేపటి నుండియు డిండిముని విద్యార్థులు న్యాయశాస్త్ర పాఠమునకై వేచియుండిరి. అందువలన డిండిముడు సగౌరవముగా నిట్లనెను : "మీబోటి విద్వాంసుల రాక మాకెంతయు ఆనందము కలిగించినది. ఆవల విద్యార్థులు పాఠమునకై వేచియున్నారు — ప్రత్యేకముగా మాతో మీకేమైన పని యున్నదా ?"

అందరును ఉన్నదని తలలూపుచుండ, నృసింహభట్టు అందుకొని "మరేమి లేదు. గతవారము మా మిత్రులు శ్రీనాథుల మానసోల్లాసముపై తమ అభిప్రాయమును తమరు సూచించు వివరణలను నేను గ్రహించి వారి కందిచ్చుటకు వత్తునంటినిగదా ! ఆ పనిమీదనే వచ్చితిని. దయచేసి సెలవిత్తురా ?" అనెను.

లక్కనసూరి ఇట్లందుకొనెను : "దుఃఖం

---

అప్పల నరసింహం గారు రోజంతా గాలం పట్టుకుని కూర్చున్నా ఒక చేపకూడా తగల్లేదు. ఆయన ప్రక్కనే మరోక పెద్దమనిషి చూస్తూ కూర్చున్నాడు. అ.న. గారికి విసుగు పుట్టి, "అలా చూస్తూ ఊరకునే కంటే ఒక గాలం తెచ్చుకోరాదూ?" అన్నాడు

"అబ్బే, చేపలు పట్టుకుంటూ కూర్చోటానికి నాకు టైమేదీ!" అన్నాడా ప్రేక్షకుడు.

టి. విల్సన్ (గెంటుచింతల)

---

కరలు కవ్వం, కవ్వమ్మి కియే పయుంజాణా దుఖ్ఖం, పంతే పయుంజమాణే సోయారో దుల్లహా హొంతి (కావ్యరచన దుఃఖము (తో కూడుకున్నది). కావ్యరచన పిమ్మట దాని ప్రయోగము దుఃఖము. ఒకవేళ ప్రయోగించినా శ్రోతలు దుర్లభు లవుతారు.)"

నృసింహభట్టు కోపవీక్షణము చూచి ఆకస్మికముగా లక్కనసూరి మధ్యలో ఆగిపోయెను.

డిండిమభట్టు లక్కనసూరి ప్రాకృతములో చిటుచిట లాడుచుండెను. అతడు వినిపించుకొనని వానివలె నృసింహభట్టు వైపు తిరిగి "భట్టారకా, మీ రడిగినప్పుడు ఎట్లు కాదనగలను ! మీ రిచ్చి వెళ్లిన కోశము ఇంతవరకు విప్పి చూడనే లేదు. అదుగో, మీరే తీసి అప్పుడు విన్నవి కాక మరి పది పదిహేను శ్లోకాలు వినిపించండి, మా అభిప్రాయము తెలుపుదును" అనెను.

నృసింహభట్టు సగౌరవముగా కోశము గ్రహించి తన స్వచ్ఛమైన కంఠముతో సంగీతము కలిపి పాతిక శ్లోకములు వినిపించెను. ఈమారు కూడ డిండిమభట్టు శ్రద్ధగా ఆలకింపలేదు. విని విని విసిగి "భట్జోజీ, మీబోంట్లు ఇది చదువుట కాని, మా బోంట్లము ఇది ఆలకించుట గాని వృథా కాలవ్యయము. మరి మరి మా యభిప్రాయము అర్థించుచున్నారు గనుక చెప్పుచున్నాము—ఈ మానసోల్లాసము తప్పులతడక, బూతులబుంగ, తుచ్ఛ కావ్యము. దిద్దుటకు కూడా సాధ్యముకానన్ని దోషములున్నవి. దోషప్రకరణ మంతటికి ఉదాహరణప్రాయమైన దీ గ్రంథము—అని మా నిశ్చితాభిప్రాయ మని వారికి చెప్పుడు. దయచేసి యిక ముందు మీరు మావద్ద ఈ గ్రంథ ప్రస్తావము తేవద్దు !" అని నిష్కర్షగా చెప్పెను.

నృసింహభట్టు "చిత్తము. శ్రీనాథభట్టుకు తమ యభిప్రాయము చేరవేసెదను" అనుచు కోశము మరల యథాస్థానమున అలమరలో పెట్టి సెలవు తీసికొని తక్కిన పండితులతో వెడలిపోయెను.

ఆనాటి సాయంకాలము డిండిమభట్టు న్యాయపాఠ మెక్కువ సాగలేదు. తన విద్యార్థులతో మధ్యమధ్య "ఆంధ్రదేశములో గూడ కొంత కొంత న్యాయ వ్యాకరణ శాస్త్రములు అధ్యయనము చేసినవారు కొంతమంది ఉన్నట్లున్నారు. కాని అందరును చిత్రమైన వ్యక్తులు. ఒకరితో ఒకరికి తలకూడదు" అనుచు ప్రస్తావవశమున పలుకుచుండెను.

పాఠమైన పిమ్మట శిష్యులు ఆ మానసోల్లాసము ఎట్లుండునో తమ కన్నులతో చూచి చదువవలె నను కుతూహలము ప్రకటించిరి. డిండిమభట్టు ఎఱ్ఱవడ్డ ముఖముతో 'దానితో వృథా కాలవ్యయము చేయువద్దు !" అని నిషేధించుటచే వారాకోశము స్పృశింప సాహసింపకయే వెళ్లిపోయిరి.

ఆ రాత్రి డిండిమపత్ని గౌరిదేవి మాటిమాటికి నిదురలో నులికిపడి లేచుచు "అయ్యో, మన యింటిలో కాలసర్ప మేదో ప్రవేశించినది. శోధించండి !" అని వలువరింపసాగెను. ఆమె నా రాత్రి శాంతింపజేయుట యింటిలోనివా రందరికి కష్టతర మయ్యెను.

తెల్లవారిన పిమ్మట గృహబాహ్యాభ్యంతరములలో పరిచారకులును, బంధువులును ఇరుగు పొరుగుల వారును మూల మూలల గాలించి వెదకిరి. ఎక్కడను సర్పము తిరుగాడిన జాడలు గాని, అది విడిచిన కుబుసపు గుర్తులు గాని, ఏమియు కనిపింపలేదు.

గృహ పురోహితుని, జ్యోతిష్కుని పిలిపించి ఈ విపరీతమే మని విచారించిరి. వా రిద్దరు వాలోచించి 'ఉగ్రరథుడు కాలస్వరూపుడు. మీరు శీఘ్రమే ఉగ్రరథ శాంతి చేసికొనుడు అని సలహా యిచ్చిరి.

గౌరిదేవి కూడ కుమారుని రాకకై కలవరింప సాగెను. (సశేషం)

# కాల్పనికజగత్తులో పరకీట్నాలు

25—వ పేజీ తరువాయి



నాన్నా! మా పవిత్ర ప్రేమకి నీ ఆశీర్వాదం ఉంటే చాలు" అన్నాను. అప్పుడేమన్నాడో తెలుసా—"నాకు ఇష్టంలేనిపెళ్ళి నాకొడుకు చేసుకునేకన్న అవమానం నాకింకేముంది కనక—నువ్వు మంగళసూత్రం కట్టిన మరుక్షణంనుంచి నేను ప్రాయోపవేశం చేస్తాను. వచ్చి మంచి నీళ్ళు ముట్టను. ప్రేమకోసం తండ్రిని చంపిన ఘనత కూడా నీకు దక్కుతుంది" అంటూ, కంట తడిపెట్టాడు మా నాన్న. మా నాన్న కంట నీరు నేను ఎప్పుడూ చూడకపోవడంతో నా గుండె పగిలిపోయింది......అయినా నా సరోజని అన్యాయం చేయకూడదన్న నిర్ణయం నన్నాపింది. ఇక మా అమ్మ "నువ్వు ఆ అమ్మాయిని కట్టుకున్న క్షణాన తాగేందుకు దొరుకుతుంది, దొరక్కపోతుందని ఇప్పుడే తెప్పించి అట్టే పెట్టుకున్నానురా తండ్రీ" అంటూ విషం సీసా చూపించింది.

"స్థంభించిపోయాను. ఒక్క వివాహంతో ప్రేమగా పెంచి, పెద్ద చేసిన తల్లి, తండ్రి నాకు దూరం అయిపోతారు.....శాశ్వతంగా" అని కాసేపాగి బరువుగా శ్వాస విడిచి, "అయినా సరోజా—నేను మాత్రం కర్తవ్యానికి కట్టుబడతాను. నిన్ను అన్యాయం చేయను. చివరికి తల్లి తండ్రి నయినా"

కెవ్వుమంది సరోజ!

తన వూహ కందని త్యాగం చేయటానికి సిద్ధంగా ఉన్నాడు తన వేణు—తన కోసం. మరి అతనికోసం తనేం చేస్తోంది? తన స్వార్థంకోసం అతన్ని సర్వనాశనం చేయబూనుకుంది—అతని తలితండ్రుల్ని పొట్టపెట్టుకునేది......తను మాత్రం త్యాగం చేయలేదూ? తను అతని జీవితంలోంచి తొలిగిపోతే అతని జీవితం సుఖమయం అవుతుంది. అదే తన కర్తవ్యం!

ఒక దృఢ నిశ్చయానికి వచ్చి, తృప్తిగా నవ్వింది సరోజ.

"పిచ్చివేణూ! నా కోసం ఎంత త్యాగానికి సిద్ధపడ్డావు? అంత త్యాగానికి అర్హురాల్ని కాదు గోపాల్! చాలు. నువ్వు నాతో అన్నమాటలే చాలు నాకు" అంది.

"అదేమిటి సరోజా, మరి నీ జీవితం ఏమవుతుంది?" బిరుగ్గా అడిగాడు.

మౌనంగా నవ్వి, విరిగి పడుతున్న అలల్ని చూపెట్టింది!

అది అతను చూస్తే అర్థమయేదేకాని అతని మనస్సప్పుడే ఆనందంతో ఉరకలు వేస్తూండటం వలన ఆ అలలు అతని కంటికి ఆనలేదు. ఇంత తేలిగ్గా ఈ వ్యవహారం ముగుస్తుందనుకోలేదు. దమ్మిడీ ఖర్చు లేకుండా నేను బయట పడ్డానంటే నాన్న ఎంత మెచ్చుకుంటాడు?......గుడ్ హెవెన్స్—నలభయి వేలు హార్డ్ కాష్! వ్వాట్టు డూ?" నవ్వుకున్నాడు మనస్సులో.

సరోజ ఏమయిందన్నమాట అప్రస్తుతం. కాని వేణు కూడా ఒక పెల్లి కన్ను అమ్మాయితో తిరుగుతాడని మాత్రం మనం అనుకోవటం పొరబాటు. అమ్మాయి అరణంగా పట్టుకొచ్చిన బ్యూక్ కారులో మట్టుకు కనబడతాడు. అతని పక్కన ఎవరుంటారన్న విషయం అతనే చెప్ప లేడు!

వాస్తవికతకి దగ్గరలో చేసే రచన :—

స్నేహితురాళ్ళతో కమ్మని కబుర్లతో కాలం గడిపి, తీయని వూహాల పల్లకీ ఎక్కి ఇంటిముందు కొగిన పార్వతి లోపలనుంచి అమ్మ మాట విని అప్రయత్నంగా ఆగిపోయింది. అది తన పెళ్ళి విషయమే అవటాన అలాగే గోడకి చేరబడి విన సాగింది.

"ఏదో కాడికి జత వర్చుకుని దిగాలికాని తూగలేం తూగలేం అనుకుంటూ కూర్చుంటే ఇంకెన్నాళ్ళండీ? ఎదిగిన కూతురు తల్లికి గొమ్ములమీది కుంపటి లాంటిది. ఏ అమ్మ నోరెత్తినా "పిల్లకి ఈ ఏడన్నా



పెళ్ళి చేస్తారా ఒదినా" అని అడుగుతుంటే చెప్పలేక చస్తున్నాను."

" ఎవరో అంటున్నారని మనకి బాధ ఎందుకే? ఆరోజు రావాలిగాని...."అంటూ నాన్నేశారు గుమాస్తా రావుగారు.

"ఆ, రావాలి! ఇలాగే రావాలి అంటూ కూర్చుని అవతలవాళ్ళు అంటున్నారంటే అనరూ మరి? ఇంకొకర్ని గురించి మనం అన్నట్టే మన్ని గురించి లోకం అనుకుంటోంది అయినా—ఎదిగిన పిల్ల! దానికిమట్టుకు కోర్కెలు ఉండవూ!"

"అయితే ఏం చేయమంటావు నన్ను!" అన్నాడాయన—ఇన్నాళ్ళుగా వాయిదా వేస్తూ వచ్చిన ఈ ప్రసక్తి ఇక ఆగదని గ్రహించి.

"వాళ్ళు అడిగింది నాలుగు వేలు. బి. ఏ. దాకా చదవాడన్నారు కదా! రేపు సెప్టెంబరులో పాసవుతాడనే అనుకుందాం. కుర్రాడి వాటాకి రెండెకరాలు వస్తుంది. ఇంతకన్న మనకి అందుబాటులోకి మంచివి రావు. దానికి కూడా ఆ అబ్బాయి నచ్చాడుట. కాబట్టి ఖాయపరచండి!"

"డబ్బు?"

"ఇల్లు తాకట్టు పెట్టండి. ఇక్కడికి ఈ అక్కర తీరుతుంది. రెండవ దానికి ఇంకా అయిదేళ్ళదాకా భయంలేదు. ఈ లోపల మీ రెక్కలు చల్లగాఉండి దేముడు దయతలచాలేగాని......

పార్వతిగుండె గుభేలుమంది. ఉన్న ఆ ఒక్క ఇల్లు తాకట్టు పెడితే నాన్న మళ్ళీ ఈ జన్మలో తీర్చగలడా? తీర్చకపోగా ఆ ఒక్క ఆధారం పోతే తమ్ముళ్ళు, చెల్లెళ్ళు వీళ్ళంతా ఏమవుతారు? తన సుఖంకోసం కుటుంబాన్ని నాశనం చేసినదవుతుంది తను......

ఒక్క అంగలో ఇంట్లోకి వెళ్ళింది. "మీరు ఇల్లు తాకట్టు పెట్టి చేస్తే నాకీ పెళ్ళి వద్దు. అసలు పెళ్ళే చేసుకోను. ఎక్కడయినా ఉద్యోగం చేసుకుంటాను. ఇల్లు తాకట్టుపెట్టేముందు నన్ను చంపి ఆ పని చేయండి" అంది దృఢంగా.

తల్లి, తండ్రి దిగ్భ్రాంతులయారు.

# కాల్పనికజగత్తులో వరకట్నాలు

ఇంతవరకూ వచ్చాక—రచయిత బొత్తిగా అకా వాది, నవీన భావాలు కలవాడయితే....

అమ్మాయి ఉద్యోగం చేసేందుకు వాళ్ళు ఒప్పు కున్నట్లు, ఆవిడ ఖద్దరు చీర కట్టుకుని ఉద్యోగం చేస్తున్నట్లు, అదే ఆఫీసులో అలాగా కేవలం ఆద ర్శాలకోసం చేరిన ఒక వాసు లేక మరో మురళి ఈ పార్వతిని చూసి ఆదర్శ వివాహం చేసుకున్నట్లు రాసి మంగళం మహత్ అని చేతులు దులుపుకుంటాడు.

మధ్యరకం అయితే—నాన్నా వాళ్ళు ఒప్పుకో లేదని, వాళ్ళని ఒప్పించడం తన తరం కాదని గ్రహించిన పార్వతి రాత్రిపూట దూర బంధువుల ఇంటికి పారిపోయి అక్కడే ఉంటూ, వాళ్ళ ఇంటి పక్కనఉన్న యువకుడిని వివాహమాడి ఇద్దరూ కలిసి తిరిగి ఇంటికి వచ్చి "దీవించండి నాన్నా" అని దణ్ణం పెట్టించవచ్చు.

ఇక జీవితంలో బాగా దెబ్బలు తిన్న మనిషయితే తల్లి తండ్రీ ఒప్పుకోకపోగా వాళ్ళని శాసనం చేయడం ఇష్టంలేని పార్వతి రాత్రికి రాత్రి ఒక ఉత్తరం రాసి బావిలో దూకేస్తుంది. ఆ ఉత్తరంలో రచయితకి సంఘంమీద, "వరకట్న పిశాచి" మీదా ఉన్న కోపం అంతా బయటపెట్టి వాటిని దుమ్మెత్తిపోస్తుంది.

ఉప సంహారం :—

ఇన్ని విధాల సినీ రచయితలకి, కథా రచయితలకి తోడ్పడుతూ వచ్చిన వరకట్నం మన సాహిత్యానికి ఎనలేని సేవ చేసింది. వనితాలోకాల్లో చర్చా వేదికల్ని లేవదీసింది. అటువంటిదాన్ని ప్రభుత్వం నిషేధిం చడం నా మట్టుకు నాకు బొత్తిగా నచ్చలేదు. దీని వలన వరకట్నం పోకపోగా అవి ఉన్నట్లు పత్నిక్కన చెప్పే వీలులేదు కాబట్టి కథలు రాసే అన్నదాదులకు బోలెడు దెబ్బ. కథ మధ్యలోకి వచ్చి, ఎటు తిరగడమూ అని తటపటాయిస్తున్నప్పుడు వరకట్నం అన్నది వచ్చి ఆప్తుడైన మిత్రుడిలా ఆదుకుని కథని చకచకా మళ్ళించేసి గాడిలోకి దింపేస్తుంది.

అప్రస్తుతం అయినా స్వవిషయం కూడా మనవి చేసి ముగిస్తాను—

"వరకట్న నిషేధం బిల్లు పాసయి జూను ఫస్టు నుండి అమలులోకి వస్తుంది కాబట్టి ఈ లోగానే ఎక్కడయినా సంబంధంచూసి బజానా తీసుకుని తాంబూలాలు పుచ్చుకో—తరవాత వాళ్లే తన్నుకు చస్తారు" అని మిత్రులు, హితైషులు సలహా లిచ్చారు నాకు.

ప్రయత్నించాను కాని కలిసి రాలేదు. బిల్లు వస్తోందని తెలిసి వాళ్ళూ రేట్లు తగ్గించారు. ఇప్పుడు చూడండి, ఎక్కడయినా పుచ్చుకున్నా "ఇంత పుచ్చుకున్నాను" అని సగర్వంగా చెప్పుకునే వీలులేదు కదా—వ్వ్!



# 10, 9, 8, 7....

37వ పేజీ తరువాయి

'యు. ఎస్' కాప్టెన్ పేరు జాక్ రాబిన్‌సన్. వయస్సు ముప్పై అయిదు. బ్రిటన్ దేశస్థుడు. ఇంతకుముందే చంద్రమండలానికి రెండు పర్యా యాలు వెళ్ళి వచ్చాడు. జన్మస్థలం మాంచెస్టర్.....

'పైలట్' రష్యా 'ప్రతినిధి' ఇవాన్ ఇలియు విచ్. ఇంకా ఇరవైఆరు సంవత్సరాలు పూర్తి చెయ్యలేదు. (బయలు దేరిన పదిహేనవ దినం పుట్టినరోజు పండుగ చేసుకుంటున్నాడు!) చిన్న వాడే అయినా అంతరిక్షయానంలో ఆరితేరినవాడు.....

ఇంజనీరు జోస్మిత్ ఊరు న్యూయార్కు. ఇతనూ అంతరిక్షయానంలో అనుభవం కలవాడు. వయస్సు ఇరవై ఆరు సంవత్సరాలు......

ఏ .బి. లాధురీ నౌక డాక్టరు. వయస్సు ఎంతో సరిగ్గా తెలియదుకాని సుమారు ముప్పై సంవత్స రాలు ఉండవచ్చు. దక్షిణ ఆఫ్రికాలో డర్బన్ దగ్గ రగా ఉన్న ఒక పల్లెటూరులో పుట్టి, చిన్న వయసు లోనే బ్రిటన్‌కు పారిపోయి వైద్యం చదివాడు. అంతరిక్షయానానికి సంబంధించిన పరిశోధనలకు నోబెల్ బహుమతి పొందారు.....

"యు. ఎస్' ఖనిజ శాస్త్రజ్ఞుడూ, కొన్ని విధా లుగా స్మిత్‌కు 'ఎసిస్టెంటూ' అయిన వి. సుబ్ర హ్మణ్యం భారతదేశం తరఫున వెడుతున్నాడు అను కోవాలి. వయస్సు విషయంలో ఏ విధమయిన అను మానమూ లేదు. (చిన్నప్పుడే ఒక జ్యోతిష్కుడు అతనికి విదేశ ప్రయాణ యోగం కూడా లేదని చెప్పాడుట) ఇరవై తొమ్మిది పూర్తి అయి ముప్పై యవ ఏడు నడుస్తున్నది. చంద్రమండలం వెళ్ళి వచ్చేడు. ఇంజనీరింగ్ చదువుకున్నా, ధాతుశాస్త్రంలో ప్రవేశం ఉన్నది. ప్రవేశం అంటే అంతర్జాతీయ ఖ్యాతి అన్నమాట.....

చైనా దేశంనుంచి వచ్చిన సి. పి. వూ. నౌకలో ఒక ఇంజనీరు; రేడియో ప్రసారానికి సంబంధించిన వన్నీ అతను చూసుకుంటాడు. చాలా భాషలు వచ్చు. ఇంకా ఇరవై ఎనిమిది పూర్తి కాలేదు.....

'యు. ఎస్.' నావికులు ఈ ఆరుగురే. అంద రికీ అంతరిక్షయానం అలవాటే కనుక నౌకలో అన్ని రకాల 'డ్యూటీ'లు నిర్వర్తించుకొనగలరు. అందరూ సంవత్సరంపైగా 'స్టేషన్ 10' మీద ఉంటున్నారు. ఒకరిమధ్య ఒకరికి బాగా పరిచయం ఏర్పడిపోయింది......]

## +1

"మరొక వారం రోజులలో అంగారక గ్రహం చేరుకుంటాం!" అన్నాడు లాధురీ యు. ఎస్. నౌక కిటికీలోంచి బయటకు చూస్తూ. అంత వరకూ ఏదో 'మాప్'లలో, 'చార్టు'లలో మునిగి ఉన్న సుబ్రహ్మణ్యం అతని మాటలు వినగానే వాటిని వదలి తను కూడా వలయాకారంలో ఉన్న కిటికీ వద్దకు వెళ్ళి నుంచుకున్నాడు.

"అదుగో అంగారక గ్రహం!" అన్నాడు. ముగ్ధుడయిపోయి బయటి దృశ్యం చూస్తూ ఉండిపోయాడు. ప్రతిరోజూ ఎన్నిసార్లు చూసినా ఇంకా క్రొత్తగానే ఉండేది. ఆకాశం అన్ని వైపులా కారునలుపుగా ఉన్నది. నక్షత్రాలు అక్కడక్కడ దీపాలవలె వెలుగుతూ కనిపిస్తున్నాయి. అంగారక గ్రహం చంద్రుడు కనిపించినట్లు ఆకాశంలో ఎర్రగా కనిపిస్తున్నది. పరిమాణం మాత్రం కొన్ని రెట్లు ఎక్కువ.

"సుబ్రహ్మణ్యం కాప్టెన్ పిలుస్తున్నాడు!" సుబ్రహ్మణ్యం ఉలిక్కిపడి తిరిగి చూశాడు. లాధురీ తనూ నుంచునిఉన్న 'గది'కి పైనున్న 'గది'కి మధ్య నున్న ద్వారంలోనుంచి చూస్తూ పిలుస్తున్నాడు తనను వూ. గబ గబా మెట్లు ఎక్కి 'కంట్రోల్' గదిలోకి వెళ్లాడు. 'పైలట్ సీట్' లో ఇలియవిచ్ దీక్షగా తన పని చూసుకుంటున్నాడు. రాబిన్‌సన్ 'మీటర్లు' మొదలైన వాటిని పరీక్ష చేస్తూ, ఏవో వ్రాసుకుంటున్నాడు. వూ 'రేడియో కంట్రోల్'ల వద్ద తిరిగి కూర్చుని మైక్రోఫోన్‌లోకి మాట్లాడు కుంటున్నాడు,

"ఐ. ఎస్. మిటియార్ (Meteor) గుంపు ఒకటి మనల్ని సమీపిస్తున్నదంటున్నాడు వూ. సిద్ధంగా ఉండు! స్మిత్ ఏడీ? ఓహో, ఇంజన్ రూమ్‌లో ఉన్నాడా?" అంటూ రాబిన్‌సన్ ఒక చిన్న టెలిఫోన్ వంటి యంత్రం దగ్గరకు వెళ్ళి, "స్మిత్, వెంటనే పైకిరా!" అని త్వర త్వరగా ఆజ్ఞ జారీ చేశాడు

"వస్తున్నా కాప్టెన్!" స్మిత్ కంఠస్వరం నౌక 'ఇంటర్‌కామ్' మీద వినిపించింది.

సుబ్రహ్మణ్యం గబగబ వెళ్ళి మరొక 'కంట్రోల్ సీట్'లో కూర్చున్నాడు. రాబిన్‌సన్ చెప్పినట్లు ఇంజన్ల వివరాలు మొదలయినవి ఇలియవిచ్‌కి చెప్పటం మొదలుపెట్టాడు.

"వేగం ఇరవై అయిదువేల నాలుగు వందల ఇరవై మైళ్ళు."

"మనం వెళ్లే దిక్కు సరిగ్గా......"

"ఇంజన్ ప్రెషర్......."

"........మిటియార్‌లు ఎటు వస్తున్నాయ్?..."

రాడార్ తెర చూస్తూ అనేక వివరాలు తెలిపాడు. వూ, రాబిన్‌సన్, సుబ్రహ్మణ్యాలు వీటిని ఇలియ విచ్‌కు తగిన వివరాలు చేర్చి, 'వ్యాఖ్య' చేసి చెప్పారు. యు. ఎస్. వేగం అధికం అయింది. ఒక వైపుకు కొద్దిగా మళ్ళింది.

స్మిత్, లాధురీ – ఇద్దరూకూడా పైకి వచ్చే శారు. రాబిన్‌సన్ వారిని చూడగానే "స్మిత్! నువ్వు కూడా ఇలియవిచ్‌కి సహాయపడు! ఎ. బి."— లాధురీని అలాగే పిలిచేవాడు. "ఫస్ట్ ఎయిడ్ సిద్ధంగా ఉంచు!" అని పురమాయించాడు.

"అంత ప్రమాదమే వస్తే ఫస్టెయిడేమిటి, లాస్టెయిడే!" అన్నాడు స్మిత్. ఇలియవిచ్ నవ్వ కుండా ఉండలేకపోయాడు.

"ఫరవాలేదులే! మామూలు మీటియార్ దుమ్ము మాత్రమే అయితే మన నౌక తట్టుకోగలదు. కొంచెం చిన్న రాళ్ళంతఉన్నా మన ఫోర్స్ ఫీల్డ్ వేసుకుందాం! మరీ అంత పెద్దదయితే అందరం కలిసే......." అని వదలివేశాడు వూ.

ఈ 'ఫోర్స్ ఫీల్డ్' (Force field) ఇటీవలే కనిపెట్టారు. విద్యుచ్ఛక్తులతో ఒక అదృశ్యమైన గోడ ఏర్పరచే సాధనం ఇది. 'భౌతికంగా' ఏ విధమైన పదార్థమూ లేకపోయినా, పదార్థాన్ని ఒక వైపునుంచి మరొక వైపుకి పోనివ్వదు. ఇది ఇంచుమించు ఎంత బలంగా కావలిస్తే అంత బలంగా నిర్మించవచ్చు. కాని ఇంకా అంతరిక్ష నౌకలకు వినియోగం పూర్తిగా సాధించలేదు. యు. ఎస్.కు ఉన్న 'ఫీల్డ్' అంత 'దళసరి'దికాదు. పెద్ద పరిమితిగల మీటియార్ దీనిని దూసుకు వెళ్ళగలదు.

అందరూ రాబిన్‌సన్ చెప్పిన పనులలో మునిగిపోయారు. 'ఫీల్డ్' వేశారు. వ్యూ రాడార్ తెరమీద మీటియార్ గుంపును పరీక్ష చేస్తూ, వివరాలు బయటకు చెప్పగా మిగిలిన ఇంజనీర్ల సహాయంతో ఇలియవిచ్ నౌకను నడిపాడు.

బాధురీ కిటికీ దగ్గర నుంచుని నక్షత్రాల వంక చూశాడు. ఆఫ్రికాలో వేసవికాలం రాత్రి గుర్తుకు వచ్చింది. ఖగోళాలు ధగధగ మెరిసిపోతున్నాయి. కాని తను భూమిమీదనుంచి చూసిన వాటికి కొన్ని రెట్లు అధికంగా మెరుస్తున్నాయి. ఇంతలో నౌక పక్కగా ఏదో వస్తువు అతివేగంగా పోవటం చూశాడు. నౌక కొద్దిగా అదిరింది. చిన్న మీటియార్లు కొన్ని తగిలి ఉంటాయి. వ్యూ ఏదో అరిచాడు. నౌక అమాంతంగా ఒక పక్కకు ఒరిగింది. బాధురీ బలంగా ఒక మూలకు దొర్లిపడిపోయాడు. రాబిన్‌సన్ కూడా కూర్చున్న చోటునుంచి పడిపోయాడు. యు. ఎస్. గతుకుల రోడ్డుమీద లారీలాగ అదిరింది. అక్కడక్కడ సామానులు నేల మీదకు దొర్లాయి.

నాలుగు నిముషాలకు అన్నీ సరిపడ్డాయి. "చాలా కొద్దిలో తప్పించుకున్నాం!" అన్నాడు స్మిత్ నవ్వుతూ.

"ఇలియవిచ్ పుణ్యమా అని!" రాబిన్‌సన్ నేల మీద సామాను ఏరుతూ అన్నాడు.

"ఇంత పెద్ద మీటియార్ గుంపు మనకు తగల్లేదు ఇన్ని మైళ్ళ ప్రయాణం చేసినా; ఈవారం రోజులూ గడిస్తే మన ప్రయాణం పూర్తవుతుంది.

"ఇక భూమితో ఒకసారి రేడియో కనెక్షన్ ఇవ్వు, వ్యూ! విశేషాలేమిటో తెలుస్తాయి!" అని ఇలియవిచ్ తన సీటు వదలి ఇవతలగా వచ్చి ఒళ్ళు విరుచుకున్నాడు. తేలికగా మాట్లాడినా చాలా ప్రయాసపడ్డాడని అతని ముఖం చూస్తేనే తెలుస్తున్నది.

"హలో! హలో! హలో! యు. ఎస్. కాలింగ్! యు. ఎస్. కాలింగ్! యు. ఎస్ ......" వ్యూ మైక్రోఫోన్‌లోకి మాట్లాడాడు.

భూమి మీదనుంచి జవాబు రావటానికి కొంత సేపు పట్టింది. యు. ఎస్. భూగోళానికి చాలా దూరంలో ఉన్నది. మొదట్లో ఇది కొంచెం కొత్తగా ఉన్నప్పటికీ ఈ స్వల్ప వ్యవధి ఇప్పుడు బాగా అలవాటయిపోయింది.

"స్టేషన్ 10! యు. ఎస్. నౌకని పిలిచేది స్టేషన్ 10!....." కొన్ని నిముషాలు సాంకేతిక విషయాలు మాట్లాడుకున్నారు. ఆపైన నావికులు ఒక్కొక్కరూ తమ సందేశాలు పంపుకున్నారు. రాబిన్‌సన్ ఇంగ్లాండ్‌లో ఉన్న తన కుటుంబానికీ, ఇలియవిచ్ తన తల్లి దండ్రులకూ క్షేమంగా ఉన్నట్లు తెలిపారు.......

## +2

అంగారకుడు ఆకాశాన్ని అంతా ఆక్రమించుకున్నాడా అనిపించింది, కిటికీలోంచి చూస్తున్న సుబ్రహ్మణ్యానికి. నల్లటి ఆకాశంలో ఎర్రగా, కళ్ళు తిరిగిపోయేటట్లు కనిపించే అంగారక గ్రహం వైపు చూసిన కొద్దీ అతనికి ఆశ్చర్యం వేసింది! తను చంద్రమండలం చూశాడుకాని, అది దీనికన్నా చిన్నది. రంగు కూడా ఇంత వింతగా లేదు.

"ఏవీ కెనాల్స్ (కాలువలు)?" అన్నాడు బధూరీ అతని వెనుక.

"అసలు కనిపించటమే లేదు! ఏవీ?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

రాబిన్‌సన్ కంట్రోల్స్ గదిలోని, దీపం ఆర్పి వేశాడు. మీటర్ల వెలుగు తప్పిస్తే అంతా చీకటి అయిపోయింది. కాప్టెన్ కూడా వచ్చి కిటికీలోనుంచి అంగారకుని చూస్తూ, మాటలు లేకుండా నుంచుని ఉండిపోయాడు. మిగిలినవారు ఒక్కొక్కరే చుట్టూ మూగారు.

చివరకు రాబిన్‌సన్, "ఇలా అందరూ తమ పనులు మానుకుని వింతలు చూస్తే లాభం లేదు!" అని మందలించటంతో ఎవరి స్థానాలకు వారు వెళ్ళిపోయారు.

"ఇలియవిచ్, మనం అంగారక గ్రహం చుట్టూ కక్ష్యలోకి దిగాలిసింది రేపొద్దుపూర్తిగా ఇరవై గంటలు

## 10, 9. 8. 7...

కూడా లేదు— కాలం వృథా చెయ్యకుండా పనులు చూసుకోండి!'' రాబిన్‌సన్ తిరిగీ అందరినీ మందలించాడు. స్మిత్ అన్నిటికంటే క్రిందుగా ఉన్న ఇంజన్ గదిలోకిదిగి వెళ్ళిపోయాడు. వూ, రాబిన్‌సన్, సుబ్రహ్మణ్యంలు తమ కార్యకలాపాలతో నిమగ్నులయిపోయారు. లూథులీ స్మిత్‌కు సహాయంగా ఉందామని ఇంజన్‌గదిలోకి వెళ్లాడు.....

నిద్రకు ఉపక్రమించేముందు మధ్య గది బెర్తులలో పడుకునిఉన్న రాబిన్‌సన్‌తో ఇలియువిచ్, ''చంద్రమండలంమీద దిగినంత సులభంగా దిగగలమా అని అనుమానంగా ఉంది'' అన్నాడు.

''అనవసరంగా భయపడుతున్నావు! కక్ష్యలోకి 'స్థిరపడి'పోగానే మన రాకెట్ టాక్సీలో కొందరు గ్రహం మీదకు దిగవచ్చుగా! వీలైతే యు. ఎస్. నే దింపుదాం!'' అన్నాడు లూథులీ.

యు. ఎస్. నౌకకు ఒక చిన్న టాక్సీ రాకెట్ ఉన్నది. ఇది పెద్ద నౌకలకు ఉండే లాంచ్, లైఫ్ బోట్‌లవంటిది. ఇంజన్ గదిలో ఒక తలుపు ద్వారా ఈ టాక్సీ ఉండే అరని ప్రవేశించవచ్చు. ఇందులో ముగ్గురు నలుగురు పడ్తారు. గ్రహం మీదకు దిగి, మళ్ళీ కావలసినప్పుడు కక్ష్యలో తిరుగుతున్న యు. ఎస్. ను తిరిగి చేరుకోవచ్చు. అయితే ఇది కొంచెం చిక్కు పని. వేగంగా గ్రహం చుట్టూ పరిభ్రమిస్తున్న అంతరిక్ష నౌకను తప్పకుండా అందుకొనటం మంచి పైలట్ చెయ్యగలిగిన పని. ఇలియువిచ్ ఇందులో ఆరితేరిన చెయ్యి అని వేరే చెప్పనక్కరలేదు. లూథులీ అన్నట్లు యు. ఎస్. నౌకనే అవసరమయితే గ్రహంమీదకు దింపవచ్చు కాని ఇది ముందు అన్ని జాగ్రత్తలూ పడ్డ తర్వాతనే చెయ్యవలసిన పని.

రాబిన్‌సన్ వాళ్ళనిక విశ్రాంతి తీసుకొనమని హెచ్చరించాడు. స్మిత్, వూ, సుబ్రహ్మణ్యం వీరు ముగ్గురూ తమ 'షిఫ్ట్' (Shift) మీద పని చేస్తున్నారు.

### +3

''ఇలియువిచ్! కంగ్రాచులేషన్స్! చక్కగా కక్ష్యలోకి దింపావు!'' అని రాబిన్‌సన్ అతనిని అభినందించాడు. అంగారక గ్రహంమీద అయిదు వందల మైళ్ళపైన యు. ఎస్. ఒక ఉపగ్రహంలాగ పరిభ్రమిస్తున్నది. పని సాధించేవరకూ ఎవరికీ ఒక క్షణం తీరికలేదు. ఎంత అంతరిక్షయానం అనుభవం ఉన్నప్పటికీ నావికులకు ఇటువంటిది ఒక గండం వంటిదే! తప్పు జరిగితే అయిపు లేకుండా అదృశ్యులైపోతారు!

''వూ! భూమికి సురక్షితంగా ఇక్కడికి చేరినట్లు సందేశం పంపు!'' అన్నాడు రాబిన్‌సన్.

కొన్ని నిముషాలలో రేడియోలోంచి ఐక్యరాజ్య సమితి అధ్యక్షుని గొంతుక వినిపించింది. ''మా అందరి తరఫునా యు. ఎస్. నావికులను అభినందిస్తున్నాము..........''

దగ్గరగా చూసినా గ్రహం ఎర్రగానే కనిపిస్తున్నది. సౌర మార్గానికి అవతల నైపుగా ఉన్న గ్రహ

భాగంమీద ప్రయాణం చేసినప్పుడు అంతా నీడలో కలిసిపోయి ఏమీ కనిపించేదికాదు. సూర్యరశ్మి తగులుతున్న వైపు మాత్రం జేగురు రంగు గ్రహతలం మీద అస్పష్టంగా కొన్ని గుట్టలవంటి ఎత్తు ప్రదేశాలు కనిపిస్తున్నాయి. ఎక్కడా మబ్బులు లేవు. అంగారక గ్రహంమీద వాయువులు 'పల్చగా' ఉండటంవల్ల ఇది ఆశ్చర్యం కలిగించే విషయం కాదు.

"టాక్సీ రాకెట్ సిద్ధం చెయ్యండి! సుబ్రహ్మణ్యం, ఇలియవిచ్, స్మిత్, లాధురీ మీరు నలుగురూ గ్రహంమీద దిగాలి. నేనూ, వూ, ఇక్కడే ఉంటాము!" రాబిన్‌సన్ ఆజ్ఞ సుబ్రహ్మణ్యం ఆలోచనలకు అంతరాయం కలిగించింది.......

రెండు 'అంతస్థులూ' దిగి ఇంజన్ గదిలోకి వెళ్లారు నలుగురూ. ఇలియవిచ్ లేనందువల్ల రాబిన్‌సన్ తనే పైలట్ పని నిర్వహిస్తున్నాడు. వూ రేడియోలో భూగోళానికి వార్తలు పంపుతున్నాడు. 'టాక్సీ' చిన్న రాకెట్ అని పేరు కాని ఒక విమానం అంత ఉంటుంది. అంతేకాక దానికి రెక్కలు కూడా ఉంటాయి. ఇవి నౌకలో ఉన్నంతకాలం ముడుచుకుని ఉంటాయి. అవసరమయితే తెరచుకుంటాయి. లోపల నలుగురుపడ్తారు. అందరూ లోపల ప్రవేశించిన తర్వాత 'టాక్సీ' అర తలుపు తనంతట తానే మూసుకుంటుంది. యు. ఎస్. పైలట్ దగ్గర 'స్విచ్' ఒకటి నొక్కిన తర్వాతనే నౌకను వదలి వెడుతుంది. ఆపైన బాధ్యతఅంతా టాక్సీ నడిపేవారిదే! ఇలియవిచ్ టాక్సీ పైలట్ సీటులో కూర్చున్నాడు. అయిదు నిముషాలలో టాక్సీ రాకెట్ అంగారక గ్రహం వైపు వెళ్ళిపోయింది....

* * *

"కాప్టెన్! ఇలియవిచ్ మాట్లాడుతున్నాడు. సురక్షితంగా గ్రహంమీద వాలాము. ఇక్కడ వాతావరణం మానవులకు సరిపడేట్లు ఉన్నదని లాధురీ నిశ్చయించాడు. గ్రహంమీదకు దిగుతున్నాం...."

"కాప్టెన్ రాబిన్‌సన్! లాధురీ మాట్లాడుతున్నాను. మొదట్లో వూపిరి తియ్యటం కొంచెం కష్టమనిపించినా అలవాటు పడ్డాము! ప్రాణ వాయువు కావలిసినంత ఉంది. తేమ చాలాతక్కువ. భూమ్యాకర్షణ—క్షమించండి! అంగారకాకర్షణ—శక్తి కొంచెం తక్కువగా ఉండటంవల్ల నడవటం సరిగ్గా కుదరలేదు. ఇప్పటికి సర్దుకుంటున్నాము!

"మా చుట్టుపక్కల అంతా ఎడారిలాగ ఉంది. కొన్ని పొదలుమాత్రం కనుపిస్తున్నాయి. కనుచూపు మేర ఏ విధమైన సజీవ పదార్థమూ—ఈ పొదలను తప్పించి—లేదు. కొన్ని గుట్టలు ఉన్నాయంతే. సుబ్రహ్మణ్యం నేలమీద మట్టి పరీక్ష చేస్తున్నాడు. భూమిమీద మట్టికీ దీనికీ పెద్ద వ్యత్యాసం లేదంటున్నాడు

"స్మిత్! ఏమిటీ? కాప్టెన్! స్మిత్ దూరదర్శినిలోనుంచి చూసి దూరంగా ఒక తెల్లటి వస్తువేదో కనిపిస్తున్న దంటున్నాడు! ఇదిగో అతనితోనే మాట్లాడండి!—"

"స్మిత్ మాట్లాడుతున్నది! తూర్పు వైపుగా ఒక తెల్ల కట్టడం కనిపించింది. సూర్యరశ్మిలో బాగా మెరుస్తోంది. సుబ్రహ్మణ్యం దానిదూరమెంతో చూస్తున్నాడు—ఇదిగో ఇప్పుడే చెప్తాడు. రెండు మూడు మైళ్ళ ఉండవచ్చునంటున్నాడు! వెంటనే అక్కడికి వెళ్లాలని ఉన్నది. మీ అనుమతినివ్వండి!"

"యు. ఎస్. నుంచి రాబిన్‌సన్ మాట్లాడుతున్నది. జాగ్రత్తగా వెళ్ళి చూసి రండి! ఇలియవిచ్ నువ్వు రాకెట్ వదిలి వెళ్ళక. తక్కిన ముగ్గురూ తనిఖీ చెయ్యండి!"

రాబిన్‌సన్ వూని ఉద్దేశించి, "అంగారక గ్రహంలో మనుష్యులవంటివారున్నా రేమిటి?" అన్నాడు చిరునవ్వుతో.

వూ ఏదో సమాధానం ఇవ్వబోయాడు కాని రేడియోమీద స్మిత్ గొంతుక వినిపించింది. "కాప్టెన్ మేము తిరిగి రావటానికి రెండు గంటల పైన పట్టవచ్చు. ఇక్కడ ఇంకా చీకటి పడలేదు. మేము వచ్చిన తర్వాత కూడా చాలాసేపు వెలుతురు ఉంటుంది! రేడియో కనెక్షన్ ఇలియవిచ్ ద్వారా ఏర్పరుచుకుంటాము."

"బెస్టు ఆవ్ లక్!" అన్నాడు రాబిన్‌సన్.

+4

"కాప్టెన్, ఇలియవిచ్ మాట్లాడుతున్నాను. స్మిత్ మాట్లాడాలంటున్నాడు—"

"ఆ కట్టడం మా కిప్పుడు రెండు ఫర్లాంగుల దూరంకన్నా లేదు. ఒక ఘన చతురస్రం నేలలో దిగిపోతే ఎలా ఉంటుందో అలా ఉంది! సుమారు రెండు వందల ఏభై అడుగుల పొడుగూ, వెడల్పూ ఉంటుంది. నేలపైన ఒక అరవై అడుగుల ఎత్తు ఉండవచ్చుననుకుంటున్నాను. ఎక్కడా ఏ విధమైన ద్వారంలేదు. నున్నగా పాలరాయిలాగ ఉంది. చుట్టుప్రక్కల ఇంకెక్కడా ఏ విధమయిన కట్టడమూ లేదు. మరికొన్ని నిముషాలలో చేరుకుంటాం. సుబ్రహ్మణ్యం రాతితో మాత్రం కట్టింది కాదంటున్నాడు.

"కాప్టెన్, స్మిత్ మాట్లాడుతున్నాను. చాలా విచిత్రంగా ఉంది! ఇది ఏ వస్తువుతో నిర్మించారో తెలీటం లేదు. సుబ్రహ్మణ్యం సుత్తితో కొట్టి చూశాడు. కాని చెక్కు చెదరటంలేదు!

"విద్యుచ్ఛక్తి కూడా పారటంలేదు! చెవి ఆన్చి చూస్తే లోపలనుంచి ఏమీ వినిపించటం లేదనిపిస్తోంది. కాని బహుకొద్దిగా అదురుతున్నదని అనుమానం! ఒకసారి ప్రదక్షిణం చేసి వస్తాం—"

* * *

"కాప్టెన్, ఇలియవిచ్ మాట్లాడుతున్నాను. స్మిత్ వాళ్ళ దగ్గరనుంచి రేడియో ప్రసారం రావటం ఆగిపోయింది. చాలా ప్రయత్నించి చూశాను కాని అందటమేలేదు. నన్ను కూడా వెళ్ళి చూడమంటావా?'

"ఇలియవిచ్! కంగారుపడకు—కొంతసేపు ఆగి చూడు. వీలైతే నీ దగ్గర బైనాకులర్స్‌తో చూడటానికి ప్రయత్నించు." రాబిన్‌సన్ తేలికగా మాట్లాడినా అతని ముఖంలో ఆందోళన ఛాయలు కనిపించాయి. వూ, "పోనీ వెళ్ళనిస్తే ఏం?" అని అడిగాడు.

రాబిన్‌సన్ వెంటనే సమాధానం ఇవ్వకుండా కిటికీవద్దకు వెళ్ళాడు. బయట చీకటిలోకి చూస్తూ ఉండిపోయాడు. కొన్ని క్షణాల తర్వాత వూ, "భూమికి రిపోర్టు పంపమంటావా?" అని అడిగాడు.

"అనవసరం! ఒక వేళ ఏ ప్రమాదమైనా సంభవిస్తే మనం తెలుసుకుని ప్రయత్నాలు సఫలమయిన తర్వాతనే చెప్తే బాగుంటుంది. అయినా ఈ గ్రహం





## 10, 9, 8, 7...

మీద ఏమి భయంకర రహస్యాలున్నాయో.....” సారీ! వూ, క్షమించు! ఏదో కలలు కంటున్నాను” అని రాబిన్‌సన్ చరచర పైలట్ సీటు వైపుకు వెళ్ళిపోయాడు.

అరగంటపైన గడిచి ఉంటుంది. “కాప్టెన్,ఇలియవిచ్ మాట్లాడుతున్నాను. చీకటి పడేట్లుంది ఇక్కడ! మీ కభ్యంతరం లేకపోతే ఒకసారి వెళ్ళి చూసొస్తాను!”

రాబిన్‌సన్ ఆలోచించాడు. “సరే ఇలియవిచ్, అలాగే వెళ్ళిరా. కాని జాగ్రత్త. ఆయుధాలేమైనా కావలిస్తే తీసుకు పో—”

* * *

“ఇలియవిచ్ వెళ్ళి ఇప్పటికి ఆరు గంటలు దాటింది......” అని జ్ఞాపకం చేశాడు వూ. రాబిన్‌సన్ మాట్లాడలేదు.

“రిపోర్టిద్దామా? లేక......” వూ మాట సగంలో ఆపివేశాడు.

“ఇంకొక పద్దెనిమిది గంటలు ఆగి చూద్దాం. ఆ పైన ఇవ్వవచ్చు.....” అని రాబిన్‌సన్ ఏదో చెప్పబోతూ ఉంటే రేడియో మోగింది.....“భూమి నుంచి మాట్లాడుతున్నాము. విశేషాలేమైనా ఉంటే చెప్పవలసింది. హలో యు. ఎస్.! భూమి నుంచి మాట్లాడుతున్నాము. విశేషాలేమైనా....”

వూ, రాబిన్‌సన్ ముఖంలోకి చూశాడు. రాబిన్‌సన్ తల ఆడించాడు.

“ యు. ఎస్. కాలింగ్! హలో! యు. ఎస్. కాలింగ్! టాక్సి రాకెట్‌లో వెళ్ళిన ‘రికనైసాన్స్’ బృందం జాడలేదని తెలుపటానికి చింతిస్తున్నాను. బహుశః ప్రమాదమేమీ సంభవించకపోయి ఉండవచ్చు కాని, ఇప్పటికి ఇరవై నాలుగుగంటలు దాటినా వారి జాడ లేదు.” వూ సందేశం పూర్తి చేసి సాంకేతికమైన వివరాలు మరికొన్ని చెప్పాడు. రాబిన్‌సన్ రేడియో మైక్రోఫోన్ తీసికొని, “హలో! నేను యు. ఎస్. కాప్టెన్ రాబిన్‌సన్‌ని! గ్రహంమీదకు నౌక దింపేందుకు అనుమతి ఇవ్వగోరుతాను....”

కొన్ని నిముషాల తర్వాత తేలిన విషయం—భూమిమీద అధికారవర్గాలు యు. ఎస్. నౌక అంగారక గ్రహం మీదకు దిగటానికి అనుమతి ఇవ్వలేదు' కొంతకాలంపాటు కక్ష్యలోనే ఉండమని శాసించారు. వీలైనన్ని ‘సాంకేతిక వివరాలు’ పంపమన్నారు.

* * *

(అంగారకగ్రహం చేరిన నావికులలో నలుగురు అదృశ్యులై, ఇప్పటికి ఇరవై ఎనిమిది రోజులు కావస్తున్నది. ప్రతిదినం యు. ఎస్. నౌక వార్తలు పంపుతూనే ఉన్నది. భూలోకంలో నిపుణులు అన్ని విధాలుగా ఆలోచించారు. ఏ నిర్ణయానికీ రాలేకపోయారు. ఇంకొక రెండు రోజులలో నిర్ణయించిన నెల గడువూ తీరిపోతుంది. యు. ఎస్. నౌకను గ్రహంమీదకు దిగనివ్వటమా, వద్దా అని తీవ్రంగా చర్చించారు. కొందరు దిగనివ్వాలన్నారు. మరికొందరు వీల్లేదన్నారు. చివరకు రెండవ వాదనే నెగ్గింది. నెలపూర్తి కాగానే భూమికి తిరిగి వచ్చెయ్యవలసిందని కాప్టెన్ రాబిన్‌సన్‌కు చెప్పేశారు. రాబిన్‌సన్ ఈ ఆదేశం అందినట్లు చెప్పాడు కాని ఇంకేమీ అనలేదు.

రెండు రోజులూ గడిచాయి. యు. ఎస్. నౌకకి పరంపరలుగా రేడియో ప్రసారాలు జరిగాయి. యు. ఎస్. నుంచి అసలు జవాబేలేదు! ఆజ్ఞను అతిక్ర మించి గ్రహతలంమీదకు యు. ఎస్. నౌకను దిగ బెట్టారా అని కొందరు ప్రశ్నించారు. కాప్టెన్ రాబిన్ సన్ స్వభావం తెలిసినవారు అతను చెప్పకుండా అటు వంటి పని చెయ్యడన్నారు. వారం రోజులు తిరిగాయి,

+5

"కాప్టెన్, రాబిన్‌సన్ భూమికి రిపోర్ట్ పంపి స్తున్నాను. హలో! కాప్టెన్, రాబిన్‌సన్ రిపోర్టు పంపిస్తున్నాను. హలో !........"

హలో, యు. ఎస్.! భూమిమీదనుంచి సమితి అధ్యక్షుడు కాప్టెన్ రాబిన్‌సన్‌తో మాట్లాడు తారు. హలో! యు. ఎస్.! భూమిమీద—"

"—ఐక్యరాజ్యసమితి అధ్యక్షులకు కృతజ్ఞుడను. ఇప్పుడు 'బ్రీఫ్ రిపోర్ట్' ఒకటి డాక్టర్ ఎ. బి. బాధురీ ఇస్తాడు. డాక్టర్ బాధురీ....."

* * *

"మేము ముగ్గురం ఆ తెల్లని నిర్మాణం ప్రద క్షిణం చేస్తామని బయలుదేరినంతవరకూ మీకు వివరాలు తెలుసు. ప్రదక్షిణం ప్రారంభించాము. రెండవ వైపు 'గోడ' కూడా మొదటదానిలాగే ఉంది. ఎక్కడా ఏ విధమయిన ద్వారమూ కనిపించలేదు. మూడవ గోడా అంతే. నాలుగవ గోడ పరీక్ష మొదలు పెట్టాం. నేలమీద సుమారు ఆరు అంగుళాలపైన ఒక సన్న గీత కనిపించింది. జాగ్రత్తగా పరిశీలించి చూడగా అది సుమారు నాలుగు అడుగుల పరిమాణం కల 'చదరం' అని తేలింది. నున్నటి ఆ రాయిమీద సన్నగా గీసి ఉండటంవల్ల సరిగ్గా కనిపించటమే లేదు.

"ఈ విషయం వెంటనే ఇబియవిేకు చెప్పి ఉండవలసింది కాని అది కనిపెట్టిన ఉత్సాహంలో కొంచెం అశ్రద్ధ చేశాం!

"స్మిత్ తొందర ఆపుకోలేక ఉలితో, సుత్తితో 'పరీక్షలు' ప్రారంభించాడు. ఏమీ జరగలేదు. ఉట్టి పిచ్చిగీతలేకాని ద్వారంకాదని నిశ్చయించి విసుగుతో మధ్యగా ఒక్క తన్ను తన్నాడు. మొదట్లో ఏమీ కాలేదు. కొన్నిక్షణాల తర్వాత తెల్లటి పాలరాతిలాగా ఉన్న ఆ చదరం నీలంగా వెలిగింది. మాకు అంత వరకే జ్ఞాపకం......

"స్పృహ వచ్చేసరికి ఒక పెద్ద గదిలో మంచాల మీద పడుకుని ఉన్నాను. సన్నని నీలం కాంతి గదిని నింపుతోంది. దీపాలు మాత్రం కంటికి కనిపించ లేదు. తలతిప్పి చూశాను. నా కుడివైపున స్మిత్ మరొక మంచంమీద పడుకుని నిద్ర పోతున్నాడు. ఎడంవైపు తిరిగి చూశాను. సుబ్రహ్మణ్యం కూడా అదే స్థితిలో కనిపించాడు. జాగ్రత్తగా లేచి గదిని కలయజూశాను.

"ఎటు చూసినా కాళీగానే కనిపించింది. తలు పులుగాని, కిటికీలుగాని లేవు. దీపాలు లేకపోయినా నీలం వెలుగు గదిని నిండిఉందని ఇందాకే చెప్పాను. స్మిత్‌ను తట్టి లేపాను. సుబ్రహ్మణ్యం కూడా మేలుకున్నాడు. ముగ్గురం ఏం చెయ్యాలో తోచక ఒకరి నొకరు కుశల ప్రశ్నలు వేసుకున్నాం. అందరూ క్షేమంగానే ఉన్నామని తెలిసింది!

"ఏదో సవ్వడి విని అటుతిరిగాము. ఒక గోడలో ద్వారం ఏర్పడి గదిలోపలికి ఇద్దరు వచ్చారు. ఇద్దరు అని మనుష్యులను వర్ణించినట్టు వర్ణించటానికి కారణం లేకపోలేదు. తలుపు వెనక కాంతి మా గది లోకంటే తీక్షణంగా ఉంది. మానవాకారంలోఉన్న ఆ ఇద్దరూ మొదట నీడలలాగ కనిపించారు. కొంచెం దగ్గరకు వచ్చిన తర్వాత మనుష్యులు కారని కని పెట్టాను! సుమారు అయిదడుగుల ఎత్తున ఉన్నారు. రెండు కాళ్ళూ, చేతులూ కనిపిస్తూనే ఉన్నాయి. ఒంటిమీద కరుచుకునిపోయిఉన్న దుస్తులు బూడిద రంగులో ఉన్నాయి. కాలికి బూట్లవంటివి ధరించారు. చేతులకూ "గ్లోవ్స్" ఉన్నాయనుకుంటాను. ఒంటి రంగు తలకాయనిబట్టే తెలుస్తున్నది. నల్లగా మిల మిల మెరుస్తున్న చర్మం నున్నగా, కేశ విహీనంగా ఉన్న శిరస్సు, ఉన్నదా లేదా అనిపించేటంత చిన్న ముక్కు, ఎర్రగా మెరిసే పెద్ద కళ్ళు ముక్కు క్రింద సన్నటి గీత నోరును సూచిస్తోంది. చెవులేవు. వచ్చిన ఇద్దరూ మాముందు ఆగారు. మేము ఏమి చెయ్యాలో తోచక నుంచుని ఉండిపోయాము.

"వారిలో ఒకరు ఏదో శబ్దం చేశాడు. మా కర్థం కాలేదు. సుబ్రహ్మణ్యం సంజ్ఞలు చేసి చూశాడు. లాభంలేకపోయింది. ఇంతలో నాకొక వూహ వచ్చింది. నా జేబులో కలం, కాగితంతీసి సూర్య మండలంబొమ్మ గీసి ఇచ్చాను. మేము భూగోళంనుంచి వచ్చినట్లు సూచించాము. ఎర్రటి వారి కళ్ళు నిప్పు వెలిగేగా నట్టు మెరిశాయి. ఏవో శబ్దాలు చేసుకుంటూ సంప్ర దించుకున్నారు. ఆ పైన తమవెంట రమ్మన్నట్టు సంజ్ఞలు చేయగా తలుపులోనుంచి అవతల మందిరంలోనికి వెళ్ళాము.

"ఇది చాలా పెద్దదిగా ఉంది. విచిత్రమేమిటంటే పైనకప్పు గాజువంటి పదార్థంతో చేసి ఉంది. దానిలో నుంచి ఆకాశం, నక్షత్రాలూ కనిపిస్తున్నాయి! మేము బయటనుంచి చూసిన తెల్లటి నిర్మాణంలోపల ఉన్నామని వూహించాము. పరిమాణం కూడా అంతే ఉంది. స్మిత్, సుబ్రహ్మణ్యాలు అంతే అయిఉంటుం దన్నారు. నే చుట్టూ చూశాను. ఏవేవో యంత్రాల వద్ద మమ్మల్ని వెంట తీసుకుపోయే వారివంటి 'వ్యక్తులు'—పోనీ అంగారకవాసులు అంటాను!— పనులు చూసుకుంటున్నారు. ఆ పెద్ద హాల్‌కి ఎన్నో తలుపులు ఉన్నట్లున్నాయి. కాని ఈ తలుపులు తెరుచుకున్నప్పుడే కనిపిస్తాయి. మూసిఉన్నప్పుడు గోడలో ఉన్నట్లే తెలుసుకోలేము కుంటాము. అప్పుడప్పుడు ఒక తలుపు కనిపించేది. ఎవరో వచ్చి వెడుతూ వుండేవారు. మేమూ ఒక ద్వారం ప్రవేశించాము. ఆ ద్వారం అవతల ఒక చిన్న గది ఉంది. అది ఒక 'లిఫ్ట్' ( Lift ) అని గ్రహిం చాము.

"ఈ లిఫ్ట్ ఎంత వేగంతో ఎంతలోతుకి దిగిందో చెప్పలేను. ఒకటి రెండు నిముషాల తర్వాత ఆగింది. లిఫ్ట్ బయటకు నడిచాం"—క్షమించండి! కాప్టెన్ ఏదో అంటున్నాడు—

"కథ త్వరగా ముగించమంటున్నాడు కాప్టెన్ రాబిన్‌సన్! అలాగే చేస్తాను!

"మేము ప్రవేశించిన గది ఒక పరిశోధన కేంద్రం లాగ ఉన్నది. ఎటుచూసినా, శాస్త్ర జ్ఞులు గావును, అంగారకవాసులు ఏవో పరిశోధనలు

# 10, 9, 8, 7...

నడుపుతున్నారు. కనీసం నేనలా అనుకున్నాను! ఒక మూల బల్లవద్ద కూర్చునిఉన్న వ్యక్తి వద్దకు వెళ్లాం. మాతో వచ్చినవారు—మేమే వారివెంట వెళ్లామనుకోండి!—అతనితో ఏదో అన్నారు. అతను గోడమీద ఒక చిన్న తెరవంక చూడమని సూచించాడు. ఆ తెర వెలిగి సినిమా బొమ్మలవంటివి కనిపించాయి. మన భూగోళం బొమ్మ కనిపించింది! ఆశ్చర్యచకితులమై చూశాను! గోళం ఫోటో చాలా ఎత్తుపై నుంచి తీసిఉండాలి. సుమారు వెయ్యి మైళ్ళ, అని స్మిత్ అన్నాడు. తర్వాత ఇంకా దగ్గరనుంచి తీసిన బొమ్మలు,భూతలంపైనుంచి తీసిన బొమ్మలు చూశాము. ఇవన్నీ కొత్తగా అనిపించాయి. దీనికి కారణం లేకపోలేదు. ఇవి తీసి కొన్ని వేల సంవత్సరాలు అయివుండాలి! వింత వింత చెట్లు మృగాలు కనిపించాయి!! ఒక సినిమా కూడా చూపించారు. డిగోసార్ మొదలయిన మృగాలు వచ్చాయి—

"బల్ల వెనక వ్యక్తివైపు తిరిగాను. నిప్పు బొగ్గుల వంటి కళ్ళతో మా వంక దీక్షగా చూస్తున్నాడు. స్మిత్, సుబ్రహ్మణ్యం ఇద్దరూ తెరమీద సినిమా విశేషాలు చర్చిస్తున్నారు.

"మరికొందరు అంగారకవాసులు మా చుట్టూ మూగారు. వారితో మా స్నేహం ప్రారంభమయింది!

"ఇలియవిచ్ మమ్మ చేరాడు!—

అంగారక గ్రహవాసులు మా భాష నేర్చుకున్నారు. మేము వారి భాష నేర్చుకున్నాం! అంతవరకూ మా అవస్థ వారికి పూర్తిగా అర్థమయ్యేట్లు చెప్పలేకపోయాం!

"మాకు తెలిసిన విషయాల సారాంశం ఇది: ఒకటి రెండు లక్షల సంవత్సరాలకు పూర్వం అంగారక గ్రహంమీద బ్రహ్మాండమయిన నాగరికత ఉండేది. శాస్త్రాలలో, సాంకేతిక విజ్ఞానాలలో మన కన్నా వారు అప్పటికే చాలా పురోగమించి ఉన్నారు. అంతరిక్షయానం కూడా సాధించారు. కాని ఎప్పుడో సరిగ్గా తెలియదుకాని, వారి కొక పెద్ద 'అవాంతరం' వచ్చిపడింది.

"పాలవెల్లిలో ఒకమారుమూల నక్షత్ర మండలం వారు అంగారక గ్రహంమీద దాడి చేశారు. అప్పుడు జరిగిన యుద్ధంలో అంగారక గ్రహం ఓడిపోయింది. బయటి నక్షత్ర మండలంవారు గ్రహాన్ని వశపరుచుకున్నారు. అంగారక గ్రహం జనసంఖ్య అప్పటికి కోటి కూడా లేదు. అందువల్లనే గ్రహమంతా పూర్తిగా వశపరచుకోనగలిగారు.

"ప్రజాదరణ లేకపోగా తీవ్ర వ్యతిరేకం ఏర్పడింది ఈ కొత్త పరిపాలకులకు. కొందరు విప్లవకారులు రహస్యోద్యమాలు లేవదీశారు. విజాతి ప్రభుత్వంతో ఘర్షణలు పడ్డారు. కాని విజయం సాధించలేక పోయారు. .....

"కొందరు శాస్త్రజ్ఞులు, వారి అనుచరులూ అంగారక గర్భంలో రహస్యంగా స్థావరాలు ఏర్పరచుకున్నారు. ఇవి క్రమంగా పెరిగాయి. వాటిని భేదించటానికి వారి పరిపాలకులు ప్రయత్నించారు.కాని విఫలులయ్యారు. అంగారక గర్భంలోని స్థావరాలు అధికమయ్యాయి. క్రమంగా ప్రజలు వీటిలోనికి కొద్ది కొద్దిగా తరలిపోయారు. చివరకు గ్రహంమీద కొన్ని

కష్టమయింది ఖూర్రమే మిగిలారు. విజాతీయుల ఆకారాలు వీరి ఆకారాలకంటే చాలా భేదంగా ఉంటాయి. కనుక వారు రహస్య స్థావరాలు ప్రవేశించలేకపోయారు. గూఢచారులు ఉన్నప్పటికీ ఒకసారి క్రిందికి వెళ్ళిన వారు మళ్ళీ పైకి రావటమంటూ ఉండదు కనుక పెద్ద ఉపయోగం లేకపోయింది.

"మరికొన్ని వందల సంవత్సరాలు గడిచాయి. విష్నవశక్తుల బాధ పడలేక విజాతీయులు గ్రహం వదలి వెళ్ళిపోయారు. వెళ్ళిపోయేముందు అంగారక గ్రహ వాతావరణం విషవాయువులతో కలుషితం చేసిపోయారు. ఈ విషవాయువులలో అంగారక గ్రహవాసులు బ్రతుకలేరు. అక్కడి జంతువులు కూడా దీనిని పీల్చి చనిపోయాయి.

"అప్పటినుంచి నేటివరకూ అంగారక గ్రహవాసులు గ్రహాంతర్భాగంలోనే ఉండిపోయారు. ఇంకా లోపలకు తొలిచి తేనెతుట్టెలో ఈగలు నివసించినట్లు చాలా లోతుకి నగరాలు కట్టేశారు! ప్రస్తుతం వీరి జనాభా ఏభై అరవై లక్షల దాకా ఉండవచ్చు.

"మేము మొదట చూసిన తెల్లటి నిర్మాణం వంటివి చాలా చోట్ల ఉన్నాయి. ఒక్కొక్క దానికీ రహస్యమయిన ద్వారం ఒకటి ఉంటుంది. మేము చూసిన వెలుగు మమ్మల్ని స్పృహ లేకుండా చేసింది. ఆటోమాటిక్ ఏర్పాట్ల ద్వారా లోపలకు ఈడ్వబడ్డాము. వీటి లోపలకి ఎవరైనా ప్రవేశించవచ్చు కాని, బయటకు వెళ్ళలేరు. ఇది అతి ప్రాచీనకాలంలో శాస్త్రజ్ఞులు చేసిన ఏర్పాటు. అసలు కొన్ని వేల సంవత్సరాలుగా ఇక్కడికి ఎవరూ రాలేదు. నేను చెప్పినదంతా చరిత్ర అయిపోయింది! ఇక్కడి వారికి అసలు గ్రహతలం మరొక ప్రపంచం! అక్కడికి పోదామన్న ఊహాలేదు. అదొక మహా పాతకమని భావించటం అలవాటయిపోయింది.

"ఒకప్పుడు భారత దేశంలో సముద్రయానం ఎలా పాపం అనుకునేవారో ఆదే విధంగా ఇక్కడివారు తమ సొరంగాలు విడిచి వెళ్ళటం ఒక రకమయిన పాపం అనుకుంటారు.

"ఎన్నో చర్చల అనంతరం వీరి నాయకులకు నచ్చచెప్పాము. అంత విషవాయువులు గ్రహతలంమీద ఇంకా ఉన్నట్లయితే మాతో లోపలికి వచ్చేదికదా, అని వాదించాము. ఎలాగయితేనేమి బయట వాయువుల పరిశోధన చెయ్యవచ్చునని ఒప్పించాము! వీరి శత్రువులు కొన్ని పదివేల ఏళ్ళక్రితం ప్రయోగించిన విషవాయువులు హరించిపోయినాయని తెలిసింది. ఇంకొక దశాబ్దంలో అంగారక గ్రహతలంమీద మరొక 'నాగరికత' ప్రారంభమవుతుంది. మాతో బాటు కొందరు భూగోళానికి వస్తున్నారు. దీనికి సమితి అధ్యక్షులు దయతో అనుమతి ఇచ్చారు....."

* * *

(అంగారకగ్రహం 'మళ్ళీ కోలుకుంది. యు. ఎన్. నౌక ఇంకా భూగోళం చేరుకోలేదు. కాని అంగారక గ్రహంమీదనుంచి ప్రసారాలు వస్తున్నాయి. మొదటి అంగారక గ్రహవాసి భూగోళంమీద అడుగు పెట్టగానే స్వాగతం ఇవ్వడానికి పెద్ద పెట్టున సన్నాహాలు జరుగుతున్నాయి.)



బుద్ధా పిక్చర్సు వారి "పాప పరిహారం" లో దేవిక, సావిత్రి.

## చిత్ర సమీక్ష:

# పాప పరిహారం

"ప్రపంచంలో ప్రతి మతానికి ప్రేమే గమ్యం. తనకు తానుగా మానవుడు విభేదాలేర్పరచుకొన్నందువల్లనే, ప్రేమమయం కావలసిన లోకంలో ద్వేషం, అశ, అసూయలు హెచ్చు పెరిగాయి. సత్యాన్ని మరచిన మానవుడు సంఘర్షణకు పూనుకున్నాడు....ఎన్నెన్ని మతాలున్నా, ఎన్నెన్ని మార్గాలున్నా మనిషికీ, మనిషికీ మధ్య పెరిగిన విభేదాలు, విరోధాలు ప్రేమపథంలో సరిదిద్దుకో గలిగితే మానవులు ఏకోదరులుగానే ఐక్యతతో జీవించగలరు.... తప్పులు చేయటం మానవ సహజం. ఆ తప్పు తెలుసుకొని పశ్చాత్తాప పడితే అదే సంతోషం"—ఇలాంటి ఉత్తమ నీతి పాఠాలతో బుద్ధా పిక్చర్సువారు నిర్మించిన చిత్రం 'పాపపరిహారం'

తమిళంలో అశేష జనాదరణ పొందిన 'పావ మన్నిప్పు' కు తర్జుమా ఈ చిత్రం.

దైవపూజల మాటున లోకుల్ని దోచే వ్యాపారి కాశీశ్వరయ్య (ఎం. ఆర్. రాధ) తన కారు డ్రైవరు బలరామయ్య (టి. ఎస్. బాలయ్య)ను హత్యానేరంపై పోలీసులకు అప్పగిస్తాడు. బలరామయ్య భార్య ఆడుబిడ్డను కని మరణిస్తుంది. పగ సెగలు చెలరేగిన బలరామయ్య పోలీసులను తప్పించుకొని, యజమాని చిన్న కొడుకు రామును చంపివేసేందుకు దొంగతనంగా ఎత్తుకువచ్చి రైలు పట్టాలపై వదుల్తాడు) ఆ వూరికి కొత్తగా వస్తున్న ఇస్మాయిల్ (నాగయ్య) పుణ్యమాంటూ రాము బ్రతికి బయటపడి రహీం (శివాజీ గణేశన్) గా పెరిగి పెద్దవాడవుతాడు. బలరామయ్య చిన్న కూతురును కాశీశ్వరయ్య భార్య పంకజమ్మ (ఎం. వి. రాజమ్మ) తన భర్త స్నేహితుడు జేమ్సు (ఎస్. వి. సుబ్బయ్య) కు పెంచుకునేందుకు ఇస్తుంది. ఆ బిడ్డ మేరీ (దేవిక) అనే పేరుతో పెరిగి పెద్దదవుతుంది. బలరామయ్య పెద్ద కూతురు రాజ్యం (సావిత్రి) ను పొరుగమ్మ ఆదరించి పెద్దదాన్ని చేస్తుంది.

కాశీశ్వరయ్య పెద్దకొడుకు రాజా (జెమినీ గణేశన్) బీదపిల్ల రాజ్యంను ప్రేమించి వివాహమాడ నిశ్చయిస్తాడు. పోలీసు ఉద్యోగం శిక్షణ నిమిత్తం రాజా వూరు విడిచి వెళ్ళిన సమయంలో జేమ్సు, కాశీశ్వరయ్యలు రాజాకు మేరీనిచ్చి వివాహం చేయాలని అనుకుంటారు. రాజా ద్రోహంచేశాడని భావించి ఆత్మహత్యకు పూనుకున్నరాజ్యాన్ని, రహీం రక్షించి ఆశ్రయమిస్తాడు. రహీం సర్వమత సమానత్వం చూసి మేరీ అతన్ని ప్రేమిస్తుంది. మేరీ రహీంల ప్రేమ విషయం తెలుసుకున్న కాశీశ్వరయ్య ద్రావకప్రయోగంవల్ల రహీంను కురూపిని చేయటం, అతని కుట్రవల్ల రహీం జైలుపాలు కావటం. రహీం ఉంటున్న వాడను కాశీశ్వరయ్య ఖాళీ చేయించటం జరుగుతుంది. జైలునుండి విడుదలైన రహీం తనవారి కష్టాలు చూడలేక పంకజమ్మ ఇంటికి పోయి అర్థించి ధనం, వస్త్రాలు తీసుకురావటం, తండ్రి చేసిన అర్భాటాలతో రాజా రహీంను అనుమానించి అవమానించటం, రహీం ప్రక్కనున్న రాజ్యంను కూడా అనుమానించి దూషించటం, రాజ్యం బలరామయ్య కుమార్తె అని తెలుసుకొని రాజా పశ్చాత్తాప పడటం. కాశీశ్వరయ్యకు తెలియకుండా జేమ్సు, పంకజమ్మలు రాజా, రాజ్యంల వివాహం నిశ్చయించటం పంకజమ్మ మనస్సు గుర్తించిన రహీం కాశీశ్వరయ్యను తీసుకువచ్చేందుకు బయల్దేరటం, త్రోవలో ఎదురుపడిన కాశీశ్వరయ్య అకారణంగా రహీంతో ఘర్షణపడి, రహీంను ఒక పూరి గుడిసెలో పెట్టి, గుడిసెకు నిప్పంటించటం జరుగుతవి. చేసిన దురాగతానికి పశ్చాత్తాపం చెందుతున్న బలరామయ్య వెల్లడించిన రహస్యంవల్ల రహీం తన కుమారుడేనని పంకజమ్మ, తన తమ్ముడేనని రాజా తెలుసుకొని, కాశీశ్వరయ్య దుండగం తెలిసి ఆ ప్రదేశానికి రావటం, వాళ్లవలన రహీం నిజ వృత్తాంతం తెలిసిన కాశీశ్వరయ్య కన్న కొడుకును దక్కించుకోవాలనే ఆరాటంతో ప్రయత్నించి అంధుడు కావటం రాజా సాయంతో రహీం, కాశీశ్వరయ్యలు బైటపడటం, చేసిన పాపాలకు కాశీశ్వరయ్య పశ్చాత్తాప పడటం జరుగుతవి. నేరాలకు తగిన సాక్ష్యాలు లభించాయని కాశీశ్వరయ్యను పోలీసులు అరెస్టు చేస్తారు. మేరీ, రహీంలు వివాహం చేసుకుంటారు. ఆపైన ఓ పెద్ద ఉపన్యాసంతో చిత్రం సంఘాన్ని శరణువేడుకొంటుంది.

చిత్రంలో ఉన్నంతలో కథాబలం తప్ప, కథన బలం చాలా తక్కువగా ఉంది. కంట తడి పెట్టించగల సన్నివేశాలు చాలా ఉన్నాచివరి సన్నివేశంలో దర్శకత్వ లోపం స్పష్టంగా కన్పిస్తుంది. పశ్చాత్తాపం పాప 'హారం' అనే ప్రామాణిక సూక్తిని జేమ్సు పాత్రద్వారా విశ్వసింపజేస్తూనే అంధుడు పశ్చాత్తప్తుడైన కాశీశ్వరయ్యను పోలీసులు నిర్బంధించినట్లు చూపటం కొంత అనౌచిత్యమేమో అనిపిస్తుంది. తన పాపాలకు ఫలంగా కాశీశ్వరయ్య అంధుడు, కురూపి అయ్యి హృదయవిదారకంగా క్షమాపణలు చెప్పుకుంటున్నప్పుడు వేరే పోలీసుల నిర్బంధంలోకి పంపించటం అనవసరం. రాజా ఇన్‌స్పెక్టరుగా ఉన్నప్పుడు ఏ ఆధారాలు దొరకలేదని కాశీశ్వరయ్యను విడుదల చేసేందుకు చెప్పిన పోలీసు అధికారి చేతనే తగిన ఆధారాలపైన కేసు చేస్తున్నామని చెప్పించటం జరిగింది. కొత్తగా ఏం ఆధారాలు దొరికాయో తెలియదు. రహీంపై జరిగిన దౌర్జన్యానికి దేనికీ తగిన సాక్ష్యాలు లేవు. మరి ఏ ఆధారాలపైన ఆ అంధుడి నిర్బంధం జరిగింది? ఎంత దుష్టుడైనా, కాశీశ్వరయ్య తన తండ్రి అని రహీంకు తెలిసినప్పుడు, అతనువళ్ళు కాలి, అంధుడై,

# పాప పరిహారం

దీనదైన ఉన్న స్థితిలో నిర్బంధింపబడ్డప్పుడు, రహీం ప్రభృతులలో, ఆఖరుకు భర్తే దైవంగా భావించే పంకజమ్మలో కూడా ఎలాంటి సంచలనం కల్గినట్లు చూపించకపోవటంవల్ల ఆదివరకల్లా అతి రసవంతముగా పోషించిన పాత్రలు బలహీనత కావటం జరిగింది. అలాగే కొన్ని కొన్ని సన్నివేశాలలో సంభాషణలు అతినాటకీయంగా ఉండటంవల్ల పాత్రల గమనానికి కొంత అంతరాయం కలిగింది.

నటీనటుల్లో దేవిక, శివాజీ గణేశన్, బాలయ్య ప్రతిభావంతమైన నటన చూపించారు.

అనిసెట్టి సాహిత్యం బాగానే ఉన్నా కొన్ని కొన్ని పాటలు తర్జుమా రథచక్రాల క్రింద నలిగి స్వారస్యాన్ని కోల్పోయి విపరీతార్థాల నిచ్చాయి. మూల చిత్రంలోని స్వరానుగుణమైన సాహిత్యాన్ని సమకూర్చాలని రచయిత తాపత్రయం, ఈ విపరీతార్థాలకు కారణమేమో అనిపిస్తుంది. "వందనాళ్ ముదల్ ఇంధనాళ్ వరై" అన్న పాటకు పల్లవికి "విశ్వప్రేమలో వెలుగు త్రోవలే వెదకు మానవుడా .... ప్రకృతి మారదు రా పతనమై తివిరా!" అన్నది మూలానుగుణమైన అర్థం కల్గించగపోగా కొంత విపరీతార్థం కల్గిస్తోంది. ఎప్పుడూ వెలుగుబాటలు అన్వేషిస్తున్న మానవుడా నువ్వు పతనం పొందావురా ! అనే అర్థం ధ్వనిస్తోంది. వెలుగుబాటలో నడవ ప్రయత్నించే మానవుడు పతనం కావటమేమిటో కొంత విడ్డూరంగానే ఉంది. ఇంకో అర్థం స్ఫురింపజేసేందుకు సంగీతం అడ్డు వస్తోంది. 'త్రోవలే' అన్న పదం కూడా విపరీతార్థంకు బలం కల్గిస్తోంది. బాగా ఉందనిపించే ఈ పాటకు రచయిత సరియైన పల్లవి సమకూర్చివుంటే బాగుండేది. మొత్తంమీద అనిసెట్టి, కలం విశ్వనాథన్, రామమూర్తి సుదర్శనంల సంగీతంతో సరసంగానే మేళవించింది. 'లోకానికే కనువిందౌ సోయగం, చిలుకా, నా చిలుకా, విశ్వసీమలో' అన్న పాటలు ప్రజాదరణం పొందవచ్చు.

చిత్రాలు పెరుగుతున్న కొద్దీ తర్జుమా విధానం నానాటికీ తీసికట్టవుతుంది. ఈ చిత్రంలో నటీనటులకు కంఠం ఎరువిచ్చినవారు ఎంతో ప్రతిభతో సంభాషణలు పలికినా ఏ ఒకటి రెండు పాత్రలకో తప్ప మిగిలినవాటికి కంఠస్వరం, పెదవుల కదలిక విడాకులు పుచ్చుకున్నట్లున్నాయి. ఒక ప్రముఖ నటుడు, దర్శకుడే తన సంభాషణను ఎం. ఆర్. రాధా పెదవుల కదలికతో జోడించలేనప్పుడు మిగిలినవారి ప్రసక్తి చెప్పేదేముంది. విశ్వసీమలో అన్న పాట మొదటి మూడు పాదాలు చాలు మనవారి తర్జుమా విధాన పాటవాన్ని నిరూపించటానికి.

బలమైన కథ, కథానుగుణమైన నటన, వినసొంపైన సంగీతం ఉన్నవి గనుక, ప్రేక్షకులు నటన, ఛాయాగ్రహణం చూచేందుకూ ఒకసారి, మాటలు పాటలు వినేందుకు ఒకసారి వెరసి రెండు పర్యాయాలు వెళ్ళాల్సి వస్తుందేమో ఈ చిత్రాన్ని చూచేందుకు. (నాగరాజ్) ★



'ఇద్దరు మిత్రులు'లో ఇ. వి. సరోజ.



# సినీవిహారం

16-వ పేజీ తరువాయి

విలిచి పోరతాము
గెలిచి తీరతాము
దేశమేకమై విశ్వరూపమై
దీక్ష బూనతాము తెగువచూపుతాము
వరులపెత్తనం పురిటిగడ్డపై
తుడిచిపెట్టుతాము తరిమికొట్టుతాము.
నవ్యభారతం దివ్యభారతం
తెచ్చి తీరుతాము జైహింద్! జైహింద్!
జైహింద్!

ఇంతటి మంచిపాటను రచించినందుకు, రఫీచే పాడించినందుకు జగ్గయ్యకు అభినందనలు అందించి, "ఈ చిత్రంలోని వేరే విశేషాలేమిటని" నిర్మాత కృష్ణమూర్తిని ప్రశ్నించాము. "ఇన్‌ఫ్రారెడ్ ఫిలిమ్"ను కొన్ని దృశ్యాల చిత్రీకరణకు తొలిసారిగా దక్షిణ చిత్రపరిశ్రమలో మేం వాడామని" ఆయన జవాబిచ్చారు. ఈ ఫిలుముతో పట్టపగలు ఒక దృశ్యాన్ని షూట్‌చేస్తే, అది అర్ధరాత్రి దృశ్యంగా వెండితెరపై కనబడుతుంది—ఇది ఈ ఫిలిమ్‌కుగల శక్తి. కొడక్ కంపెనీ తయారుచేసిన ఈ ఫిలిమ్‌ను తొలిసారిగా జాగృతిచిత్రవారే ఉపయోగించుకున్నారు.

ఈ చిత్రానికి దర్శకుడు వి. మధుసూదనరావు, ఏయేటీ ఆంజనేయశాస్త్రి, కామెరామన్ జె. సత్యనారాయణ. ఈనెల 26 వ తేదీన ఈ చిత్రం విడుదలకానుంది.

* * *

# సంక్రాంతి శుభాకాంక్షలు

**రథోడ్ ట్రేడింగ్ కంపెనీ, మద్రాసు-1**

మా తయారీకలు ప్రెసిడెంట్ అను పేరుకు (PRESIDENT) బదులుగా
పెరిసిడెంట్ (PRECEDENT) అని మార్చుచున్నాము.

మా తయారీకలు

## పెరిసిడెంట్
(PRECEDENT)

- హేరాయిల్
- టాల్కమ్ పౌడరు
- స్నో
- పొమేడ్ మరియు
- బ్రిలియన్‌టైన్



## పగోడా
## Pagoda

- టాల్కమ్ పౌడరు
- హేరాయిల్ • స్నో
- పొమేడ్ మరియు
- బ్రిలియన్‌టైన్







## ఏనుగ మార్కు
- చేతిగుడ్డలు, పర్‌ఫ్యూమ్స్

## చిలుక మార్కు
- సిన్‌థెటిక్ పర్‌ఫ్యూమ్స్ కాంపౌండ్

EP-RTC-1

# సినీవిహారం

శ్రీమతి సావిత్రి నటించిన నూతన చిత్రం "కొంజుం సలంగై" తమిళంలో విడుదలైంది. తమిళ చిత్రానికి ఈ కీర్తి అందింది. ఈ సందర్భంలో ఆమె తిరుపతి విశ్వవిద్యాలయానికి 25 వేలరూపాయలు, మదరాసు విశ్వవిద్యాలయానికి 30 వేల రూపాయల్ని విరాళాలుగా అందించడానికి నిశ్చయించింది. దక్షిణభారతంలోని విశ్వవిద్యాలయాలకి ఇంతగా భూరి విరాళాన్ని అందించిన తెలుగు తార ఆమెయే.

ఆమెను మరొకసారి అభినందించడానికై వాహిని స్టూడియోకి వెళ్లాను. వసుమతి పిక్చర్స్‌వారు నిర్మిస్తున్న తమిళ చిత్రం షూటింగులో ఆరోజు ఆమె పాల్గొంటున్నది. ఈ చిత్రంలో ఆమె ద్విపాత్రాభినయం చేస్తున్నది. ఈ చిత్రానికి దర్శకుడు మరెవరో కాదు. మన తాతినేని ప్రకాశరావే. ఆయన వై. వి. రావు, ఎల్. వి. ప్రసాద్‌ల తరువాత హిందీ చిత్రాలను దర్శకత్వం నిర్వహించే తెలుగు బిడ్డగా ఖ్యాతి నందుకున్న వ్యక్తి. ఆయన ప్రగతి ఆర్ట్సు పతాకం క్రింద మార్చి నెలలో తెలుగు చిత్ర దర్శకత్వానికి కూడా ఉద్యుక్తులవుతున్న శుభవార్తను కూడా అందించారు.





ఆంధ్ర సచిత్ర

వారపత్రిక

పాఠకులకు

సంక్రాంతి

శుభాభినందనలు

త్వరలో విడుదల!

జి.వరలక్ష్మి—సంధ్య—
కాంతారావు—
రాజకుమార్—
రాజనాల—నాగయ్య
రమణారెడ్డి—




నంది పిక్చర్సు

# నాగార్జున

దర్శకత్వం...Y.V. రావు.



ఆంధ్ర.....ప్రభాత్ రిలీజ్—
నైజాం......వాణీ ఫిలింస్—
సీడెడ్.......వెంకటేశ్వర—



NVKR.

# కొత్త సంవత్సరం కోరికలు

23వ పేజీ తరువాయి

తీసుకు వెళ్లాడు. నల్లకోటూ, నల్లపంట్లాం, చేతిలో చిన్న కర్ర, నల్లటి, ఎత్తయినటి టోపీ, నల్లబోళ్లూ అన్నీ నలుపే. వాటిని ధరించి దర్జాగా స్టేజిమీదకు వచ్చి మొదటి ట్రిక్ చేయటం ప్రారంభించాను.

"ఈ పెట్టెలోంచి కుందేల్ని తీస్తాను చూడండి తడాఖా" అని ఆ పెట్టెలో చెయ్యిపెట్టి, చేతికి దొరికిన మెత్తని చెవులు పట్టుకుని పైకి తీశాను. జనం గొల్లున నవ్వారు. విజయగర్వంతో సలాం చేయాలనుకునేటప్పుడు తెలిసింది—జనం ఎందుకు గోల చేశారో—కుందేలుకాదు అది—పందికొక్కు!!

తప్పు చేసినట్లు తెలుసుకుని ఆ మేజిక్‌లోని ట్రిక్‌ను ప్రేక్షకులకు విడమర్చి చెప్పేశాను. అంతా సంతోషించారు. మిగిలిన ఫీట్సన్నీ సక్సెస్‌ఫుల్....గా చేశాను. వండర్‌ఫుల్ అన్నారు. మాహెడ్మాస్టర్ ఇంటికి వచ్చాక వాళ్ళ బంట్రోతు కాఫీని అందరికీ అందిచ్చాడు, నాకూ, మా గురువుగారికీ తప్ప......ఓ చిన్న పిల్లవాణ్ణి పిలిచి కాఫీ కప్పును మాకిమ్మని ప్రాధేయపడుతూంటే చూసి, "ఏం?" అని అడిగా.

"భయం" అన్నాడు. మాజిక్ చేసేవాడంటే అతనికి భయంట!

ఈ 1961 డిసెంబర్ 31 న కోరికలు కుప్ప తిప్పలుగా పుట్టేశాయ్! అవేమిటో చెప్పేస్తే, ఎప్పుడు నెరవేరతాయో, ఏవి నెరవేరవో మీరే చెప్పెయ్యగలరు.

నంబర్ వన్ కోరిక :—నా పాటల్ని నేనే పాడుకోవాలని.

నంబర్ టు కోరిక :—సర్కస్ కంపెనీ పెట్టాలని.

నంబర్ త్రీ కోరిక : చంద్రమండలంలో ఫస్ట్ మేజిక్ పెర్ ఫార్మెన్స్ ఇచ్చెయ్యాలని.

ఇంకా చాలా ఉన్నాయి. వాటి రిజల్ట్స్ వచ్చే కొత్త సంవత్సరానికి రిజర్వ్ చేశాను. ★

# మనమూ మనరాష్ట్రం

19-వ పేజీ తరువాయి

నాయకులు పూరూరా తిరిగి చాటారు. భువనగిరి కాంగ్రెస్ రాజకీయ మహాసభలో కూడా ఆ ఐకమత్యాన్ని ఉద్ఘాటించారు. కాని తీరా ఎన్నికలకు అభ్యర్థుల్ని నిర్ణయించాల్సి వచ్చేసరికి, ఆ ఐక్యమత్యం అంతర్థానమై పరిస్థితి మళ్ళీ మొదటికి వచ్చింది. దానికితోడు ఎన్నికల అనంతరం ముఖ్యమంత్రి ఎవరు అవ్వ మీమాంస ఇప్పుడే తలఎత్తింది. ఎన్నికలయ్యేదాకా ఈ సమస్యను వాయిదావేయక ఇప్పుడే ఫలానా అంటూ నిర్ణయించేస్తే, ఎప్పుడో తలఎత్తగల ముఠా తగవులు ఇప్పుడే విజృంభిస్తాయి. ఏకొమ్మ ఇంగా ఎన్నికలలో పోటీ చేయవలసిన సమయంలో ఇలా తగవులు రేగడం, కాంగ్రెస్ విజయావకాశాలకు తీరని దెబ్బ. ఈ అవకతవకలను సరిదిద్దుకోలేని నాయకులు ఐక్యమత్య ప్రబోధం చేసినా, ప్రత్యర్థి శక్తులు పనికిమాలినవని నిందాగర్భిత ప్రచారం చేసినా వాటికి విలువ ఉండదు.

ఆర్థిక రంగం :—తృతీయ పంచవర్ష ప్రణాళిక ప్రథమ సంవత్సర కార్యక్రమాల చరిత్ర గత 12 నెలల ఆంధ్ర రాష్ట్ర అభివృద్ధి చరిత్ర. మొదటి ఏడాదికి కేటాయించిన 48 కోట్లలోనూ సగం ఖర్చైంది. కేంద్రం ఇచ్చే మరో రెండుకోట్లు కలిపి, మిగతాది వచ్చే 4 నెలల్లో ఖర్చు చేస్తారు. రెండవ ప్రణాళికలో మాదిరి గాకుండా, ఈ ఏడాది ఏనెల కానెల కార్యక్రమాల అమలును సమీక్షించడానికి మంత్రుల అధ్వర్యాన ఆరు అధికార సంఘాలను నియమించడం విశేషం. క్రితం ఆగస్టులో తృతీయ ఆర్థిక విచారణ సంఘం రాజధాని సందర్శించింది. రాష్ట్ర ప్రభుత్వం రాయలసీమ, తెలంగాణాలు ఎంత వెనుకబడిఉన్నవీ, వివరించి, వాటి అభివృద్ధికి కనీసం 75 కోట్లు అవసరమని చెప్పింది. వచ్చే ఐదేళ్ళమీద రాష్ట్ర ప్రభుత్వ ఆదాయాలలో 60 కోట్లు లోటు వస్తుందని రెండవ ఆర్థిక సంఘ సిఫార్సుల మేరకు కేంద్రం ఏటా ఇచ్చే నాలుగు కోట్లు గాక, ఈ లోటు భర్తీ కాగల మొత్తం కూడా ఇప్పించాలని కోరింది. ఆదాయపు పన్నును జనాభా దామాషాలో పంచాలని, ఎక్సయిజు సుంకాలలో వాటా 25 నుంచి 50శాతముకు పెంచాలని సూచించింది. ఈ కోరికలు, సూచనలు తృతీయ ఆర్థిక సంఘం ఎంత వరకూ ఆమోదించింది 1962 లో సమర్పించే నివేదిక వెలువడితేగాని తెలియదు.

వ్యవసాయరంగంలో పరిస్థితి నిశ్చిత చేసి గొంగడి అక్కడే ఉన్నట్లుంది. క్రితం సంవత్సరం క్షామదేవత మళ్ళీ రాయలసీమను పలకరించి వెళ్ళింది. ప్రభుత్వం మేల్కొన్నది. మంత్రులు మేల్కొన్నారు. క్షామ నివారణ శాశ్వత పథకాలు అవసరమని రాయలసీమ ప్రజా ప్రతినిధులు, రాష్ట్ర ప్రభుత్వం మరోమారు ఉద్ఘోషించారు. వీరి ఉద్ఘోషలు గాలిలో కలిసిపోతాయో, కార్యరూపం దాల్చుతాయో ముమ్ముందుగాని తెలియదు. కడచిన 12 నెలల్లోనూ, ఏవో కొన్ని చిన్న ప్రాజెక్టులు మినహా—అదైనా ఎన్నికలముందు—పెద్దవేవీ ప్రారంభం కాలేదు. తెలంగాణ, రాయలసీమలకు ప్రాణప్రదమైన పోచంపాడు, శ్రీశైలం ప్రాజెక్టులు అలాగే ఉన్నాయి. ఇదిగో వచ్చేస్తున్నాయంటూ, సంవత్సరారంభంనుంచీ, అంతంవరకూ మంత్రులు రగుల్కొల్పిన ఆశలు అడియాశలయ్యాయి. కృష్ణా, గోదావరి నదీ జలాల సుడిగుండంలో చిక్కుకుని పోవడంచేత ఈ ప్రాజెక్టులు 1962 లోనైనా మంజూరవుతాయా అన్నది అనుమానాస్పదం. 1960 లో మొదలైన కృష్ణా గోదావరి నదీ జలాల వివాదం, 1951 ఒప్పందం దృష్ట్యా గోటితో పోవలసినది రాజకీయాలలోపడి ఇప్పుడు గొడ్డలికైనా లొంగనంత జటిలంగా తయారైంది. వెనుకటి ఒప్పందాన్ని మార్చడం తమ అభిమతం కాదంటూనే, ఆ ఒప్పందాన్ని నమ్మి చేయడానికి, కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వ ఆమోదం పొందకపోగా, కనీసం సంప్రదించకుండానే గుల్హాటీ సంఘాన్ని నియమించింది. ఆ సంఘం జూన్‌లో ఒకసారి, అక్టోబర్,

## బహుమతి రు. 350

## చరిత్రాత్మక నవలలపోటీ

15-11-1961 నాడు ముగిసిన ఈ పోటీకి వచ్చిన నవలలో ఒకటి కూడా బహుమతి పొందలేకపోయినది. అందుచేత ఈ పోటీ గడువు 31-3-1962 వరకూ పొడిగిస్తున్నాము.

### నిబంధనలు

- రచనలు అరఠావు కాగితాలకు ఒక వైపునే వ్రాసిఉండాలి. 250 పేజీలు మించకూడదు.
- ఇతివృత్తం ఆంధ్రదేశ చరిత్రకు సంబంధించినదై స్థూలంగా యదార్థమైనదవాలి.
- రచనలు త్రిప్పి పంపగోరువారు తగిన తపాలా బిళ్లలు జతపరచాలి.
- తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. వ్రాత ప్రతులు 31-3-1962 లోగా మా కార్యాలయం చేరాలి.

# మనము—మన రాష్ట్రం

నవంబర్‌లలో ఒకసారి, మన రాష్ట్రాన్ని సందర్శించి, ఈ వివాదంలో తమ పక్షపాత వైఖరిని ప్రదర్శించడం, దానిపై రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి ఫిర్యాదు చేసేంతవరకూ వెళ్ళడం జరిగింది. వీటన్నింటినిబట్టి 1962 లో రాగల గుల్హాతీ సంఘం నివేదిక తీరు తెన్నులు, వివాదం పరిష్కార ధోరణి మనకు 1961 లో స్పష్టంగా వ్యక్తమైనాయి.

ఒరిస్సాతో సీలేరు ప్రాజెక్టు విషయమై వచ్చిన పేచీ కూడా అలాగే ఉంది. ఆమధ్య అంటే జూలైలో, ఒరిస్సా ముఖ్యమంత్రి మన ముఖ్యమంత్రితో చర్చల కోసం హైదరాబాదు వచ్చినప్పుడు అంతా తేలిపోయినట్లే కనిపించింది. కాని ఇప్పటికింకా, ప్రాజెక్టు ఆనకట్ట ఒరిస్సా సూచిస్తున్నట్లు బలిమెలవద్దనా, లేక ఆంధ్ర కోరుతున్నట్లు గుంటువాడ వద్దనా ఎక్కడ కట్టాలి అన్నది సమస్యగా ఉంది. త్రివేది అధ్యక్షులుగా, ఇంజనీర్ల సంఘం ఈ తగాదలో మధ్యవర్తిత్వం నెరవుతోంది. తీర్పు ఎలా ఉంటుందో చెప్పలేం.

పారిశ్రామికరంగంలో పరిస్థితి 60 లో కన్నా, 61 లో కొంచెం మెఱుగు. భారీ ఎత్తున పరిశ్రమాభివృద్ధికి తగిన పద్ధతులు ఏర్పడకపోయినా, పబ్లిక్ రంగంలో ఒక భారీ విద్యుత్తు పరికరాల ఫ్యాక్టరీ కేంద్రం మన రాష్ట్రంలో పెడుతుండటం ప్రైవేటు రంగంలో చెరి 25 కోట్ల పెట్టుబడితో రెండు ఎరువుల ఫ్యాక్టరీలు ఒకటి కొత్తగూడెం, మరొకటి విశాఖలో—ఏర్పాటవుతుండటం విశేషం. ఇవిగాక సనత్ నగర్‌లో కృత్రిమౌషధాల ఫ్యాక్టరీ, 10 కోట్లతో కొత్తగూడెంవద్ద దుక్క ఇనుము ఫ్యాక్టరీ ఇలాంటివి మనకు అమరుతుండటం, భావి పారిశ్రామిక అభ్యుదయానికి శుభ సూచన. అయితే అంతవరకూ కొత్త పరిశ్రమలలో చాలా భాగం తెలంగాణా ప్రాంతంలో కేంద్రీకృతమవుతున్నాయి. క్షామ నివారణ అవసరమైన కొన్ని పెద్ద పరిశ్రమలు, రాయలసీమ ప్రాంతంలో వచ్చే ఏడైనా ఏర్పాటవుతాయేమో చూడాలి. రాష్ట్ర ప్రభుత్వం పెద్ద భాగస్వామిగా, ఒక ప్రైవేటు కంపెనీ ఆధ్వర్యాన నడుస్తున్న సింగరేణి కాలరీస్‌ను కేంద్ర ప్రభుత్వం పరం చేయాలని నిర్ణయించడం 1961 లో ఒక ముఖ్య సంఘటన.

మిగతా అన్నింటికన్న, పరిపాలనా రంగం పరిస్థితి, 1960 కన్నా వేయిరెట్లు మెరుగు. 1960 అంతా సంజీవయ్య మంత్రివర్గం ఉనికి అస్తవ్యస్తంగ సాగింది. కాని వర్గ వైషమ్యాలనే తుపాను ధాటికి నిలచి క్రమేపీ నిలద్రొక్కుకోవడంచేత 1961 లో పరిపాలనకు కూడా కొంత నిలకడ లభించింది. మంత్రివర్గాన్ని గద్దె దింపాలని ప్రయత్నించిన ప్రత్యర్థి వర్గం, గద్దె దింపలేకపోగా, కనీసం మంత్రివర్గ విస్తరణనైనా సాధించలేకపోవడంతో సంజీవయ్య ప్రభుత్వం మరింత బలపడి, పరిపాలన సుష్ఠుగా సాగింది. ఉద్యోగులలో కూడా 60 లో ఉన్నంత అసంతృప్తి, ఆందోళన కన్పించలేదు. దానికితోడు ప్రభుత్వం కరువుభత్యాన్ని జీతంలో కలిపి, స్కేళ్ళు పెంచి ఏదో కొంత ఉపకారం చేసినట్లు చూపించింది.

కొత్త సంవత్సరంతో కొత్త ఆశలు మోసులెత్తుతాయి. వచ్చే ఐదేళ్ళకు దేశ భవితవ్యాన్ని, రాష్ట్ర భవితవ్యాన్ని తీర్చి దిద్దగల నూతన ప్రభుత్వాలు ఏర్పడే సంవత్సరం గనుక 1962 చాలా ముఖ్యమైనది. ఎన్నికల అనంతరం రాష్ట్రంలో ఏర్పడే ప్రభుత్వం ఆంధ్రుల ఆశలను, ఆశయాలను నెరవేర్చడానికి, వర్గ వైషమ్యాలకు తావులేని సమైక్యతతో ద్విగుణీకృత ఉత్సాహంతో కృషిచేయగలదని ఆశిద్దాం.






చిత్రకారుడు—ఎస్. రామచంద్రరావు (కలకత్తా)

# హరివంశం

భ్రాంతి. పౌండ్రకుని వేషమునకువలెనే అంతయు భ్రాంతి. సుదక్షిణ ఉస్సు రన్నది. మహారాజును ఉస్సు రన్నాడు. పోయి తిరిగి మంచముపై పండుకొనినాడు. ఆయన శరీరము శ్రమను పొందినది. మనస్సు శ్రమను పొందినది. ఇంద్రియములు ఉద్రిక్తములైనవి. ఆయన తన కుమార్తెను చూచినాడు. ఆమె ఇంకను వాతాయనము వద్దనే నిలబడి యున్నది. మందిరము లోని రత్నదీపముల కాంతిలో నామె ఏ దేవతయో శాపవశమున భూమిమీద అవతరించి, శాపమునకు పూర్వము తాను వలచిన పురుషుని ఎవ్వనినో తలంచుకొనుచు విప్రయోగదుఃఖమును పొందు చున్నది వలె నున్నది. ఈ భావము తనకు కల్గగా మహారాజు కడు దుఃఖితు డైనాడు. కుమార్తె యొక్క సర్వ జీవితావస్థయు నాయునకు కన్నుల ముందు సాక్షాత్కరించినట్లు లైనది. బయట వర్షము గూడ కొంతకు కొంతగా తగ్గినట్లు లున్నది. మరల పౌండ్రకుని కంఠము ముందటి వలెనే శ్రావ్యమై విన్పించుచున్నది.

"నిర్యాత త్యజతత్రాసం
గోపాస్స్త్రీధనార్భకాః
ఉపారతం వాతవర్షం
వృద్రప్రాయాశ్చ నిమ్నగాః."

అంతలో పెద్ద ధ్వని గూడ నైనది. పౌండ్రకుడు చేత ధరించిన కృతక పర్వతమును క్రింద పడవేసిన ట్లున్నాడు. సుదక్షిణయు విచారముతో తండ్రిని దరిసినది. మహారాజు కనుకొలకులలో నీరుగా కుమార్తెను తిలకించినాడు.

"తల్లీ !"

సుదక్షిణ మాటాడలేదు. మౌన మవలంబించి నిలబడి పోయినది. ఆమెకు అప్పుడు దుఃఖము లేదు. సుఖమును లేదు. జీవితమును గూర్చిన ఆలోచన లేదు. ఆమె పౌండ్రకుని గూర్చి ఆలోచించు చున్నది. నిజముగా నిది ఉన్మాదమా ! అంతటి మధురమగు కంఠస్వరమును తాను అప్పుడే విన్నది. అది పౌండ్రకుని కంఠస్వరమువలె లేదు. ఎవ్వరో అతిలోకగాయకుడు వేణువును మొరసినట్లు లున్నది ఆ స్వరము. ఆమెకు అతని ఈ చేష్టయు, అతని ఆ స్థితియు గూడ నర్థముకాలేదు.

మహారాజు మరల నామెను సంబోధించినాడు.

"తల్లీ !"

"ఏమి ! నాన్నా !"

"నీవు పౌండ్రకుని గూర్చి ఆలోచించు చున్నావు. నీవు వెడలిన తరువాత పౌండ్రకుడు నా దగ్గరకు వచ్చినాడు. వచ్చి 'మాతుల ! నేడు గోవర్ధనోద్ధరణము నీవు తిలకించవలయును'' అన్నాడు. నేను ఏమో—అనుకొనినాను. తరువాత జరిగిన దంతయు నీవు చూచితివి. ఇట్టి ఉన్మాదికి నిన్ను ఇచ్చుచున్నాను.''

సుదక్షిణ మాటాడలేదు. మహారాజు మరల ఇట్లు లనినాడు : 'తల్లీ ! ఇది నేను చేసుకున్న కర్మము. వీడు తల్లిదండ్రులకే గాక, నాకును గండముగ నుద్భవించినాడు. అది నాకు తెలియు చునే యున్నది. నేడు వీడు ఇట్టి డనుకొనలేదు. ఇదియేమో విచిత్రముగ నున్నది''

సుదక్షిణ మాటాడలేదు. మహారాజునకు గూడ ఏమి మాటాడవలయునో తోచలేదు. ఆయనకు తిరిగి తన్ను అనారోగ్య మావేశించుచున్నట్లు లున్నది. తిరిగి కుమార్తెతో మాటాడవలయు ననుకొనెను కాని, మాటాడలేకపోయెను. అంతవరకును తండ్రి వంకనే సుదక్షిణ చూచుచున్నట్లు లుండెను. నిజమునకు ఆమెకు ఆయన కన్పించుట లేదు. బృందావనము కన్పించుచున్నది. బృందావనములో వర్షము పడుచున్నది. ఆ వర్షము ఘోరముగ నున్నది. శిలలు ధారాపాతముగ కురియు చున్నవి. ఎవ్వడో బాలుడు నీలమేఘమును పోని శరీరమువాడు. తటిత్తులను పోని కన్నులవాడు. వాని ఆ కన్నులేమో వెల్గును చిమ్ముచున్నవి. అంతటి వర్షములోనను, అంతటి మేఘములతోడి చీకటి లోనను, ఆ కన్నుల కాంతిలో గోవర్ధనము కన్పించు చున్నది. ఆ బాలుడా పర్వతమును గోటితో ఎత్తినాడు. అనాథ లందరు ఆ గిరి క్రింద తలదాచుకొన్నారు. ఆ మూర్తి చిన్నది. చిన్నదియు కాదు. తాను వినిన త్రివిక్రమావతారమును పోలి యున్నది.

"సుదక్షిణో!"

ఆ కంఠము ఆ బాలుని కంఠమువలె నున్నది. సుదక్షిణ అటు తిరిగినది. "స్వామి ! వచ్చినారా !" అన్నది. పౌండ్రకుడు హఠాత్తుగా గుమ్మములో నాగిపోయినాడు.

"సుదక్షిణ !"

"ఎవరు ! స్వామి ! మీరా ! ఎవ్వరో అనుకొనినాను'' అని నవ్వినది. ఆ నవ్వులో విచారమో ఆనందమో ! పౌండ్రకునకు అందులో విచారము ధ్వనించినది. మహారాజునకు ఆనందము విన్పించినది.

ఆయన ఆశ్చర్యముతో తన కుమార్తెను తిలకించినాడు.

"తల్లీ ! నేను మూఢుడను'' అనినాడు.

(సశేషం)

# నాఫాన్ మెయిల్

14వ పేజీ తరువాయి

లని అభిలషించే అభిమానులకు నాపై ఆగ్రహం కలిగి వుండవచ్చు. అందుకు నన్ను మన్నిస్తారని ఆశిస్తాను.

ఈ రోజుకీ, రాత్రి పది గంటలైనా—షూటింగ్ నుంచి రాగానే అభిమానుల ఉత్తరాలన్నిటినీ చదవనిదే నిద్రపోను. ఈ ఏడు సంవత్సరాలుగా వచ్చిన లేఖల్ని, పెద్ద ట్రంక్ పెట్టెలో భద్రంగా దాచాను. ఒకరోజున ఆ పెట్టె సర్దాలని ఉత్తరాల్ని కట్టలుగా కట్టి పెట్టెపైనవుంచి షూటింగ్‌కు వెళ్ళిపోయాను. తిరిగి ఇల్లు చేరేసరికి ఆ కట్టల నెవరో సవరించినట్లు కనబడింది. అందులో కొన్ని ఉత్తరాలనుతీసి మా వంటవాడు నెయ్యి వెచ్చపెట్టడానికి ఉపయోగించాడట. ఈ విషయం తెలియగానే నా మనస్సెంత బాధ పడిందో మాటల్లో చెప్పలేను. కళ్లలో నీళ్ళు సుడులు తిరిగాయి.

ప్రతిక్షణం నా భవిష్యత్తును తీర్చిదిద్దగల్గినవీ, అభిమానపాత్రమైనవీ అయిన ఆ లేఖల్ని నా జీవితాంతం అతి జాగ్రత్తగా దాచాలనేదే నా కోరిక. ఆ కోరికను నెరవేర్చుకోగలననే నమ్మకం, ధైర్యం నాకున్నవి. ☆

# చక్కాని కథ

13-వ పేజీ తిరువాయి

"గొప్ప చిక్కే తెచ్చిపెట్టావు కదరా. మొదట నువ్వెవరో ఆ అమ్మాయికి తెలియాల్రా. నువ్వో పెద్ద నటుడివనీ, ఆతరువాత ( రచనలు బుద్ధిగా తిరిగొచ్చేసినా ) ఓ రచయితవనీ గట్టా తెలియాలి.... ఆ గొప్ప అయిద్యారా. ఈ దెబ్బతో ఆ రింగుల మ్మాయి నిన్ను లవ్‌చేసి పారేస్తుంది నువ్వు వద్దన్నా సరే.

"ఏమిట్రా అది?"

"మరిమొదటమనం ఒప్పందంచేసుకున్నఫీజు."

"అబ్బ వెధవ సస్పెన్సుతో చంపక అస లదేవిటో అఘోరించరా."

"—బ్బేఅదేంలాభంలేదు. ముందుకాంటీన్‌కిపద."

"నీతో ఒక చావుకాదురా కిష్టిగా"

ఇద్దరూ కాంటీన్‌కి దారితీశారు. అక్కడ రెండు రూపాయిలకి పన్నెండు నయాపైసలు తక్కువగా బిల్లు చెల్లించుకొచ్చాక తాపీగా సంగతి బయటపెట్టాడు క్రిష్ట.

ఇద్దరు ఆ అమ్మాయి ప్రస్తుతం చదువుతున్న కాలేజీ మునలివిద్యార్థులే కాబట్టి ఓల్డు బోయిస్ ఎసోసియేషన్ తరఫున ఒక డ్రామా వేసి, అందులో సారధికి ప్రైజు కొట్టుకొచ్చే పోర్షన్ తీసుకుని తెగ షైనైపోతున్నాడు. మొదట అంతా విని ఎగిరి గంతేసి చివరకి చప్పగా చల్లారిపోయాడు సారథీ.

"ఓస్....నాటకంలో ప్రైజువచ్చిన వాళ్ళం దర్నీ ప్రేమిస్తూ కూచుంటుందనుకున్నా వేమిట్రా ఆ అమ్మాయ్. ఏరా నీ బుర్ర ఈమధ్య ఇంత ఒట్టి పోయింది."

"అబ్బ అది కాదురా అలా సాధ్యమైనంత వరకూ ఆ అమ్మాయి దృష్టి , నాకర్షించాల్రా"

"ఓ. కే!"

నాటకంనాడు తెరసందులోనుండి ఆ అమ్మాయిని చూపించాడు సారధి క్రిష్ణకి. కాని మధ్య ఎవడో బుర్రలేని వెధవాయ్ బుర్ర అడ్డుగా పెట్టటం వల్ల కనిపించలేదు. తరువాత నోట్లో గొలుసు పెట్టుకుని పువ్వులూ, తల్లో రిబ్బన్లూ, పువ్వులతో సహా ఫుల్ బ్లాలో తయారైన అమ్మాయిని చూపించాడు. ఒక్కసారి పెంకులు రాలినట్టు ఫెళఫెళా నవ్వేసి సారథి వీపు చిట్లగొట్టేశాడు క్రిష్ట.

"తర్వాత చెప్తాను" అన్నాడు మళ్ళీ సారధి ఏమీ అడక్కుండానే.

నాటకంలో నటిస్తున్నంతసేపూ అదే దృష్టి సారధికి. మధ్య ఎవరో చిన్నమ్మాయి పిలిస్తే ఎటో కాసేపు వెళ్ళి మళ్ళీ తిరిగొచ్చేసింది. ప్రైజు కొట్టాడు కాబట్టి ఆ అమ్మాయి వచ్చి "కంగ్రాచ్యులేషన్స్" చెప్పకూడదా అనుకుని ఆశతో చూశాడు; అలాటి ప్రమాదమేమీ జరగలేదు.

"ఆ అమ్మాయి పేరు సంధ్యరా. మన శర్మగాడు లేడూ! మహారాణీపేటలో వాడింటి వెనకాతలే సిల్లల్లానూ.శర్మగారింటికిరోజూతొమ్మిదింబావుకివస్తుంది లే కాలేజికి వెళ్ళేముందు. కావాలంటే ఎవరిదో వెదుకుతున్నట్టు వాళ్ళిల్లు చూద్దాంలే. ఈలోగా ఆ అమ్మాయి ఎక్కడేనా కనిపిస్తే మాట్లాడెయ్. సీరియస్‌గా నీ ప్రేమని గురించి చెప్పెయ్"

"మరి చెంప సంగతి"

"చెప్పేసి పరిగెత్తుకొచ్చెయ్"

"మరి ఆ అమ్మాయి ఉద్దేశం ఎలా తెలుస్తుంది"

"మిగతాదంతా నేజూసుకుంటాలేద్దూ. నేను వెనక్కే ఉండి నిన్ను తిట్టుకుంటుందో, జాలిగా నవ్వుతుందో ఏదో చూసి చెప్తాను."

ఒక ఆదివారంనాడు....

మధ్యాన్నం మూడూ ఇరవై రెండుకి మొదలెట్టిన టాయిలెట్ జాగ్రత్తగా నాలుగూ ఏభై ఐదుకి పూర్తిచేసాడు సారధి. ఇంతలో క్రిష్ణ వచ్చాడు సారథి ఇంటికి. వస్తూనే మొదట సారథివైపు చూసి నమస్కారంచేసి, "సారధి ఇంట్లో ఉన్నాడాండీ" అని తాపీగా అడిగాడు. సారధి క్రిష్ణవైపు వింతగా చూసి, "ఈమధ్య ఐడిఫెక్ట్‌గట్రా వచ్చిందేంట్రా కొంపదీసి" అడిగాడు.

గొంతుబట్టి సారథేనని పోల్చుకుని,

"హారి నువ్వేట్రా ఎవరో అనుకున్నాను. ముఖం మీద అంత బూడిదా, నీ పువ్వులస్లాకూ చూసే సరికి. అదిట్రా తయారయే విధానం? ఛఛ ఆ స్లాకు విప్పెయ్. సుబ్బరంగా 'ఫుల్‌వైట్'లో తయారవు. ముఖం మీద అంత పౌడరూ తుడిచెయ్. కావాలంటే 'లోషన్' పట్టించు. పదో, పన్నెండో వెండ్రుకలు లవ్‌లాక్‌లా ముందుకు లాగెయ్!" క్రిష్ణ డైరెక్షన్‌లో తయారయేసరికిమరోఅరగంట పట్టింది ఇద్దరూ బీచ్‌కి బయల్దేరేసరికి.

"ఒరే గుండె కొట్టుకుంటుందిరా?" నీరస పడిపోతూ అన్నాడు సారధి బీచి దగ్గరపడుతుంటే.

"సో నువ్వు ఇంకా బ్రతికే ఉన్నావన్నమాట. గుండె వారికే కొట్టుకొనును."

"ఇలాటి విట్లు ఓ రెండు చెప్పకూడదూ ఆ అమ్మాయిదగ్గర వేస్తాను."

"ముందు మాట్లాడుదూ చూద్దాం"

"అంత పిరికివాణ్ణనుకున్నావురా" అంటూనే అల్లంత దూరాన సంధ్యా అనూరాధా కనిపించేసరికి చప్పబడిపోయాడు.

"ఒరేకిష్టిగా మాటాళ్లేనురా,భయంవేస్తుందిరా."

"నీ మొహం శర్మగాడికి మెల్లగా ఇస్త్రీకొట్టి సంధ్య ఫోటో ఓటి సంపాయిస్తాగాని "సంధ్యా" వందనం చేస్తూ కూచో".

"క్రిష్ణా నా ప్రణయరథ సారథి ఆ పనేదో చెయ్యకూడదూ, నీకు పుణ్యముంటుంది"

"సంపాయిస్తాగాని ముందు సంధ్యతో నీ ప్రేమ సంగతి చెప్పెయ్"

"వెళ్ళక తప్పదంటావ్"

"......ంటాను."

"సరే"

ఇద్దరూ విడిపోయా రక్కడే.

సారధి వణకుతున్న కాళ్ళతో మెల్లంగావారిం జేరం జేరి గొంతుసవరించుకుని "ఏవండీ" అన్నాడు. గొంతులోంచి శబ్దం రాలేదు గాలితప్ప. మళ్ళీ ధైర్యంగా 'ఏవండీ' అన్నాడు. వెనక్కి తిరిగి చూశారు సంధ్యా, అనూరాధా.

అంతే.....

దాంతోపరుగుచ్చుకున్నాడుఅంతాచెప్పేశాననుకుని.

"మిల్కాసింగ్ గెడ్డం మీసం తీయించేసి ఇక్కడ పరుగు.....ప్రాక్టీసుచేస్తున్నా డేవిటి?" అంది. వింతగా గడ్డానికి చూపుడువేలు ఆనిస్తూ సంధ్య.

క్రిష్ణ ఈ మాటల్ని విని వాడివెనక్కి పరిగెత్తి వెళ్ళి వాడి కాలరు పట్టుకు ఆపాడు.

"హై.....హై.....పి....హి....హొ...న్హా....రా" అన్నాడు సారధి అలిసిపోతూను.

"నోరుముయ్ వెధవాయ్. ఏవండీ అని పిలవగానే మాట్లాడేసినట్టేట్రా? నీ పరుగూ, హడావిడీ చూసి మిల్కాసింగూ, కృపాల్‌సింగూ గట్రా అని కేకలేసింది. లాభంలేదురా అబ్బి! ప్రేమని విత్‌డ్రా చేసుకో ఫోటో కూడా దండగరా!"

"ఒరే ఇవి కాళ్ళుకావు చేతులనుకో. ఇది తప్పించి నువ్వేది చెయ్యమన్నా సరే చేస్తా."

"ప్చ్......ఏది నీకంత ధైర్యం లేదురా"

"ఆ అమ్మాయిని చూసేసరికే హడలు పట్టుకుంటే ఏం చెయ్యమంటావ్?"

"బ్రిగిడాకి ఉత్తరం రాయమంటాను."

"రాయాలా మరి."

".......లి మరి"

"సరే"

ఇద్దరూ తంటాలుపడి ఒక ఉత్తరంలాంటిది తయారుచేశారు. దాన్ని సారధిచేతికిస్తే వారం రోజులైనా పోస్టుచెయ్యలే. చివరికి లాభం లేదని క్రిష్ణే ఆ ఉత్తరాన్ని తీసుకుని పోస్టు చేసేశాడు.

ఇక అక్కణ్ణించి రోజుకి ఏభై అయిదుసార్లు ఉత్తరానికి జవాబులేదేరా అని బావురుమనడం మొదలెట్టాడు. మళ్ళీ సంధ్య అల్లంతదూరాన కనిపిస్తే చాలు చెంపకి చెయ్యి అడ్డంపెట్టుకుని మరీ తప్పించుకొనేవాడు.

రెండ్రోజుల తరువాత క్రిష్ణ హడావిడిగా వచ్చేసి పిడుగులాంటి వార్త సారధిచెవిలో వడేశాడు. వీళ్ళు పోస్టు చేసిన ఉత్తరం తిన్నగాపోయి అమ్మాయి నాన్న చేతిలో పడిందట. అది పట్టుకుని సారధికోసం బుర్రమీసాలూ గట్రా పెద్ద పరంజామాతో ఊరంతా వెదికేస్తున్నాట్ట.

దాంతో హడలుపుట్టుకొచ్చింది సారధికి.

"ఎలారా ఏం చెయ్యడం."

"ఆలోచించి చెప్తా ఏం చెయ్యటమోను! ఈలోగా డిఫెన్సు ఆడుతుండు."

క్రిష్ణ సారధిని ఇంత ఆపదనుంచి ఎలా రక్షించడమా అని సముద్రంలోకి చూస్తూ ఆలోచిస్తున్నంతలో.........

అల్లంత దూరాన......

సంధ్యా, సారధీ......

కులాసాగా ఏవో కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ కనిపించారు.

వాళ్ళని 'డిస్టర్బ్' చెయ్యలేకా, 'సస్పెన్స్' భరించలేకా మర్నాటివరకూ గడిపాడు క్రిష్ణ.

అసలు సంగతేమిటో చెప్పేముందు సారథి, 'ఫీజా' గట్రా రద్దుచేయించుకుని దాన్ని చిన్నసైజు పార్టీ కిందికి మార్పించి, అసలుసంగతి బయటపెట్టాడు.

తను రాసిన ఉత్తరం సంధ్యకి సురక్షితంగా చేరినట్టూ, ఎటొచ్చీ ఆ అమ్మాయి రాసిన ఉత్తరం వాళ్ళ నాన్నగారిచేతిలో పడినట్టూ, అది సంధ్య తను రాసిన కథలోని ఉత్తరం అని 'కోసినట్టూ' బ్రిగిడా ఫాదర్‌కి సారథి ఒక రచయిత అని తెలియటంచేత (సారధి నాన్నగార్కి మీసాలాయన కాఫీ స్నేహితుడు) కుమారీ రత్నం రాసిన కథలోని పార్టు చూపించటానికి సారధికోసం వెదుకుతుంటే శర్మ అదంతా చూసి అపార్థంచేసికొని క్రిష్ణ హెచ్చరించినట్టూ.. కాని ఇక్కడితో కథ ఐపోయింది. ★



GP







# సంక్రాంతి పండుగ

11-వ పేజీ తరువాయి

అవుతుంది. సూర్యుడు దినదిన ప్రవర్ధమానుడగుచున్నట్లు గోచరిస్తుంది.

అందుచేతనే ...ర్వం పశ్చిమ ఆశియా ఖండంలోనూ, ఐరోపాలోనూ ఉత్తరాయణం మొదలుపెట్టే దినం, మిత్ర క్రతువుగా ఒక పెద్ద పండుగగా చేసుకొంటూండేవారు. ఆయా దేశవాసులందరికీ ఈ పండుగకు ప్రబల కారణం వాస్తవంగా కన్పించేది. మహామారివంటి చలికాలానికి ఉత్తరాయణం స్వస్తి చెప్తుంది. లోకాన్నంతా మంచుతో మృత్యుప్రాయంగా కప్పివేసే చలికాలం, ఉత్తరాయణం ఆసన్నమైన నాటి నుండీ, మంచులాగానే కరిగిపోవారంభిస్తుంది. చలితో నాటివరకు నిశ్చేతన్యమైన ప్రకృతి, సంచలనం క్రమంగా సమకూర్చుకొని వికసింప నారంభిస్తుంది. లోకం అంతా విశ్వ చిగురుపోసగలాగ వసంతం ఉదయిస్తుంది.

కాని మనదేశంలో ఆ దేశములవలె చలికాలం అంతభయంకరం కాదు. ఒక విధంగా చూస్తే ఎండాకాలమే దుర్భరమయినది. మన రుద్రుని సంహారకోపం మిడిఎండవలె ఎర్రగా ప్రజ్వలిస్తుంటుంది. అయినప్పటికి సంక్రాంతిపండుగలో మొదటి దినమయిన భోగినాడు భోగిమంటలతో మన దేశస్థులు చలికాలానికి స్వస్తి చెప్పి, వచ్చుటి కాలమును ఆహ్వానిస్తారు. ఉత్తరాయణ సంకల్పము నుచ్చరిస్తూ, ఉత్తరాయణకాలమందు వచ్చు సంతోషదినములను, ఆభాసనాటకములుగా చేసి సంక్రాంతిపండుగ దినాలందు వినోదిస్తారు.

ఇవన్నియు గమనించగా, మన సంక్రాంతి ఒక పూర్వపుసంస్కృతిననుసరించిన పండుగగా తోస్తుంది. బహుశా చరిత్రకారులు, పండితులు అన్నట్లు ప్రాచీనార్యులు మధ్యఆసియానుండే మనదేశమునకు తరలివచ్చినవారగనే ఉండియుండవచ్చును. వారు ఆ దేశములందు వారున్నప్పుడు, సూర్యారాధన ననుసరించి చేసుకొనే ఉత్తరాయణ ప్రాథమిక సంకల్పము, సంక్రాంతిపండుగగా నేటివరకు మన దేశములో మిగిలిపోయి ఉండవచ్చును.

అయినప్పటికీ సంక్రాంతిపండుగ ననుసరించి, మరొక సందేహము మనలను బాధించకమానదు. ఏలనన, నిజముగా డిసెంబరు ఇరువదిఒకటవ తేదీకి దక్షిణాయనము పూర్తి అగును. డిసెంబరు ఇరువదిరెండవ తేదీనుండియే ఉత్తరాయణం మొదలు. కాని మనవారు, ఉత్తరాయణం ప్రారంభమయిన తర్వాత దాదాపు ఇరువదినాలుగు దినములకు, ఉత్తరాయణ సంకల్పమును చేస్తూ, సంక్రాంతి పండుగలను చేసికొనడం కొంత ఆశ్చర్యమును కలిగిస్తూనే ఉంటుంది. ఇందుకుగల కారణాలు, మనకు జ్యోతిష్యశాస్త్ర పండితులే చెప్పవలసి వుంటుంది.



# న్యూఢిల్లీ లేఖ

9—వ పేజీ తరువాయి

అనవసరములైనవని స్పష్టమవుతుంది. ఈకాలంలో పీం. శతీరప్రాంతంలో తమ పలుకుబడిని సుస్థిరం చేసుకొనడం, ఇండోనేషియా దీవులలో వ్యాపారం అభివృద్ధి పరచుకొనడం, చైనా, జపాన్ దేశాలతో పరిమితంగా సంబంధాలు ఏర్పరచుకొనడం మినహా వారు రాజకీయంగా సాధించింది అంతగా ఏమీ లేదనే చెప్పవలసివస్తుంది."

"17వ శతాబ్దాంతానికి హిందూమహాసముద్రంలో పోర్చుగీసువారి నౌకాయానాలు అంతమొందినా, గోవాలో మాత్రం వారి స్థావరం చెక్కుచెదర లేదు."

"గోవాపట్టణంలో చర్చికి ప్రభుత్వానికంటే ఎక్కువ అధికారాలు ఉండేవి. 1517 లో ఫ్రాన్సిసియన్ల పలుకుబడి సుస్థిరమైంది. 1534 లో గోవాలో ఒక బిషప్ నియుక్తుడయ్యాడు. మతయాలలో దూరప్రాచ్య దేశా లన్నిటికీ ఈయనే అధికారి. క్రైస్తవేతరుల పట్ల తగినంత కాఠిన్యం వహించటం లేదని డాన్ జాన్—3కి తోచింది. వారిని నిర్మూలించేందుకు కట్టుదిట్టమైన చర్యలు తీసుకొనవలసిందని అతడు తన ప్రతినిధి జాన్ డి క్రాస్ట్రోను ఆదేశించాడు. ఈ ఆదేశాన్ని అనుసరించి హిందూ దేవాలయాలు ధ్వంసంచేయబడ్డాయి. వాటి ఆస్తులను స్వాధీనపరచుకుని క్రైస్తవ మఠాధికారులకు పంచిపెట్టారు. క్రైస్తవమతం పుచ్చుకున్నవారికి ప్రత్యేక సదుపాయాలు కలిగించారు. మతంపేరుతో దౌర్జన్యచర్యలు మెచ్చు మీరాయి. 'దేవదూతలమని చెప్పుకుంటున్న మీరు నిజంగా సెయింట్ థామస్ అనుయాయులేనా' అని పోర్చుగీసు మహాకవులలో ఒకడైన కెమోన్స్ పెట్టిన చివాట్లు వారిచెవి కెక్కలేదు."

బ్రిటిష్‌వారు 150 సంవత్సరాలు పరిపాలించినా ఈ దేశంలో ఫ్రెంచివలసలనుగాని, పోర్చుగీసువలసలనుగాని తాకలేదు. కాలగతిని గమనించిన ఫ్రెంచివారు, బ్రిటిష్‌వారితోపాటు భారతదేశాన్ని విడిచి వెళ్ళారు. పోర్చుగీసువారు అదని చేయలేదు; అందువల్లనే వారిమీద బలప్రయోగం చేయవలసివచ్చింది. పోర్చుగీసుపాలన అంతం కావాలనే భారతదేశం వాదాన్ని సూయజ్ కు ఇరువైపులా తిరస్కరించినవా రెవరూ లేరు. కాని ఇందుకు అనుసరించిన పద్ధతి మాత్రం కొందరికి నచ్చలేదు. ఈ సందర్భంలో లండన్‌నుంచి వెలువడే డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక, అడ్లాయ్ స్టీవెన్సన్ చేసిన విమర్శలు ఎలా ఉన్నా, అకళంక దేశభక్తుడు శ్రీ జయప్రకాష్ నారాయణ్ ఏమి అన్నారో ఉటంకిస్తున్నాను:

"ఉత్తమలక్ష్యాన్ని అయినా హింసాయుత పద్ధతులద్వారా సాధించరాదన్న నీతికి కట్టుబడి ఉన్నా నేను, నా దేశం ఆ పద్ధతులను అనుసరించవలసి వచ్చినందుకు విచారం వెల్లడిస్తున్నాను. 14 సంవత్సరాలకు పూర్వం చారిత్రక శక్తులు మనకు అనుకూలంగా ఉండి, నిరాయుధంగా విదేశీ పరిపాలకులను ఎదిరించి దేశంలో అత్యధికభూభాగానికి దాస్యవిముక్తి కలిగించాము. అప్పటికంటె ఇప్పుడు మనం ఎన్నో రెట్లు బలపడ్డాము. చారిత్రకశక్తులుకూడా ఎంతో అనుకూలంగా ఉన్నాయి. అయినప్పటికి ఈనాడు స్వదేశంలో కొద్దిపాటి ప్రాంతానికి అహింసాపద్ధతులలో విమోచన కలిగించలేకపోయాము. ఇందుకు ప్రధానమంత్రినిగాని, భారతప్రభుత్వాన్నిగాని నేను నిందించటంలేదు. శాంతిపరిరక్షణకు వారి దీక్ష నిర్దుష్టమైనది. కాని వారుకూడా దౌర్జన్యాన్ని సంపూర్ణంగా త్యజించలేదనడానికి భారత సైనిక బలాల ఉనికే ప్రత్యక్షప్రమాణం. అంతర్జాతీయ వివాదాల పరిష్కారానికి బలప్రయోగం తగదని ముక్తకంఠంతో చాటి, శాంతియుతపద్ధతులను విరివిగా ప్రచారంచేసిన ఖ్యాతికూడా వారికే దక్కింది. అందువల్ల గోవాలో ఇప్పుడు వారు తీసుకొన్న చర్యకు, ఆదినుంచి వారు అనుసరించిన వైఖరికి వైరుధ్యం ఏమీలేదు సరికదా వారి ప్రతిష్ఠ దెబ్బతినదు కూడాను."

# న్యూఢిల్లీ లేఖ

"మరి ఇప్పుడు నిందార్హు లెవరంటే, అహింసా యుతసమాజాన్ని నిర్మించడానికి పాటుపడుతున్నామని ప్రకటించుకుంటున్న మావంటివా... కచ్చితంగా చెప్పాలంటే దీని భారమంతా శాంతి సేనానాయకుడు వినోబామీద, వారి సైనికులమైన మామీద పడాలి."

విదేశాలతో మనదేశానికి ఏర్పడిన వివాదా... పరిష్కారానికి హింసారహితమార్గాలు సూచించే శక్తి మనకు లేదని బుద్ధిపూర్వకంగా మేము వాటిని పెడచెవినపెట్టాము. పరిష్కార మార్గాల... ద్వైతమే సూచించాలనుకోవడం పొరపాటు. సహజమైన... పని ఎవరికి వారు చెయ్యాలి. శాంతియాత్రలు భూదాన, గ్రామదాన ఉద్యమాలు పూర్తిఅయ్యే వరకు సమస్యలు మనకోసం వేచిఉండవు. గోవా సమస్యవంటిది ఎదురైనప్పుడు ఒక్క సత్యా... గ్రహి మిగిలిఉన్నా అతడు తనకర్తవ్యాన్ని నిర్వ... హించాలి. కర్తవ్యపాలనంవల్ల శక్తి వస్తుందికాని... సృష్టతవల్ల రాదు. అహింసాయుతమైన... తీసుకొనడానికి ఈనాడుకూడా లక్షలాది జనం సంసిద్ధంగా ఉన్నారని నిస్సందేహంగా చెప్పవచ్చు... లోపించిందల్లా నాయకత్వమే. శాంతి—యుద్ధాల... సమస్య కేవలం ప్రభుత్వాలకే విడిచిపెట్టి వీల... లేదు. ఏ ప్రభుత్వం హింసారహితపద్ధతులనే అంట... పెట్టుకుని ఉండలేదు. హింసారహితమైన చర్య... తీసుకొనడానికి తగినవారు ప్రజలుమాత్రమే... అలాంట కర్తవ్యపాలనకు భారతీయులకంటే... అర్హులైనవారు ప్రపంచంలో మరెవ్వరూ లేరు."

గోవా విమోచనచర్య అనంతరం, ఇటువంటి... ఇతరదేశాలలో కూడా జరుగవచ్చునని భావం ప్ర... లింది. 'డచ్‌వారి అధీనంలో ఉన్న పశ్చిమ న్యూగినియాకు విమోచన' కలిగించేందుకు ఇండో... నేషియా అధ్యక్షుడు అప్పుడే కత్తిదూశాడు. డచ్‌వారిని శాంతిమహా సముద్రంలోకి తోసివేసేం... దుకు శ్రీ సుకర్ణోకుగల హక్కును సవాలుచేసే... అధికారం ఇప్పుడు ఎవరికీ లేనిమాట వాస్తవమే. కాని ఇండొనేషియన్లు న్యూగినియన్లు ఏకజాతివార... కారు. సాంస్కృతికంగా, రాజకీయంగా వారిమధ్య... ఏవిధమైన సహమ్యం లేదు. ఇండొనేషియా రి... ప్లిక్‌గా అవతరించకముందే న్యూగినియా... ద్వీపం సగం డచ్‌వారి అధీనంలోను, సగం ఆస్ట్రే... లియన్ల అధీనంలోను ఉండేది. ఇప్పుడు ఇండొ... నేషియన్లు దానిని ఆక్రమించుకుంటే అది వారి... వలసగా మారిపోతుంది. వారు దానిని స్వప్ర... యోజనాలకు వినియోగించుకుంటారు.

పాశ్చాత్య వలసవిధానాన్ని ఇతర ఆఫ్రో-ఏషియన్ రాజ్యాలతోపాటు భారతదేశంకూడా ప్రతిఘ... టిస్తున్నదిగనుక న్యూగినియాపై దండెత్త... కుండా డా॥ సుకర్ణోను నివారించే అవకాశం లేదు. కమ్యూనిస్టులకు కావలసింది పాశ్చాత్యరాజ్యా... ల మైక్యతను నాశనంచెయ్యటమేకాబట్టి, శ్రీ సుకర్ణో ఉద్యమాన్ని వారు ప్రోత్సహిస్తారు... సిద్ధాంత రాద్ధాంతాలలో తలమునకలై, కమ్యూ... నిస్టుల ఆధిపత్యం ఎక్కడ ఏర్పడిపోతుందోనని భయంతో సదా సతమతమయ్యే అమెరికా ఈ వివాదంలో జోక్యం కల్పించుకోదు. ★

# యువ ప్రపంచం

## వర్ణాంతర వివాహాలు

నేటి యువప్రపంచాన్ని యెదుర్కొంటున్న అతిముఖ్యమైన సమస్య వర్ణాంతరవివాహాలు. వర్ణాంతరవివాహాలు విరివిగా జరగాలంటే ఎవరు ప్రోత్సహించాలి........? ఎటువంటివారు ముందంజ వేసి ఆదర్శప్రాయులవాలి? అన్న విషయాన్ని ముందు చర్చించాలి. వర్ణాంతరవివాహం చేసుకోబోయే యువతీయువకులకు ప్రధానంగా కావలసినవి: విశాల దృక్పథం, మనోస్థైర్యం, ఆర్థిక స్థోమతు. ముఖ్యంగా ఇవున్నవారైతేగాని, వర్ణాంతరవివాహం చేసుకొని సుఖపడలేరు. వివాహం చేసుకున్నవారి మనస్సులలో ఒక కులం వ్యక్తి మరొక కులం వ్యక్తిని వివాహమాడినప్పుడు తనేదో త్యాగం చేశానన్న భావన గాని,వారిది ఫలానా కులంగదా అనిగాని అనుకున్నప్పుడు, ఉద్రేకంలో వారు వివాహం చేసుకున్నా వారు తరువాత సుఖపడలేరు. వారిలో జాతి సంకరమైపోతుందన్న భావంగాని, కలగబోయే సంతానం విషయంలో బెంగగాని ఉండకూడదు. అటువంటి విషయాలలో మన దేశ నాయకులైన గాంధీ, నెహ్రూ, తదితర ప్రముఖ కులీనకుటుంబాలను పరిశీలిస్తే, అవి ఎంతగా సంకరమైపోయాయో తెలుస్తుంది. అలా సంకరమవడమనేది మన విశాలదృక్పథానికి, జాతి సమైక్యతకు, మెచ్చదగ్గ చిహ్నమేగాని, వాపోవలసిన విషయంమాత్రం కాదు. అయితే ఈ విషయంలో ముందుకువచ్చి నిలబడవలసినవారు ముఖ్యంగా ధనిక యువకులు. వీరిలో పట్టాలు పుచ్చుకున్నవారూ, డాక్టరేటులు పుచ్చుకున్నవారు కూడా తలి దండ్రులు ఎక్కువ కట్నంతో తెచ్చిన అమ్మాయిలనే వారికి నచ్చకపోయినా వివాహం చేసుకుంటున్నారు. ఇక్కడే వస్తున్నది సమస్యంతా! గతవారంలో ఈ శీర్షికక్రింద వ్రాసిన శ్రీ రావుబాబుగారు ఈ సమస్యనే మొదటి ప్రశ్నగా వేశారు. నా ఉద్దేశ్యంలో ఇదెంతమాత్రం సమస్య కానేకాదు. ఆర్థిక స్థోమతు కలిగిన యువకుడు, పైగా స్వతంత్రంగా జీవించగల అతను, తనకు నచ్చిన జీవిత భాగస్వామిని ఎన్నుకొని, వివాహం చేసుకుంటే అది వారి తలి దండ్రుల ఆశలను, నిరాశలుచేసి, వారి జీవితశేషాన్ని అంతులేని ఆవేదనకు గురిచేసి, వారిని దూరంచేసినట్టవుతుందా? తలి దండ్రులుగా, వారు యువపడేది, కోరేది తమ సంతానంయొక్క సుఖమేగాని, దుఃఖంకాదుగా! అటువంటి పరిస్థితిలో వారి అభిరుచులకు భిన్నంగా వివాహంచేసి, వారు సుఖంగా జీవించలేకపోతే, — తలిదండ్రులుగా వారి ఆశలు నెరవేరినట్లయి, ఆవేధనలు చల్లారుతాయా? తగిన ఆర్థిక స్థోమతు ఉన్నవాడు, స్వతంత్రంగా జీవించి తన కుటుంబాన్ని పోషించుకోగలిగే తమ కొడుకు తనకు నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానంటే తలిదండ్రులు అభ్యంతరపరచడంలో అర్థంలేదు. ముఖ్యంగా వర్ణాంతర వివాహాలు ఉత్సాహంతో జరిపించవలసినది తలిదండ్రులే! ఒకవేళ మూర్ఖంగా, తమ తల్లి దండ్రులు పట్టుబడితే, యువకులు లొంగిపోకుండా తన ఆశయాన్ని, ఆదర్శాన్ని నెరవేర్చుకుంటే, తరువాత కన్నవారికి అందులోని విశాల దృక్పథం అర్థమవుతుంది. మధ్యమతరగతికి చెందిన యువకులు కూడా, తమ తలి దండ్రులు వారి ఆదాయాన్ని ఆశించేస్థితిలో లేనప్పుడు తప్పకుండా ఈవిషయంలో ముందంజవేసి, వర్ణాంతరవివాహాలు చేసుకోవాలి. వివాహం చేసుకునేటప్పుడు, స్థూలంగా హిందువులమనే దృక్పథంతోనే వుండాలిగాని, వారి మనస్సులో కులప్రసక్తి మెదలగూడదు.

ఆశలు, ఆదర్శాలు ఉన్నా వర్ణాంతరవివాహం చేసుకోలేని యువకులుకూడా కొంతమంది ఉండవచ్చు. తన తలిదండ్రులు, తను తెచ్చే జీతంపైనే ప్రధానంగా ఆధారపడినప్పుడు, తనకు పెళ్ళిళ్ళు కావలసిన అక్కచెల్లెళ్ళు, చదువులు చెప్పించవలసిన తమ్ముళ్ళు ఉన్నప్పుడు ఆ యువకుడు వర్ణాంతర వివాహం జోలికి పోవడం ఎంతమాత్రం ఉత్సాహపరచవలసినదిగాదు. ఆయువకుని హృదయం ఎంత విశాలమైనదైనా, అతనికి ఎంతటి ఉన్నతాదర్శాలూ, అభిప్రాయాలు ఉన్నప్పటికీ, అటువంటి యువకుడు వర్ణాంతరవివాహం చేసుకుంటే, అత్యంత క్లిష్ట పరిస్థితుల నెదుర్కొని, బాధపడవలసివస్తుంది. అంతే గాకుండా, కుటుంబాన్ని పైకితీసుకురావలసిన బాధ్యతనే విస్మరించినవాడవుతాడు. ఇకపోతే శ్రీ రావుబాబుగారు వేసిన రెండవ ప్రశ్న. ఉన్నతాదర్శాలు, ఆర్థికస్థోమతుగల యువకుడు, తమ వివాహంచేసుకోదలుచుకున్న యువతి, తన ఆశలకు ఆనకట్ట కట్టి, తన వరదాలకు వరదాలు వేసి, జీవితాంతం కష్టసుఖాల్లో పాలు పంచుకోడానికి సిద్ధమైనప్పుడు, ఆయువకుడు నిస్సంకోచంగా వివాహంచేసుకుని, అరమరికలులేని ఆనందమయజీవితాన్ని ప్రారంభించవచ్చు. త్యాగంచేస్తున్నామన్న ప్రశ్నేలేదు. తమ కన్నకొడుకుగాని, కూతురుగాని, సుఖంగా జీవిస్తున్నప్పుడు, ఏతల్లి దండ్రులూ బాధపడతారు. వారు కోరేది, సంతానంయొక్క సుఖమే! ఇక్కడే నేటి యువకులు ఒక విషయాన్ని బాగా గుర్తుంచుకోవాలి. ఈమధ్యనే ఓ వారపత్రికలో ప్రమదలకై ప్రత్యేకింప బడ్డ శీర్షికలో చదివాను. "ఓ బి. ఎస్. సి. చదువుతున్న యువతిని, ఓ యువకుడు, పెళ్ళిచేసుకుంటానని మాటయిచ్చి, నమ్మించి ఆమెనుండి శారీరకసుఖాన్ని పొంది, ఆమె తల్లికాబోతుందని తెలిసిన తరువాత, తన తల్లి దండ్రులు ఒప్పుకోవడం లేదని, తప్పించుకు తిరుగుతున్నాడట" ఈవిషయాన్ని చదివిననాడు చాలా బాధనిపించింది. యౌవనోద్రేకంలో, ఒకరినిచూసి వ్యామోహపడి కామాన్ని తీర్చుకోడానికై, ప్రేమని, పెళ్ళని, మాయమాటలు చెప్పి వారిని అన్యాయం చేయడం ఎంత గర్హ్యమైనదో ఆలోచించండి! అటువంటి సంకుచిత భావాలుగల యువకులున్నారంటే అది, నేటి యువప్రపంచానికే ఎంతో సిగ్గుచేటు! ఆ మోసపుచ్చిన యువకుని విషయం తీసుకుంటే, తనవారికి విరోధియై, తనదీ అన్నదానికి దూరమవడం ఇష్టంలేక ఆమెను త్యాగం చేశాడా? అది త్యాగమనిపించుకుంటుందా? అది క్షంతవ్యం కాని నేరం! ఇటువంటి సంఘటనల వల్లనే, వర్ణాంతర వివాహాలన్నా, ఆవిషయాలన్నా నేటి తల్లి దండ్రులు వెంటనే అంగీకరించలేక పోతున్నారని, నా విశ్వాసం.

నేటి యువప్రపంచంలో, ఉన్నతాదర్శాలూ ఆశయాలు, మనోనిబ్బరం గల యువతీయువకులు వారి ఆర్థికపరిస్థితి అనుకూలించిననాడు, తప్పకుండ, ముందంజవేసి, వర్ణాంతరవివాహాలు చేసుకోవాలి. వారివారి తల్లిదండ్రులు, తాత్కాలికంగా సుముఖులు కాకపోయినా, తరువాత వారే అర్థం చేసుకుని ఆదరిస్తారని నా నమ్మకం. మన దేశ నాయకులు, పదేపదే ఉపన్యసించే, జాతీయ సమైక్యతా, కులమత నిర్మూలన కావాలంటే, అది నేటి యువప్రపంచం మీద ఆధార పడి ఉంది. నేటి యువతీ యువకులంతా, ముందడుగు వేయాలి. వారు విరివిగా వర్ణాంతరవివాహాలు చేసుకుని, తరువాత వారికి మార్గదర్శకులవాలి. ఈ వర్ణాంతర వివాహాలపై, ఆవివాహాలు చేసుకున్న యువతీయువకులు, చేసుకోబోయే యువతీ, యువకులు, వారివారి అభిప్రాయాలు తెలియబరుస్తారని విశ్వసిస్తున్నాను.

ఎస్. చిట్టి వీరాచారి (హైదరాబాదు)

## శీర్షిక ప్రయోజనం

చివరకు యిదీ ఒక లెటరుబాక్సులాగే తయారవుతుందన్నారు మా వారు. ఆయనన్నట్టే "ఉత్తరాలకే" మరో పేజీ కేటాయించేరా అనిపిస్తోంది. యీ వారం శీర్షిక చూస్తే. అలాకాక, అర్హతకల వ్యాసాల్ని వారానికొకటి (మరీచిన్నవయితే రెండు) చొప్పున ప్రచురిస్తే, మన యువతీయువకుల విభిన్న మనఃప్రవృత్తులూ చక్కగా ప్రతిబింబిస్తాయి; సంపాదకులు శీర్షిక ఆరంభించే వేళ వెల్లడించిన ఆశాభావాలూ పరిపూర్తి నొందుతాయి. సహృదయులు ఇది గమనిస్తారని నా నమ్మిక.

శ్రీమతి జయంతిలక్ష్మి (బెంగుళూరు)

కవరుపైన 'యువప్రపంచం' శీర్షికకుఅని స్పష్టంగా వ్రాయాలి.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street, Madras-1. Chief Editor : S. Sambhu Prasad.

# సంక్రాంతి సంచిక

శ్రీ బాపు ఈ సంచికకు ముఖచిత్రమేకాక 'అంతరిక్ష వినోదం' కార్టూన్లు రెండు పేజీలు వేసి ఇచ్చారు. అంతరిక్షయానంమీద మరికొంత ఆసక్తి కలుగటానికి ఇవి తోడ్పడుతాయని ఆశిస్తున్నాము!

శ్రీ రంగనాథ్‌గారు కథానికల రచయితగా పాఠకులకు సుపరిచితులు. ఈ సంచికలో వారి నవల నొకదానిని ప్రారంభిస్తున్నాము. ఆంధ్ర ఒరిస్సారాష్ట్రాల సరిహద్దు ప్రదేశాలలో జీవితానికి సంబంధించిన ఈ నవల చదువరుల అభిమానం చూరగొనగలదని నమ్ముతున్నాము.

ఈ సంచికకు ముగ్గురు సినిమా తారలు తమ రచనలు పంపారు. కుమారి జమున తమ 'ఫాన్ మెయిల్' విశేషాలు వివరించారు. తారాపథం అందుకుంటున్న కుమారి వాసంతి బి. ఏ. సుప్రసిద్ధ నటి శ్రీమతి సావిత్రినిగురించి వ్యాసం వ్రాశారు. మాకు తెలిసినంతవరకూ ఇదొక కొత్తరకం వ్యాసం. సినిమా వారు ఒకరినిగురించి మరొకరు ఏమనుకుంటారో ఈ వ్యాసం చదివినవారు తెలుసుకొనవచ్చునేమో!

కొత్త సంవత్సరంతో వచ్చే కోర్కెలెట్లా ఉంటాయో శ్రీ రమణారెడ్డి వర్ణించారు. ఇంచుమించు అందరి కోరికలూ ఒక విధంగానే ఉంటాయనిపిస్తుంది, ఈ వ్యాసం చదివితే!

మన రాజధానిలో పగటివేషాలు చాలా రకాలు ఉంటాయి. ఒక రకంగురించి శ్రీపతి వ్రాశారు. ఈ రకం ఎటువంటిదో చదివినవారికి తెలుస్తుంది!

వరకట్నాలు ఇవ్వటం చాలక వాటిని గురించి చదవడం కూడా అవసరమా అని కొందరికయినా అనిపించవచ్చు. కాని శ్రీ రామచంద్రమూర్తిగారు ఎక్కువగా కాల్పనిక జగత్తునే వర్ణించారు!

నేటి మన సినిమాలపైన పాఠకుల అభిప్రాయాలు సేకరించే ఉద్దేశ్యంతో ఒక పోటీ నిర్వహిస్తున్నాము. దీనికి సంబంధించిన ప్రకటన 88 పేజీలో ఉన్నది.

ఆకుండర్ల గోపాలరావుగారు ఇంతకుముందే రెండు పండుగలు గురించి వ్రాశారు. వారు చెప్పినట్లు సంక్రాంతి మనదేశంలో చాలా ముఖ్యమైన పండుగ. పాఠకులందరికీ మా శుభాభినందనములు అందజేస్తున్నాము.

* * *

"సరియైన వేళకే ఆపరేషన్ ముగించాను. మరొక గంటాగితే దాని అవసరం లేకుండానే పేషంటు బ్రతికిపోయేవాడు!" అన్నాడు డాక్టరుగారు.